# ఆంధ్రప్రదేశ్

జూలై 1973



అధికార వర్గమూ, అభివృద్ధి కార్యక్రమాలు



ఆహార ధాన్యాల టోకు వ్యాపారం ప్రభుత్వ స్వాధీనం



నేటి సాంఘిక సమస్యలు



కోటంరాజు సోదరులు



50 పైసలు



# ఆంధ్రప్రదేశ్ గురించి

- 1971 జనాభా లెక్కల ప్రకారం, ఆంధ్రప్రదేశ్ జనాభా భారతదేశ జనాభాలో 7.93 శాతానికి, ఆంధ్రప్రదేశ్ విస్తీర్ణం భారతదేశ విస్తీర్ణంలో 9 శాతానికి సమానం.

- ఆంధ్రప్రదేశ్ విస్తీర్ణం 2,75,109 చ. కి. మీటర్లు.

- 1971 లో సేకరించిన లెక్కల ప్రకారం. ఆంధ్రప్రదేశ్ జనాభా 4,33,94,951 మంది. దేశ జనాభా 54,69,55,945.

- 1971 లెక్కల ప్రకారం, రాష్ట్ర జనాభాలో అక్షరాస్యులు 24.56 శాతం మంది వున్నారు. 1961 లో 21.19 శాతం. భారతదేశం మొత్తంమీద వున్న అక్షరాస్యుల శాతం 1971 లో 29.35. 1961లో 24.03 శాతం.

- మన రాష్ట్రంలో జనాభా సాంద్రత చ. కి. మీ. 1కి 157 మంది హైదరాబాదు జిల్లాలో సాంద్రత చ. కి. మీ. 1కి, 362. అన్ని జిల్లాల కంటే యిది ఎక్కువ. అదిలాబాద్ జిల్లాలో జనాభా సాంద్రత 79 మంది. అన్నింటి కంటే యిది తక్కువ.

- రాష్ట్రంలో తలసరి సగటు ఆదాయం (1960-61 నాటి ధరలు) మొదటి ప్రణాళిక అంతానికి రూ. 281లు. రెండవ ప్రణాళిక అంతానికి రూ. 306లు, మూడవ ప్రణాళిక అంతానికి రూ. 333 ల చొప్పున ఉంది. నాలుగవ ప్రణాళిక ముగింపు నాటికి తలసరి సగటు ఆదాయం రూ. 430 లకు పెరుగుతుంది.

- రాష్ట్రంలో 1,000 అడుగుల లోతు మేరలో సుమారు 1,000 మిలియన్ టన్నుల బొగ్గు నిక్షేపాలు వున్నాయి. 2,000 అడుగుల లోతు మేరలో 1,320 మిలియన్ టన్నుల బొగ్గు నిక్షేపాలు లభించగలవని అంచనా.

- భారతదేశంలో, బారైట్స్ ఉత్పత్తిలో ఆంధ్రప్రదేశ్ దే అగ్రస్థానం దేశంలో ఉత్పత్తి అయ్యే బా రైట్స్‌లో 90 శాతం మొదలు 95 శాతం వరకు రాష్ట్రంలో ఉత్పత్తి అవుతున్నది.

- అభ్రకం ఉత్పత్తిలో బీహారు, రాజస్థాన్ రాష్ట్రాల తరువాత స్థానం ఆంధ్రప్రదేశ్ ది.

# ఆంధ్ర ప్రదేశ్

సంపుటి : 17

జూలై, 1973
ఆషాఢ—శ్రావణ, 1895 శా. శ.

సంచిక : 9

ప్రధాన సంపాదకులు :
పెండ్యాల వామనరావు

సంపాదకులు :
ఈరంకి వెంకట సుబ్బారావు

దేశమును ప్రేమించుమన్నా
మంచియన్నది పెంచుమన్నా
వట్టిమాటలు కట్టిపెట్టోయ్
గట్టిమేల్ తలపెట్టవోయ్




పేజీ



మూడో అట్ట : బెంగుళూర్‌లో లాల్బాగ్ గార్డెన్సు. అందులోని "గాజు భవనం".

చివరి అట్ట : నెహ్రూ జూలాజికల్ పార్కులో "హిప్పో".

సాలు చందా : ఆరు రూపాయలు

విడిప్రతి : 50 పైసలు

రిజిస్టరు నెం : 133

# అభివృద్ధి కార్యక్రమాల్లో యువతరం పాత్ర

ప్రజాస్వామ్యం విజయవంతంగా పనిచేయడంలోనూ, ప్రజలకు సమాచారాన్ని అందజేసి వారిని విజ్ఞానవంతులను చేయడంలోనూ, ప్రజాప్రచార సాధనాలకుగల ప్రాముఖ్యాన్ని గురించి ఎంత చెప్పినా అతిశయోక్తి కాదు. రేడియో ప్రసారాలకు బహుళ ప్రచారం వచ్చినా, టెలివిజన్ కూడా ఆ స్థానాన్ని ఆక్రమించబోతున్నా, ప్రజలకు వార్తలను అందజేయడంలో దినపత్రికలు యింకా అతిప్రధానమైన, మిక్కిలి శక్తివంతమైన సాధనాలుగానే వుంటున్నవి. అక్షరాస్యుల శాతం రోజురోజుకు ఎక్కువవుతున్నప్పటికీ వారి మీద పత్రికల ప్రభావం వుండవలసినంతగా వున్నట్టుగా కనిపించదు. సాధారణంగా ఒక పత్రిక చందాదారుల సంఖ్య కన్నా పాఠకుల సంఖ్య చాలా ఎక్కువగా వుంటుంది. వీరి ద్వారానే ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ప్రజానీకంలోని అక్షరాస్యులకీ, కాస్తోకూస్తో చదువుకున్న వారికీ సమాచారం అందుతుంటుంది. పల్లెసీమల్లో ప్రజాభిప్రాయాన్ని తీర్చిదిద్దేది యిదే.

దినపత్రికల సర్క్యులేషను 83 లక్షల వరకువుంది. అంటే ప్రతి పది యిళ్లలో పూర్తిగా ఒక యింటికి కూడా పత్రికలు అందడంలేదు. అయితే వార్తాపత్రికల ప్రాధాన్యానికి పూర్తిగా దీనిని కొలబద్దగా తీసుకొనడానికి వీలులేదు.

రేడియో కేంద్రాలు ఎక్కువై ప్రసారకార్యక్రమాలు బాగా జరగడంవల్లా, అనేక విషయాల మీద ప్రసారాలను విస్తృతం చేయడంవల్లా వార్తా సమాచారాలను నిరంతరంగా ప్రజలకు అందించడానికి ఒక క్రమబద్ధమైన మార్గం ఏర్పడింది. రేడియోద్వారా జరిగే వార్తా ప్రసారాలు, ముఖ్యంగా ఆయా రాష్ట్రాలలో జరిగే ప్రాంతీయ వార్తాప్రసారాలు ప్రజలను బాగా ఆకర్షిస్తున్నాయి. గ్రామీణ ప్రాంతాలకు సమాచారం వ్యాపించే మార్గాల్లో యిదొకటి.

రేడియోను అత్యంత శక్తివంతమైన సామూహిక ప్రజా ప్రచార సాధనంగా పేర్కోవచ్చు. దేశంలో సుమారు 1.3 కోట్ల వరకు లైసెన్సుపొందిన రేడియోలు వున్నాయి. అంటే ప్రతి యిరవై యిళ్ళలోనూ సుమారు 5 యిండ్లలో మాత్రమే రేడియోసెట్లు వున్నాయి. ఈ పరిస్థితి యిప్పుడిప్పుడే యింకా మెరుగుపడుతోంది. అయితే రేడియో సెట్టులు వున్నవారి సంఖ్యవిషయములో పట్టణాన్నీ, పల్లెనూ పోల్చిచూస్తే యీ రెండింటికి చాలా వ్యత్యాసం కనబడుతుంది. సామాజిక రేడియో సెట్లు సుమారు 90,000 మాత్రమే వున్నాయి వీటిలో 18,000 వరకు ఆంధ్రప్రదేశ్‌లో వున్నాయి.

ప్రజలకు సమాచారాన్ని అందించడానికి వార్తాపత్రికలు, రేడియో, సినిమాలు — యీ మూడు సాధనాలనూ బాభసాటిగా వాడుకోవచ్చు. అవి మూడు ఒకదానికొకటి సహాయకారిగా వుంటాయి.

యువజన సంక్షేమానికి ప్రభుత్వం అత్యధిక ప్రాధాన్యత యిస్తున్నది. యిందుకుగాను ఒక డైరెక్టరు అధ్వర్యంలో ప్రత్యేకంగా ఒక శాఖ ఏర్పాటు చేయడం జరిగింది. ఇటీవల గ్రామీణ ప్రాంతాలలో వొళ్లొంచి, కష్టించి పనిచేయాల్సిన అనేక నిర్మాణాత్మక కార్యక్రమాలను ఎంతో ఉత్సాహంతో యువతరం చేపట్టింది. యువజనులు—ముఖ్యంగా విద్యావంతులైన యువతీ యువకులు అభివృద్ధి కార్యకలాపాలలో పాల్గొని మనఆర్థికవ్యవస్థ మెరుగుపడడానికి కృషిచేయాలి. యువతీ యువకుల శక్తిసామర్థ్యాలను సక్రమ మార్గంలో మళ్లించడం చాలా అవసరం. యువక సంఘాలు, యువజన సమితులు తమ శక్తిని యిందుకు ధారపోయాలి. ఆకాశవాణి ప్రసారం చేస్తున్న యువవాణి కార్యక్రమాలు బాగా ప్రాచుర్యం పొందుతున్నాయి. యువజనుల మీద అవి మంచి ప్రభావాన్ని కలుగ జేస్తున్నాయి. యువజనులు ఒక బలీయమైన శక్తిగా, గ్రామీణ ప్రాంతాల్లో ప్రయోజనాత్మకమైన సాంఘిక సంస్కరణలనుతీసుకువచ్చి శీఘ్రమైన అభివృద్ధికి దోహదం చేయగలరు. విధ్వంసక కార్య క్రమాలను నిరోధించడం, ఆహారపదార్థాల దుబారాను అరికట్టడం, విద్యుచ్ఛక్తి, మంచినీటిని పొదుపు చేయడం వంటి విషయాలను యువజనులు ఉద్యమస్థాయిలో చేపట్టి ప్రచారం చేయవచ్చును. వరుసగా కరువు పరిస్థితులు ఏర్పడుతుండడ వల్ల దేశం చాలా క్లిష్టకాలాన్ని ఎదుర్కొంటున్నది. తాము తప్పు దారిన నడవకుండా గ్రామీణ, పట్టణ ప్రాంతాల్లో ప్రజల్ని సక్రమమార్గాల్లో నడిచేట్టు చేయడంలో యువజనులు అత్యంతకీలకమైన పాత్ర నిర్వహించవచ్చు.

మతాతీత వ్యవస్థ ఏర్పాటు, అంటరానితనం నిర్మూలనం, ఆర్థిక, సాంఘిక, సమానత్వం—యివి తమ కార్యక్రమాలన్నిటా ప్రాతిపదిక అంశాలుగా చేసుకుని వాటిని ప్రచారంచేస్తూ, ప్రభుత్వ ఆస్తి ప్రజల ఆస్తి అనీ, దానికి నష్టం వాటిల్లజేస్తే మనకే నష్టం వాటిల్లినట్టనే సత్యాన్ని ప్రజలకు యువజనులు తెలియజెప్పాలి. సాధారణ పరిస్థితుల్లో చేపట్టే యిటువంటి ప్రబోధాత్మక కార్యక్రమాలు తప్పక ప్రజల హృదయాల్లో గాఢంగా నాటుకుపోయి ఒకవేళ ఎటువంటి అందోళనలైనా చెలరేగినప్పుడు ఆవేశపూరిత వాతావరణంలో విధ్వంసకకార్యకలాపాల్లోకి చొరబడకుండా నిరోధించేటట్టు తోడ్పడతాయి.

—పి. వి. ఆర్



# అధికార వర్గము - అభివృద్ధి కార్యక్రమం

[ గవర్నరు సలహాదారు శ్రీ హెచ్. సి. సరీన్ పరిపాలనా విషయాల భారతీయ సంఘం ద్వితీయ వార్షిక సమావేశంలో జూన్ 7 వ తేదీన చేసిన ప్రారంభోపన్యాసం ]

పరిపాలనా విషయాల భారతీయ సంఘం వార్షిక సమావేశ చర్చలకు ప్రారంభోత్సవం చేయడం నాకు చాల ఆనందదాయకమైన విషయం. పరిపాలనా విషయాలను గురించిన వివిధ అంశాల మీద చర్చలు కొనసాగించడానికి స్వతంత్రసంస్థ అయిన యూనివర్సిటీ ఆధ్వర్యాన మీవంటి పండితులు, విద్యావేత్తలు సమావేశం కావడం మరీ సంతోషకరం. "బ్యూరోక్రసీ – అభివృద్ధి కార్యక్రమం" అనే విషయం గురించి నన్ను ప్రసంగించమన్నారు. ఈ సమావేశంలో చర్చనీయాంశాలలో యిది ఒకటి అనుకుంటాను. అభివృద్ధి పొందుతున్న దేశాలన్నింటిలోనూ యీ విషయానికి ప్రత్యేక ప్రాధాన్యం వుంటుంది. మొదటి నుండి వెనుకబడిన దేశంగా వుంటూ, కేవలం వ్యవసాయంమీదనే ఆధారపడివుంటూ, పరిశ్రమల రంగంలో తన కాళ్ళమీద తాను నిలబడగలిగిన దశకు చేరుకున్న మన భారతదేశానికి యీ విషయం గురించిన చర్చ చాలా ప్రాధానమైనది. ఈ రంగాలలోనూ, యితర అభివృద్ధి రంగాలలోనూ ప్రభుత్వం అధికారవర్గం చాలా కీలకమైన పాత్ర నిర్వహించవలసి వుంటుంది.

స్వాతంత్ర్యం వచ్చిన రోజుల్లో సూదులు, దబ్బనాలు, చిన్న చిన్న స్క్రూలవంటి వస్తువులను కూడా దిగుమతి చేసుకుంటూ వుండేవాళ్ళం. కాని తరువాత 25 ఏండ్ల స్వల్పకాలంలోనే మోటార్లు, ఓడలు, యంత్రపరికరాలు, విమానాలు, రాడార్ యంత్రాలు అణు విద్యుత్కేంద్రాలు–నిజానికి ప్రతి రంగంలోనూ కావలసిన అత్యాధునికమైన యంత్రసామగ్రిని మనమే తయారుచేసుకునే దశకు చేరుకున్నాం. అంతే కాకుండా ఏ క్లిష్టమైన యంత్రాలనైనా మనమే రూపకల్పన చేసుకుని అభివృద్ధిపరచుకొని, మన అవసరాలకు అనుగుణంగా మార్పులు చేసుకోగలుగుతున్నాం కూడా. మరీ బాగా అభివృద్ధిచెందిన దేశాల చేరువకు మనం చేరుకోలేకపోయినప్పటికీ, మనం సాధించిన అభివృద్ధి విప్లవాత్మకమైనదనే విషయంలో సందేహంలేదు. ఇతర దేశాల్లో అర్ధ శతాబ్దంలో సాధించిన అభివృద్ధిని మనం రెండు దశాబ్దాలకాలంలో సాధించగలిగాం.

ఈ అభివృద్ధి కార్యక్రమ నిర్వహణలో బ్రహ్మాండమైన రాజకీయ, ఆర్థిక, సాంఘిక సమస్యలు మనకు ఎదురయ్యాయి. ఈ సమస్యలను గురించి ఆలోచించడం, వాటిని సమన్వయపరచడం వాటిని వదలకుండా వెంటాడి పరిష్కరించడం మొదలగు విషయాలలో జరుగవలసిన కృషి భారం చాలావరకు బ్యూరోక్రాట్ – అంటే ప్రభుత్వాధికారులమీద పడింది. బ్యూరోక్రాట్ అనే మాట వాడటం నిజానికి నాకు అంతగా యిష్టంలేదు. ఇప్పటి అర్థంలో అధికారి పరిపాలనా నిర్వహణలో సమర్థుడైతే, అతనిని బ్యూరోక్రాట్ అనవలసిన అవసరంలేదు. రెడ్ టేపిజానికి (అనవసరపు జాప్యం) బాధ్యుడై పార్కిన్‌సన్ న్యాయసూత్రాలను మాత్రమే పట్టుకుని వ్రేలాడుతూవుండి, మార్పును ప్రత్యేకంగా అభ్యుదయకరమైన చర్యలను ప్రతిఘటించడానికి సర్వప్రయత్నాలు చేస్తున్నవాడే యీనాడు బ్యూరోక్రాట్ అనిపించుకుంటాడు. అతను ఒక చిన్నపాటి దేవుడిగా ప్రవర్తిస్తుంటాడు. పొరపాట్లు జరుగకుండా వుండేందుకు ఆలస్యం అయినదల్లా మంచిదే అని నమ్ముతాడు. చేసినపనిని మళ్ళీ మళ్ళీ చూసుకునే పద్ధతిలో విశ్వాసం వుంచుతాడు. అతనికి సర్వం రూల్సు రూపంలోనే దర్శనం యిస్తుంది. గిరిదాటడు, సాంఘిక దృష్టి లేనివాడు. వున్నవ్యవస్థ మారకూడదనే నమ్మకం కలిగి దానికోసం కృషి చేస్తాడు. ప్రజల దృష్టిలో, ప్రభుత్వాధికారులు మాత్రమే యీ నిర్వచనం క్రిందికి వస్తారు.

నిజానికి యిది న్యాయమైన అంచనా కాదేమో. ఎందుకంటే, తాను పొందిన శిక్షణ వల్లనూ, అనుసరించే సంప్రదాయం వల్లనూ, ప్రభుత్వాధికారి అన్నిబాధలనూ మౌనంగా సహించవలసివుంటుంది. అందువల్ల అతనిని గురించి బైటికి కనిపించని విషయాలు ఎన్నో వుంటాయి. కాని మన దేశం అనేక కష్టాలను నష్టాలను ఎదుర్కొన్న గత 25 ఏండ్ల కాలంలో జరిగిన విషయాల రికార్డు మన ముందు వుంది. దేశం ఎంతో అభివృద్ధి సాధించినది. ప్రజాస్వామ్య వ్యవస్థ స్థిరపడింది. ఇదంతా తప్పనిసరిగా కొంతలో కొంత ఆలస్యంగానే జరుగక తప్పదు. కాని మన కండ్ల ఎదుటనే యిప్పుడు సంఘంలో విప్లవాత్మకమైన మార్పులు జరుగుచున్నాయనే విషయంకూడ మనం అంగీకరించవలసి వుంటుంది. మనకు వినిపిస్తున్న అసంతృప్తి వాదనలవల్లగానీ, విమర్శలవల్లగానీ మనం నిరుత్సాహం చెందవలసిన అవసరం ఏమీలేదు. ఇదంతా శుభసూచనగానే మనం భావించుకోవాలి. ప్రతిదీ దాని కర్మకు వదలి వేసే అభిప్రాయాలు వ్యాప్తమైన కాలానికి యిది భారతవాక్యం అని మనం గ్రహించాలి. మన ప్రజలు తమ హక్కులేమిటో గుర్తిస్తున్నారు. తమ ఆశలు, ఆశయాలు

ఏమిటో పోల్చుకో గలుగుతున్నారు. కొంతవరకు ఆదుర్దా అసంతృప్తి వ్యక్తం చేయడానికి కూడ వారికి హక్కు వుంది.

ముప్ఫయి సంవత్సరాల క్రితం — బీహారులో నేను సబ్ డివిజనల్ ఆఫీసరుగా పనిచేసినప్పటి రోజులు గుర్తు వస్తున్నాయి. ఆ రోజుల్లో సబ్ కలెక్టరు యొక్క ప్రధానమైన బాధ్యత పన్నులు వసూలుచేయడం, శాంతిభద్రతలు సంరక్షించడం, సాధారణ పరిపాలన విషయాలు చూసుకోవడం. 10 లక్షల జనాభా కలిగిన ఒక సబ్‌డివిజన్ కేంద్రాన్ని యిద్దరు అధికారులు మాత్రమే నిర్వహిస్తుండేవారు. రాకపోకలు, వార్తాసౌకర్యాలు అధ్వాన్నంగా వుండేవి. రోడ్లు చాల చెడుగా వుండేవి, అసలు వుండేవి కూడ కాదు. టెలిఫోన్లు చాల తక్కువ. తరచుగా చెడిపోతూ వుండేవి. యిప్పటిలాగా వైర్‌లెస్, టెలెక్సు యంత్రాలు వుండేవికావు. అసలు అభివృద్ధి కార్యక్రమాల వాతావరణమేలేదు. ఇవ్వాళ వృత్తి కల్పన పథకాల కోసం, పారిశ్రామిక వేత్తలకు మనం మూలధనం సమకూరుస్తున్నాం. మిగిలిన 80 వంతుల పెట్టుబడి బ్యాంకులు యిస్తున్నాయి. ఇటువంటి సౌకర్యం ఆ రోజుల్లో వూహించడానికే వీలుండేదికాదు. అధికారి న్యాయబద్ధుడై పనిచేస్తూ, కష్టపడి పనిచేసి, తగాదాలు వగైరా పెద్ద గొడవ కాకుండా తీర్చగల్గి, బాగా తన అధికార పరిధిలోని ప్రాంతమంతాతిరుగుతూ, యింకా యితర విషయంలో — అంటే క్రీడలు, ఫోటోలు, పుష్పప్రదర్శనలు, ఆరోగ్యవారోత్సవాలు మొదలగు వాటిలో శ్రద్ధ తీసుకుంటూ వుంటే, అతను చాల మంచి పనితనం గలవాడనీ, గట్టివాడనీ అనుకునేవారు.

ఈ ముప్ఫయ్, ముప్ఫయ్అయిదేళ్ళలోనూ జిల్లా పాలనాధికారి ఎంతగానో పురోగమించాడు. నిజానికి రెవిన్యూ, శాంతిభద్రతలు చాలా ముఖ్యమైన విషయాలే అయినప్పటికీ ఆయన చేపట్టవలసిన విధులలో చాలా చిన్న విషయాలు మాత్రమే. ఈనాడు ఎన్నెన్నోసమస్యల్ని పరిష్కరించవలసిన గురుతర బాధ్యత ఆయన మీదవుంది. పారిశ్రామిక, వ్యవసాయ, విద్య, వైద్య సాంస్కృతిక, సాంఘిక రంగాలవంటి అన్నిరంగాలలోనూ జరిగే అభివృద్ధికి ఆయనే యినాడు బాధ్యుడు. ఆయన అధ్యర్యంలో నిధులు వుంటాయి. సిబ్బంది వుంటుంది. ఆయనచేపట్టే పనుల ఫలితాలను బట్టి. ప్రజల అవసరాలను తీర్చడంలో చూపించే ఆసక్తిని బట్టి, చేసే సహాయాన్ని బట్టి ఆయనను గుర్తించుకొంటారు ప్రజ. తన వ్యవధినీ, తనదగ్గర వున్న నిధులనూ ఉత్తమోత్తమంగా, ప్రయోజనకరంగా వినియోగించడానికి ఆయనకు వీలుంది. దేనితర్వాత ఏది చేపట్టాలో ఆలోచించి చేయడానికి అవకాశంవుంది. మరోరకంగా చెప్పాలంటే ఆయన చక్కని పరిపాలకుడు మాత్రమే కాదు సమర్థుడైన మేనేజరు కూడా. అందువల్ల ఆయన మామూలుగా కాక తద్భిన్నంగా శిక్షణ పొందవలసివుంది. సూక్ష్మంగా పరిశీలించి చెప్పవలసివస్తే యీవిధమైన శిక్షణ యీయనకు యీనాడు లభిస్తూనేవుంది. ఇప్పుడు మనం ప్రభుత్వాధికారిని గురించి ఆలోచించినప్పుడు గుర్రాలెక్కి తిరిగో, వేటాడో, లేదా ఏటెన్నిసో, పోలోఆడి తన సమయాన్ని చాలా వరకు ఖర్చుపెట్టే వెనకటి సాహెబ్‌లగురించి కాదు ఆలోచించవలసినది, అందుకు భిన్నమైన వ్యక్తిని గురించి ఆలోచించాలి.

ప్రణాళికా బద్ధమైన ప్రగతిసిద్ధాంతాన్ని యీనాడు బాగా వృద్ధి చెందుతున్న దేశాలు అంగీకరించాయి. ఆర్థికవ్యవస్థలోని కొన్ని కీలకమైన, ప్రాణాధారమైన అంశాలమీద అజమాయిషీ వహించి అభ్యుదయాన్ని ప్రతిష్ఠించే గురుతర బాధ్యత నెలకొన్న వ్యవస్థయిది. అభివృద్ధిచెందిన ఏదేశంలో కూడా ప్రాతిపదిక పరిశ్రమలు శీఘ్రంగా అభివృద్ధి చెందడానికి అవసరమయే వనరులుగాని, నైపుణ్యంగాని ప్రయివేటురంగానికి లేదు. ఈ బృహత్తర కృషికి అవసరమయ్యే విస్తారమైన పెట్టుబడులను పెట్ట గల సమర్థత ఒక్క ప్రభుత్వానికే వుంది.

మనదేశాన్నే తీసుకుందాం. 1951 లో తొలి పంచవర్ష ప్రణాళిక ప్రారంభమైనప్పుడు మొత్తం 29 కోట్ల రూపాయల పెట్టుబడితో ప్రభుత్వరంగం పరిశ్రమలు 5 మాత్రమే వున్నాయి. ఈనాడు మొత్తం 5,000 కోట్ల రూపాయల పెట్టుబడితో అటువంటివి 100 పరిశ్రమలు వున్నాయి. రోడ్డురవాణా, నౌకా నిర్మాణం పౌర విమానయానం వ్యవసాయం, వంటి యితర రంగాలలో కూడా యిదే మాదిరి అభివృద్ధి జరిగింది.

వీటన్నిటివల్లా ప్రభుత్వం బాధ్యతలు, కార్యక్రమాలు ఎక్కువయ్యాయి సంక్షేమరాజ్య నిర్మాణం అనే లక్ష్యం యీ యిరవయ్యో శతాబ్దంలో వెల్లివిరిసింది. ఈ బ్రహ్మాండమైన బాధ్యతని ప్రభుత్వం ఎలా నిర్వర్తిస్తుంది? ఈ బాధ్యతలో ఎక్కువ భాగం పౌర పరిపాలనాధికారుల భుజస్కంధాల మీద పడింది, అయితే అభివృద్ధి చెందుతున్న దేశాల్లో యీ బాధ్యతల్ని నిర్వర్తించే సాధన సంపత్తి అంతగా లేదు. ప్రతి రంగంలోనూ అర్హత వున్నవాళ్ళు, శిక్షణపొందిన వాళ్ళు చాలా తక్కువగానే వున్నారు.

నూతన రంగాలలోనూ, క్లిష్టమైన రంగాలలోనూ, పరిపాలన విషయంలో బహుముఖ అవసరాలతోపాటు పౌర పరిపాలనాధికారి ప్రజలలో వెల్లివిరుస్తున్న నూతన చైతన్యాన్ని కూడా గుర్తుంచుకోవాలి. ప్రజలు తమ జీవన ప్రమాణం త్వరత్వరగా మెరుగుపడాలని వాంఛిస్తారు. ఉన్న సంపదని సమంగా అందరికీ పంపిణీ కావాలని ఆశిస్తారు. సాంఘిక న్యాయం జరగాలనీ, సమానావకాశాలు లభించాలనీ కోరతారు. శిక్షణావసరాలను గురించి, దాని లక్ష్యాలను గురించి సక్రమంగా మదింపు జరిగినప్పుడే ప్రభుత్వం చేపట్టే ఏ కార్యక్రమం అయినా విజయవంతం అవుతుంది. ప్రధాని చెప్పినట్టుగా పరిపాలనా అధికార్లకు ఇచ్చే శిక్షణా కార్యక్రమాలన్నీ భవిష్యత్తును దృష్టిలో పెట్టుకునిజరగాలి. అవి అవసరం ప్రాతిపదికగా జరగాలి. నిర్మాణాత్మకమూ, సమస్యా పరిష్కారమూ అయినవిగా వుండాలి. ఆర్థికాభివృద్ధి సాంఘిక ప్రగతికి సంబంధించిన కార్యక్రమాల ప్రాతిపదిక లక్ష్యాలు స్పష్టంగా వుండాలి. దేశంలో రానున్న మార్పుల్ని గూర్చి యీనాటి కొత్తపరిపాలనాధికారికి క్షుణ్ణంగా తెలిసి వుండాలి. ఈ మార్పులో ఏజెంటుగా తాను వహించవలసిన పాత్రను గురించి స్పష్టమైన అవగాహన ఆయనకు వుండాలి.

మనం సాధించదలస్తున్న సోషలిస్టు తరహా సమాజంలో పరిపాలనాధికారి బీద ప్రజల సమస్యలతోనూ, ప్రజల్లో ఎక్కువ మంది నివసిస్తోన్న గ్రామీణ ప్రాంతాల పల్లెప్రజల సమస్యలతోనూ తనను తాను అంకితమై కలగలసిపోవాలి. ప్రభుత్వోద్దేశాల విషయంలోగాని, సాంఘిక లక్ష్యాల విషయంలోగాని ఎంతమాత్రం

ఆయనకు నిరాశ పనికిరాదు నిర్లిప్తత కూడదు అధికారుల దృక్పథంలో–ముఖ్యంగా ప్రజలతో సన్నిహిత సంబంధం వుండడానికి వీలయిన క్రింది స్థాయిల్లోని వ్యక్తుల దృక్పథాల్లో వెంటనే పెద్ద ఎత్తున మార్పు రావలసిన అవసరం చాలా వుంది. ప్రజలతో వ్యవహరించేటప్పుడు నమ్రత వుండాలి. త్వరత్వరగా పనులు నెరవేర్చడం కావాలి శ్రద్ధగా ఆలకించడం కావాలి. ఏ ప్రజల సంక్షేమం కొరకు పనిచేయడానికి జీతం పొందుతున్నారో ఆ ప్రజలయెడల నిజమైన సానుభూతి, తపన వున్న వ్యక్తుల చేతనే పాలనా నిర్వహణ కొనసాగాలి.

ప్రభుత్వ పాలనా నిర్వహణలో రోజురోజుకు విస్తరిస్తోన్న బహుముఖ బాధ్యతల దృష్ట్యానూ, అభివృద్ధికై ఎక్కువవుతోన్న వత్తిడి దృష్ట్యానూ ఆధునిక మేనేజిమెంట్ పద్ధతుల్ని ప్రభుత్వోద్యోగులు తెలుసుకోవాలి. ప్రజాపాలనా నిర్వహణాధికారి ఒక మేనేజరుగా చేయవలసిన అతిముఖ్యమైన బాధ్యత వనరులను సక్రమంగా నిర్వర్తించడం. ఆ వనరులు పరికరాలైనా కానివ్వండి, మనుషులైనా కానివ్వండి, వాటిని సక్రమంగా నిర్వహించాలి మామూలు తెలివితేటల మీద ఆధారపడడం కన్నా సాధన సంపత్తులను సాధ్యమైనంత ఎక్కువ మేరకు వినియోగించే నేర్పునూ, పద్ధతుల్నీ వారు తెలుసుకోవాలి.

సాంఘిక అభివృద్ధి పద్ధతులలో ప్రభుత్వ కార్యక్రమాలు పథకాలు. ప్రాజెక్టులు అన్నిటిని 'ఖర్చు ప్రయోజనం' ప్రాతిపదిక పై సమీక్షించాలి. కొన్ని సందర్భాలలో సాంకేతిక, ఆర్థిక విషయాల పై గాక యితర విషయాలను పరిగణలోకి తీసుకుని నిర్ణయాలు తీసుకోవాల్సి వస్తుంది. అందుచే అన్ని అంశాలను క్షుణ్ణంగా పరిశీలించిన తర్వాతనే అటువంటి నిర్ణయాలు తీసుకోవాల్సి ఉంటుంది.

ప్రభుత్వంలోని మేనేజిమెంటు వ్యవహారాల పునశ్చరణతోపాటు పబ్లిక్ అడ్మినిస్ట్రేషన్, రంగంలోను యితర వివిధ స్థాయిలలో ఆధారపడదగిన, సరిఅయిన సమాచారం సేకరణ, నియంత్రణ పద్ధతులలోను అభివృద్ధి చాలా అవసరం. ప్రస్తుతం దిగువ స్థాయినుండి కోకొల్లలుగా సమాచారం ఎగువస్థాయికి అందరం మనం చూస్తున్నాము ఇది చాలావరకు వ్యవస్థీకృతంగా ఉండడంలేదు. ఈ సమాచారమైనప్పటికీ, అది అత్యవసర సమాచారమైన చోటకు అందడం లేదు కనీసం సకాలంలోనైనా అందడం లేదు.

సరిఅయిన సమాచార సేకరణ, నియంత్రణ పద్ధతుల అభివృద్ధి, పటిష్టమైన సుపరిపాలనకు మూల ప్రాతిపదికగా ఉంటుంది.

అన్నిస్థాయిలలో మనం సర్వతోభివృద్ధి కావాలనుకున్నప్పుడు, అధికార దత్తంచేసే విషయంపైకూడా మనదృష్టిని కేంద్రీకరించాల్సి ఉంటుంది. సత్వర ఫలితాలకు అధికార కేంద్రీకరణ అభిలషణీయంకాదు విధులను రూపొందించడం, నిర్ణయాలు తీసుకోవడం వంటి విషయాలను ఉన్నతాధికారులకు ఉన్నప్పటికీ దిగువస్థాయిలో పనిచేసే వారికి స్వేచ్ఛవుండాలి. ఒకసారి నిర్ణయంఅంటూ తీసుకున్న తర్వాత దానిని అమలుజరిపే విషయంలో వారికి విస్తృతి ప్రాతిపదికపై స్వేచ్ఛవుండాలి. పనిని సత్వరంగా చేయడంలోను, రంగంలో ఉండి పనిచేసే అధికారులలో ఆత్మవిశ్వాసం ఏర్పడడంలోను, యిది దోహదం చేయడమేగాక, మరింత ఎక్కువ బాధ్యతలు స్వీకరించడానికి వీలుకలుగుతుంది. ఈ సందర్భంగా పౌర అధికారులకు ఎంపికచేసే విషయం ప్రత్యేక ప్రాధాన్యాన్ని సంతరించుకుంటుంది.

కార్యనిర్వహణ, పని మదింపు విషయాలు అధికారుల సమతలో ప్రధాన అంశాలు సత్ఫలితాలను సాధించడానికి వీలుగా కార్యాన్ని సమర్థవంతంగా నిర్వహించిన వారికి తగిన బహుమతి యివ్వడం, అసమర్థతకు దండించడంవంటి పద్ధతులను రూపొందించాలి పనిని సంతృప్తికరంగా పూర్తి చేసేవారిని ప్రోత్సహించాలి. ప్రస్తుతపు పద్ధతులలో తప్పుచేసిన వారిని శిక్షించడం, బాగా పనిచేసిన వారికి తగిన ప్రతిఫలం యివ్వడం సాధ్యం కావడంలేదు. తత్ఫలితంగా నైతికంగా బలహీనత ఏర్పడి మంచి పరిపాలకునికి కావల్సినచొరవ, ఉత్సాహం లోపిస్తున్నాయి.

ప్రజలు తాము అర్థంచేసుకోలేని విషయాలను, తమనుండి దాచేవిషయాలను అనుమానస్పదంగా చూస్తారు. రహస్యమనేది అధికార వర్గాలకు సహజమైన విషయంగా ఉంది. ప్రత్యేకమైన నిర్ణయాన్ని గూర్చి అది ప్రజల జీవనంపై ప్రత్యక్షప్రభావం కలిగించే నిర్ణయమైనప్పటికీ దాన్నిగూర్చిగానీ, ఆ నిర్ణయాన్ని తీసుకోవడానికి దారితీసిన పరిస్థితులనుగూర్చిగానీ ప్రజలకు తెలియజేయడం జరగడంలేదు. ప్రభుత్వానికీ వ్యక్తులకూ మధ్య సంబంధాలు చాలా అరుదు. ముఖ్యమైన చర్యల లక్ష్యాలనుగూర్చి వాటిని సాధించే విధాలను గూర్చి ప్రజలకు తెలియజేయడం అనేవిషయం తన బాధ్యతలలో ఒకటిగా

ప్రజాస్వామ్య వ్యవస్థలో ప్రభుత్వ ఉద్యోగులందరూ పార్లమెంటుకుగానీ, శాసనసభలకుగానీ జవాబు దారీ అవుతారు. వారు ప్రజల ప్రయోజనాల సంరక్షకులు. ప్రజాస్వామ్య వ్యవస్థకు వారు మూల ప్రాతిపదికవంటివారు. అయితే శాసనకర్తలుకూడా నిర్మాణాత్మకమైన, ప్రయోజకరమైనపాత్ర నిర్వహించగలుగుతారు. ప్రతి చిన్న పొరపాటుకు శిక్షించే దృక్పథం అనుసరిస్తే వారే అవరోధంగా పరిణమించవచ్చు సత్ఫలితాలను సాధించాలనుకున్నప్పుడు బృహత్తరమైన పనులన్నిటిలో నిజాయితీగల ఉన్నతాధికారులు అక్కడికక్కడ సత్వరనిర్ణయాలు తీసుకోవాల్సిఉంటుంది. అటువంటి పరిస్థితులలో కొన్ని పొరపాట్లు జరగడం సహజం. వాటిని పెద్దగా చేసి చూడరాదు. కార్యనిర్వహణనంతటిని దృష్టిలో ఉంచుకొని ఆ విషయాలను చూడాలి.

ప్రభుత్వ ఉద్యోగులు, వారికి ఎటువంటి నిర్వచనం యిచ్చినప్పటికి వారు సాంఘికమార్పులోనూ అభివృద్ధి విషయాలలోనూ. ప్రజాస్వామ్యానికి ప్రతిబంధకం కారని నేను పునరుద్ఘాటిస్తున్నాను. అయితే ఎటువంటి సందర్భంలోను వారు లేకుండా మనం ఏ పని చేయలేము. వారు పరికరాలవంటివారు. వారిని నేర్పుగా ఉపయోగించుకుంటే ఆశించిన లక్ష్యాలను సాధించవచ్చు. స్వతహాగా వారికెటువంటి అధికారాలు లేవు. ఉన్నతాధికారంలో ఉన్నవారికి వారు ప్రతిబింబాలు. వారిని మనం రూపొందించుకున్నాము. వారికి శిక్షణనిచ్చాము. మనకనుగుణంగా ఉపయోగించుకుంటున్నాము ఇటువంటి ఏర్పాట్లు భగ్నమైనచోట ప్రజాస్వామ్యంలో సమస్యలు తలెత్తుతాయి.

# ఆహార ధాన్యాల టోకు వ్యాపారం ప్రభుత్వ స్వాధీనం

## కొన్ని ప్రశ్నలు-జవాబులు

ప్రశ్న 1. ఆహార ధాన్యాల టోకు వ్యాపారాన్ని ప్రభుత్వం ఎందుకు చేపడుతోంది ?

జవాబు : ఉద్దేశ్యాలు :

(i) అతి లాభాపేక్షతో జరిపే వ్యాపారాన్ని, ధరలలో ఒడుదుడుకులనీ తొలగించేందుకు మార్కెటుకువచ్చే మిగులు ధాన్యాలను కటుదిట్టంగా ప్రభుత్వం అదుపులోకి తీసుకొని ధాన్యం లభ్యమయ్యేటు చూడటం.

(ii) ఉత్పత్తిని పెంచి, ప్రభుత్వ ఏజన్సీలకు దానిని అమ్మేట్టుగా ప్రోత్సాహం కల్పిస్తూ, పండించేవారికి ప్రతిఫలంగా సరయిన ధరలు గిట్టుబాటయ్యేట్టు చూడటం.

(iii) వాడకందార్లకు, అందులోను-ఇబ్బంది పడే సామాన్య వరాలకు హేతుబద్ధమయిన ధరలకు సరుకు లభ్యమయ్యేట్టు చూడటం.

(iv) అనవసరమయిన దళారులను తొలగించి, పద్ధతిని కట్టుదిట్టంచేసి టోకు వ్యాపారంలో జరుగుతున్న ఖర్చును తగ్గించటం.

ప్రశ్న 2. ఆహార ధాన్యాల టోకు వ్యాపారు లేమవుతారు ?

జ. టోకు వ్యాపారాన్ని ప్రభుత్వంస్వాధీనం చేసుకోవడం వల్ల ప్రయివేటు టోకు వ్యాపారులను తొలగించినట్లవుతుంది. స్వాధీనం చేసుకున్న తర్వాత టోకు వ్యాపారాన్నంతటినీ ప్రభుత్వ ఏజన్సీలు నిర్వహిస్తాయి.

ప్రశ్న 3. ప్రభుత్వం టోకు వ్యాపారాన్ని స్వాధీనం చేసుకుంటే చిన్న వ్యాపారులకు నష్టమా ?

జ. లేదు. ఆహార ధాన్యాలను ప్రభుత్వం స్వాధీనం చేసుకునే పథకంలో చిన్న వ్యాపారులు, 'చిల్లర' వ్యాపారులకు అవకాశం కల్పించారు. వారు ఒక లైసెన్సు పొందవలసి ఉంటుంది. రాష్ట్రంలో పరిస్థితిని బట్టి వారు జరిపే కొనుగోలు/అమ్మకం/నిల్వలు హేతుబద్ధమయిన ఒక గరిష్ఠ పరిమితికి లోబడి ఉంటాయి. ఉదాహరణకు గోధుమకు మిగులు రాష్ట్రమయిన పంజాబులో చిల్లర వ్యాపారులు 100 క్వింటాళ్ల సరుకు నిల్వచేసేందుకు అనుమతి ఉంటుంది. మధ్యప్రదేశ్‌లో ఇది 15-25 క్వింటాళ్లకు పరిమితమయి ఉంటుంది.

ప్రశ్న 3. ఈ నిర్ణయం గోధుమకు మాత్రమే వర్తిస్తుందా ? లేక ఇతర ధాన్యాలు కూడా ఇందులోకి వస్తాయా ?

జ. టోకు వ్యాపారాన్ని స్వాధీనం చేసుకోవడమనే నిర్ణయం ప్రస్తుతానికి గోధుమకు మాత్రమే వర్తిస్తుంది. వచ్చే సీజను నుంచి బియ్యం వ్యాపారం కూడా చేపట్టాలన్న ప్రతిపాదన ఉంది.

ప్రశ్న 5. టోకు వ్యాపారాన్ని ప్రభుత్వం స్వాధీనం చేసుకోవటం వల్ల ధరలలో మార్పెలా ఉంటుంది ?

జ. ధాన్య సేకరణకు నిర్ణయించిన ధర ఆ యా రకాన్ని బట్టి క్వింటాల్‌కి రు. 76 నుంచి 82 రు.ల దాకా ఉంటుంది. ప్రభుత్వ ఏజన్సీలు ఈ రేటుకు గోధుమ కొంటాయి. సేకరించిన ధాన్యాన్ని హేతు బద్ధమయిన ధరలకు ప్రజలకు అమ్ముతారు. నమోదు చేయించుకున్న చిల్లర వ్యాపారులు కూడా ప్రభుత్వ ఏజన్సీలతో పాటు ధాన్యం కొనుగోలు చేయవచ్చు. ప్రభుత్వం నిర్ణయించిన ధరలకు వారు ధాన్యాన్ని అమ్మవలసి ఉంటుంది.

ప్రశ్న 6. గోధుమ/బియ్యము హేతు బద్ధమయిన ధరలకు వాడకం దారుకు లభిస్తాయా ?

జ. వాడకం దార్లకు చౌక ధరల దుకాణాలనుంచి నిర్ణీత ధరలకు సప్లయిలు లభిస్తాయి. చౌక ధరల దుకాణాల ద్వారా నిర్ణయించిన ధరలకు చిల్లర వర్తకుల వద్ద కూడా ధాన్యం కొనవచ్చు.

ప్రశ్న 7. చిల్లర వ్యాపారికి ఎంత మేరకు లాభం ఉంటుంది ?

జ. ధాన్య సేకరణ ధరకు తగ్గని రేటున చిల్లర వ్యాపారి ధాన్యం కొనుగోలు చేసి నిర్ణయించిన ధరకే ధాన్యాన్ని అమ్మటం వలన, కొనుగోలు, అమ్మకం ధరల మధ్యగల తేడామీద చిల్లర వ్యాపార లాభం ఆధార పడుతుంది.

ప్రశ్న 8. చిల్లర వ్యాపారులు దొంగ చాటుగా సరకు నిల్వచేసుకుని, లేదా ఎక్కువ ధరలకు అమ్మినప్పుడు కఠిన శిక్షలు ఉంటాయా ?

జ. రాష్ట్ర ప్రభుత్వాలు జారీ చేసిన ఉత్తర్వుల క్రింద సందర్భానికి తగిన శిక్ష విధించవచ్చును.

ప్రశ్న 9. దేశం వివిధ ప్రాంతాల్లో సరిగా పంపిణీ జరిపేందుకు ప్రభుత్వానికి యంత్రాంగం ఉందా ?

జ. ఉంది. ఇప్పటికే చౌక ధర దుకాణాలు చాలా (1,73,000కు పైగా) ఉన్నాయి. అంతేగాక చిల్లర వ్యాపారులు, చిన్న వ్యాపారులు సమాజానికి కావలసిన ధాన్యం సమకూర్చుతారు. గ్రామాల్లో ఉత్పత్తి

దార్లు చిన్న మొత్తాల్లో ధాన్యాన్ని చిల్లర వ్యాపారులకు, వాడకం దార్లకు స్వేచ్ఛగా అమ్ముకోవచ్చు.

ప్రశ్న 10. ఇటువంటి భారీ కార్యక్రమాన్ని చేపట్టేందుకు వృత్తిరీత్యా అవసరమయిన నైపుణ్యం ప్రభుత్వానికి ఉన్నదా ?

జ. ఉంది, ప్రభుత్వ ఆహార సంస్థతోపాటు వివిధ రాష్ట్రాల్లో కో ఆపరేటివ్ మార్కెటింగ్ ఫెడరేషన్లు, వాటి అనుబంధ సంస్థలు, కేంద్రంలోను, రాష్ట్రాల్లోను గిడ్డంగి సంస్థలు, రాష్ట్ర సివిల్ సప్లయి శాఖ, ఆహార శాఖ, ధాన్యాల టోకు వ్యాపారాన్ని నిర్వహిస్తాయి. మార్కెటు నిర్వహణలో ఈ సంస్థలన్నీ ఏండ్ల తరబడి అనుభవం గడించాయి.

ప్రశ్న 11. ఆహార ధాన్యాల టోకు వ్యాపారాన్ని ప్రభుత్వం స్వాధీనం చేసుకోవటం వల్ల వ్యాపారంలో ఉన్న లక్షలాది మంది నిరుద్యోగు లవుతారంటూ టోకు వ్యాపారులు చేస్తున్న ప్రకటనలు సరయినవా ? ఆ రంగంలో నిరుద్యోగులయ్యే వారి అనుభవాన్ని ఉపయోగించుకోవాలని ప్రభుత్వం తలపెట్టిందా ?

జ. గోధుమ టోకు వ్యాపారాన్ని ప్రభుత్వం స్వాధీనం చేసుకున్నంత మాత్రాన నిరుద్యోగము పెద్దగా ప్రబలదు. శుభ్రపరచడం/బళ్ల కెత్తడం/దింపడం/తూనిక వేయడం/బస్తాలు కుట్టడం/మొదలయిన పనులు కొనసాగ వలసి ఉంటుంది. టోకు వ్యాపారం జరుపుతున్న కమిషన్ ఏజెంట్లు కూడా ప్రభుత్వ ఏజన్సీలకూ, ధాన్యం ఉత్పత్తిదార్లకూ వివిధ సర్వీసులను ఏర్పాటు చేయటంలో పాల్గొంటారు. ధాన్యం టోకు వ్యాపారులు మిగతా ధాన్యాల వ్యాపారం కొనసాగించవచ్చు.

పశ్న 12. ప్రభుత్వం ఈ వ్యాపారాన్ని స్వాధీనం చేసుకోవటం ఆహార ధాన్యాలు పండించే రైతులకు లాభమా?

జ. రైతులకు తమ పంటకు ఒకే సేకరణ ధర లభ్యమవుతుందన్న హామీ ఉంటుంది. ఇదివరకు అన్ని తరహాల ధాన్యాన్ని ఒక్కటే రేటున ప్రభుత్వం కొంటూవచ్చినందున మేలిరకాలకు ఇప్పుడు హెచ్చు ధరలు నిర్ణయించారు. గ్రామాల సమీపంలో ధాన్యం కొనుగోలుకు కొత్త కేంద్రాలు ఏర్పాటవుతాయి. రైతులు తమ ధాన్యం రవాణా చేసేందుకు పెట్టే ఖర్చు తగ్గుతుంది.

ప్రశ్న 13. పంటను ఏ ఏజన్సీ అంచనా కడుతుంది? అందులో మార్కెటుకు పంపేందుకు అదనపు ధాన్య మెంత అని ఎవరు నిర్ణయిస్తారు?

జ. ఈ పథకం మొత్తం మీద మార్కెటుకు వచ్చే ధాన్యంపైన ఆధారపడుతుంది. మధ్యప్రదేశ్, బీహార్ వంటి కొన్ని రాష్ట్రాల్లో వ్యవసాయ దారులు నిర్దిష్టమయిన రేటుకు నిర్బంధ పద్ధతిని గోధుమ అమ్మవలసి ఉంటుంది, చిన్న చిన్న రైతులకు ఈ నిర్బంధ పద్ధతి వర్తించదు. సాగు చేసిన పొలం ఎక్కువయ్యే కొద్దీ రైతు ఇంకా ఎక్కువ ధాన్యం నిర్బంధంగా ఇవ్వవలసి ఉంటుంది.

ప్రశ్న 14. ఆహార ధాన్యాల చిల్లర అమ్మకానికి వాడకం దార్ల సహకార సంస్థలను ప్రభుత్వం ఉపయోగించుకుంటుందా?

జ. ఉపయోగించుకుంటుంది. చిల్లర అమ్మకానికి గ్రామీణ ప్రాంతాల్లో మార్కెటింగ్, సర్వీసు సంస్థలను, పట్టణ ప్రాంతాల్లో వాడకం దార్ల సహకార సంస్థలను సాధ్యమయినంత ఎక్కువగా ఉపయోగించుకుంటారు.

ప్రశ్న 15. పబ్లిక్, ప్రయివేటు రంగాలు కలిసి పని చేసేట్టు ఈ మార్పును ప్రవేశ పెడితే అది బాగుండేదా ?

జ. ఒక విధంగా చూస్తే ఈ రెండు రంగాలు కలిసి పని చేస్తున్నట్టే. ఎందుకంటే ప్రయివేటు చిల్లర వ్యాపారులు ఈ పథకం క్రింద ధాన్యాన్ని అమ్మటంలో పాల్గొంటారు. టోకు వ్యాపారులు ధరలు పెరుగుతాయన్న భావంతో ధాన్యం దాచటం కొనసాగిస్తున్నందున ఈ పథకంలో పాలొనబోరన్నది విదితమే.

ప్రశ్న 16. ప్రభుత్వం టోకు వ్యాపారాన్ని స్వాధీనం చేసుకోవటం వల్ల ప్రయివేటు రంగం పెద్ద ఎత్తున పెట్టుబడి పెట్టటం దెబ్బతింటుందా ?

జ. టోకు వ్యాపారంలో ఉంచుతూ వచ్చిన నిధులను ఇప్పుడు ఉత్పత్తి దాయకమయిన ఇతర కార్యకలాపాలకు ఉపయోగించవచ్చు. ప్రభుత్వం ప్రోత్సహించ దలచిన ఇతర కార్యకలాపాలకు ఆహార ధాన్యాల టోకు వ్యాపారాన్ని స్వాధీనం చేసుకోవటం ద్వారా నిరుత్సాహ పరచినట్టు కాదు.

ప్రశ్న 17. ఆహార ధాన్యాల టోకు వ్యాపారం స్వాధీనం చేసుకునే కార్యక్రమానికి భారీ పెట్టుబడి అవసరమయి, అది ద్రవ్యోల్బణానికి దారితీస్తుందా ?

జ. గోధుమ టోకు వ్యాపారాన్ని స్వాధీనం చేసుకునే కార్యక్రమానికి భారీ పెట్టుబడి అవసరమని కొందరు భావించినా, ఇప్పటికి పెట్టిన నిధులను మించిన మొత్తాలు అవసరం లేదు. ప్రభుత్వ ఆహార సంస్థకు కేటాయించిన నిధులు, ప్రయివేటు టోకు వ్యాపారులకు మామూలుగా మంజూరు చేసే అప్పులు కలిపితే గోధుమ టోకు వ్యాపారం స్వాధీనం చేసుకునేందుకు పూర్తిగా సరిపోతాయి. ఇంకా పెటడినా అదనంగా కావలసిన మొతాలు అంత ఎక్కువ కావు.

# వరంగల్ జిల్లాలో నిరుపేదలకు సహకార వ్యవసాయ పథకం అమలు

బి. సుదర్శనం

ఇటీవల వరంగల్ జిల్లా యందు బడుగువర్గాల సముద్ధరణకై ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము తలపెట్టిన బృహత్తర ప్రణాళికలో సమిష్టి మరియు సంయుక్త వ్యవసాయపథకంను జిల్లా అధికార యంత్రాంగం త్రికరణశుద్ధిగా అమలుజరపడం భారతప్రభుత్వం ప్రవేశపెట్టిన భూసంస్కరణల కార్యక్రమానికి నాంది పలుకుతుంది. నిరుపేదవర్గానికది ఆశాజనకంగా వెలసింది.

## గరీబీ హటావో

పేదరికాన్ని రూపుమాపడి:— 'గరీబీ హటావో' అన్న నినాదం వరంగల్లునందు క్రియారూపాన్ని దాలుస్తుందనుట అతిశయోక్తికాదు. అయినా యిట్టి ఆర్థిక-విప్లవాత్మక కార్యక్రమాలను అమలుజరపడం కేవలం ప్రారంభదశలోనే వుందనక తప్పదు. ఇట్టి సృజనాత్మక కార్యక్రమ సమగ్ర నిర్వహణ కేవలం ప్రభుత్వ యంత్రాంగముపైననేకాక ఒకవైపు ప్రథమంగా పేదవర్గంపైన మరొకవంక ముఖ్యంగా ధనికవర్గం అనబడే రైతాంగంపైనా మరియు పాలకవర్గ నైతికసహకారాలపైన ఎంతైనా ఆధారపడివుందని వక్కాణించకతప్పదు.

గత రెండున్నర దశాబ్దాల నుండి లక్షల ఎకరాల ప్రభుత్వ భూమిని హరిజనులకు మరియు తదితర నిరుపేదలకు పంచియివ్వడం జరిగింది. కేవలం వరంగల్లు జిల్లా యందే క్రాష్‌పథకం క్రింద జనవరి 1973 నాటికి 52.012 ఎకరాల ప్రభుత్వభూమిని పేద రైతులకు పంపిణీచేయడం జరిగింది. కాని పూర్వం పేదలకివ్వబడిన భూమి పేదరైతులనుండి అనతికాలములోనే జారిపోయింది. పేదకూలి రైతులకు భూమినైతే యివ్వడం జరిగినది. కాని కేవలం వారి శ్రమయే పెట్టుబడిగాగల ఈ నిరుపేదలకు కావలసిన కొద్ది పెట్టుబడిలేక మరియు ఆ చిన్న క్షేత్రమునందు పనిచేయు కాలానికి జీవనోపాధికిగాను అల్పంగా అప్పులు చేయకతప్పిందికాదు ఆ కొద్దిఅప్పులు పెరుగగా తీర్చే స్థోమతలేక ప్రభుత్వం యిచ్చిన ఆకొద్ది 'కొండ్రను' కూడ అప్పులిచ్చిన చక్రవడ్డీ కామందుకు హస్తగతం చేయటమూ ఆ నిరుపేద కడునిరుపేదగా మిగలడం జరుగుతూ వచ్చింది. కలవారు కుబేరులుకాగా పేదవాడు కడు పేదగానే మిగిలాడు. ఇట్టి విషవలయంలో చిక్కుకున్న వ్యవసాయ కూలీలకూ సన్నకారురైతులకు "సమిష్టి (Collective)" మరియు 'సంయుక్త'(Joint) వ్యవసాయపథకాలు, వారి పాలిటి పెన్నిధులుగా రూపొందాయి.

## రంగాపూరు ప్రాజెక్టు

1970–71లో వరంగల్ జిల్లా యందు ప్రప్రథమంగా రంగాపురంనందు (ములుగు తాలూకా) వందమంది పైగా నిరుపేద "కోయలను" సమీకరించి అడవిమధ్య మంచి వ్యవసాయ యోగ్య భూమిని యెంచి, కేటాయించి, చిన్నతరహా నీటివనరును (రంగాపూర్ ప్రాజెక్టు) నిర్మించి 600 ఎకరాల మేరకు సమిష్టిపద్ధతిపై సాగుచేయడం త్వరితగతిని జరిగినది. అప్పటి కలెక్టర్‌గారు శ్రీ కే.ఆర్.వేణుగోపాల్ తమ నిస్వార్థ నిర్మాణాత్మక దృక్పథముతో

హృదయాలను చూరగొనుటయే గాక వారు నిర్మాణాత్మక కార్యకలాపాలలో పాలి భాగస్తులగునట్లు వారి నైతిక విలువలకు అర్థాన్ని చేకూర్చారు. రంగాపూర్ ప్రాజెక్టునకు ప్రాణంపోసి నిరుపేద కోయలకో ఆశా జ్యోతిని వెలిగించారు. దాదాపు 12 లక్షల ఆవర్తన నిధిని యితర కోయరైతుల కందచేశారు. 'కోయ యువకులకు' ఆటోరిక్షాల సహకార సంఘాన్ని నెలకొల్పారు. కోయల భూములను అక్రమంగా హస్తగతం చేసికొన్న కోయేతర రైతులకు స్వస్తి చెప్పించి కోయలకు న్యాయం చేకూర్చ పూనుకున్నారు. ఒక రకంగా కోయప్రాంతమందు ఉగ్ర—లేక అతి తీవ్రవాదాలకు కూడ ప్రజోపయోగ కార్యక్రమాల నిర్వహణతో విరుగుడును సాధించానవచ్చు.

## జిల్లి క్షేత్రం

అప్లేనర్సంపేట తాలూకాలోని జిల్లిగ్రామ సమీపమునందున, ప్రభుత్వ భూమిని అనగా i జిల్లిబ్లాక్ మరియు ii "మైసురా":—వృక్షాలు లేనిఅటవీశాఖ భూమిని 1676 ఎకరాల మేరకు కేటాయించి, అక్కడ చుట్టు ప్రక్కల గ్రామ హరిజన నిరుపేదలను దాదాపు వంద మందిని సమీకరించి, జిల్లి సమిష్టి వ్యవసాయ సహకార క్షేత్రాన్ని తేది. 25 మార్చి 1971న నెలకొల్పారు. గుట్టలను మినహాయించగా దాదాపు 1000 ఎకరాల సేద్యయోగ్య భూమి లభించింది. రూ. 1.5 లక్షల ఖర్చుతో బుల్‌డోజర్లనూ, ట్రాక్టర్లనూ అగ్రో యిండస్ట్రీస్ శాఖ నుండి అద్దెకు తెప్పించి, 700 ఎకరాల మేరకు భూమిని సత్వరమే దున్ని చదునుచేసి సేద్యయోగ్యం చేశారు. మొదటి సంవత్సరములోనే దాదాపు 500 ఎకరాలలో పంట పండించారు. కాగా దాదాపు పది లక్షల వ్యయంతో నీటి వనరులు, పంపుసెట్లు (6) ఎడ్ల జతలు (83) వ్యవసాయ పరికరాలు, 100 ఇండ్లు మొదలుగా గల వానిని త్వరిత గతిని సమకూర్చుకున్నారు. పంటలను లాభసాటిగా పండించుచున్నారు.

కాగా గత రెండు సంవత్సరాల నుండి శ్రీ కె. మాధవరావు గారు వరంగల్ జిల్లా కలెక్టర్‌గా అత్యంత పరిపాలనా సౌశీల్యమును ప్రదర్శించి పేదల పాలిటి బంధువుగా యెన్నెన్నో నిర్మాణాత్మక కార్యక్రమాలు కార్యరూపం దాల్చునట్లు చేశారు. రంగాపురం మరియు జిల్లి సమిష్టి వ్యవసాయ క్షేత్రముల విశిష్ట ప్రగతిని చూపి శ్రీ కే. మాధవరావుగారు మరోతొమ్మిది సమిష్టి మరియు సంయుక్త వ్యవసాయ క్షేత్రాలను కేవలం కోయలు, హరిజనులకు మేలు కలుగునట్లే గాక తదితర బడుగువర్గాల - లంబాడీలు, చెంచూ మొదలు కాగల వెనుకబడిన తరగతులకు కూడా లాభం కలుగునట్లు వ్యవస్థాపన కావించారు. జిల్లి రంగాపురంలతో పాటు పర్వతగిరి, సైనాల్, రాజోల్, ముడుపుగల్లు, ఎర్రబెల్లి గూడెం (మహబూబాబాద్ తాలూకా) యశ్వంతాపూర్, వెల్ది, రఘునాద పెల్లి (జనగాం తాలూకా) మరియు జాకారం (ములుగు తాలూకా) లలో మొత్తం 971 సభ్యులతో 5,800 ఎకరాల భూమిని సమిష్టి మరియు సంయుక్త వ్యవసాయ పరిధిలోనికి తేవడం జరిగింది. ఇట్టి క్షేత్రాలను సమతలముచేయుటకు, సేద్య యోగ్యం గావించుటకు మరియు ఆయా వ్యవసాయోప కరణములను సేకరించుటకు గాను ప్రభుత్వం రూ. 10.21 లక్షల మేరకు ఈ సహకారసంఘాలకు ఋణం సమకూర్చింది. పైనుదహరించిన తొమ్మిది సహకార క్షేత్రాలు ప్రారంభించబడి కేవలం తొమ్మిది మాసాలే అయినప్పటికిని ప్రభుత్వ సిబ్బంది అండ దండలు కలిగి ఆయా సంఘసభ్యులు కలిసి మెలిసి సమిష్టిగా పట్టుదలతో పనిచేయుట ద్వారా వర్షా భారాన్ని యెదుర్కొవలసి వచ్చినప్పటికిని మంచి పంటలను పండించారు. ఈ జిల్లా పరిపాలక యంత్రాంగం యీ సన్నకారు రైతులకు శాశ్వత నీటి వనరులను కల్పించుటకు సమాజ వ్యవసాయ బావుల త్రవ్వకం పథకం క్రింద కావలసిన ఆర్థిక సహాయాన్ని సకాలాని కందచేసి బావులను త్రవ్వించి, కట్టించి యీ సేద్య క్షేత్రాల జయప్రదం కెంతైనా దోహదం చేశారనక తప్పదు.

పై సమిష్టి—సంయుక్త సహకార సంఘాల విశిష్ట నిర్వహణతో పాటు వరంగల్ జిల్లా కలెక్టర్‌గారు యీ జిల్లాలో కేవలం గత సంవత్సరమునందు గ్రామ గ్రామాన మొత్తం 400ల సమాజ వ్యవసాయ బావులను రూ. 40 లక్షలు ఖర్చుతో త్రవ్వించారు—ఒక్కొక్క బావి 10 నుండి 15 ఎకరాల పంటకు నీరు అందించగలదు. ప్రతి బావి కనీసం పదిమంది సన్నకారు రైతులకు ఉపయోగ పడుతుంది. యీ జిల్లా యందు ఎట్టివిధమైన భారీలేక మాధ్యమిక—శాశ్వత నీటి వనరులు లేని లోటును యిట్టి సమాజ వ్యవసాయ బావుల పథకం సన్నకారు రైతులకు కొంతవరకు తీరుస్తుందన వచ్చు. భూగర్భ జల సంపదను పూర్తిగా వ్యవసాయానికి వినియోగించుటకు భూగర్భ శాస్త్రజ్ఞుని సలహాపై జిల్లా అంతటిని సర్వే చేయించి అనువగు ప్రతిచోట బావులను త్రవ్వించుట ఈ జిల్లా వ్యవసాయాభివృద్ధి కాయువుపట్టు కాగలదు. కాగా పై 400ల సమాజ వ్యవసాయ బావుల క్రిందనున్న సన్నకారు రైతులంతా కలిసి తాలూకా స్థాయిలో కాని, బ్లాకు స్థాయిలో గాని లేక గ్రామ పంచాయతీ పరిధిలో గాని సంయుక్త వ్యవసాయ సహకార సంఘాలుగా రూపొందడం ఆయాచిన్న రైతులకు ముమ్ముందు వ్యవసాయ పెట్టుబడికి ఆసరా లభించగలదు —— ఆ బావుల క్రింద సాలీనా పంటలను లాభసాటిగా పండించనూ వచ్చు. కాగా ఇట్టి క్రమబద్ధమైన వ్యవసాయ పథకం గ్రామ గ్రామాన అమలులోనికి వచ్చిన నాడు గ్రామములందు బడుగు వర్గాల ఆర్థిక స్థాయిని పెంచడానికి సాంఘిక విలువలకు క్రొత్త ధనము చేకూర్చడానికి భూమిక కాగలదు.

బడుగు వర్గాల వారికి ఆర్థిక, వ్యవసాయ వనరులను పుష్కలంగా అందుబాటు గావించుటతో పాటు భూమిలేని నిరుపేద హరిజనులకు తదితరులకు 7,967 యిండ్ల స్థలాలను పంచి యిచ్చారు. మొత్తం 528 ఎకరాలను 11, లక్షల రూపాయల వ్యయంతో సేకరించడం జరుగగా 4,407 గృహాల నిర్మాణ పథకాన్ని జీవిత భీమా నిమ్న జాతుల మరియు ఆటవిక జాతుల వసతి గృహ నిర్మాణ పథకం క్రింద చేపట్టారు. 108 కాలనీలను నిర్మించి నిరుపేదలకు యిచ్చారు. ఒక గృహ నిర్మాణానికి రూ. 1800 లు ఖర్చు అంచనా.

## గొట్టపు బావులు

అడవి ప్రాంతములో మంచినీటి కొరతను ఎదుర్కొనుటకు కొత్తగూడెం, సాదిరెడ్డిపల్లె మొదలు గాగల పెద్ద కోయ గ్రామాలలో గొట్టపు బావులను దించారు. 120 అ నుండి 140అ. ల లోతుకు

పోయిన గానినీరు లభించలేదు–ఆ అడవి ప్రాంతములో. కాగా వరుసగా రెండు సంవత్సరాల నుండి తీవ్ర అనావృష్టి కారణాన జిల్లాయందంతటిలోను మంచినీటి కొరత తీరని సమస్యగా యెదురైనది. ఓరుగల్లు పట్టణానికి నీరు సరాఫరా చేసే ధర్మసాగరం అడుగంటింది. కాని జిల్లా పరిపాలక యంత్రాంగము శాయశక్తుల ప్రయత్నించి వరంగల్ నందు వాడ వాడకు గొట్టపు బావులనుదించి పెద్ద గ్రామాలలో కూడ సాధ్యమైనన్ని ఫిల్టర్ పాయింటును వేయించి పట్టణాల నుండీ గ్రామముల నుండీ వలస పోవలసిన ప్రమాదము నుండి ప్రజలను తప్పించిందనవచ్చు. మంచినీటి సమస్యను శాశ్వతంగా పరిష్కరించుటకు మానేరు నుండి నీటిని సరఫరా చేసికొనుటకు సర్వే త్వరితగతిని జరుగుచున్నట్లు తెలుస్తున్నది. అట్టి నీటి వసథు ఓరుగల్లునకు పుష్కలంగా లభించిననాడు వరంగల్ నగరం పరిశ్రమలకు యే యితర నగరానికి తీసి పోదనవచ్చు.

ఈ మేరకు 1972–73 ఆర్థిక సంవత్సరం వరంగల్ జిల్లా పరిపాలనలో ఒక విశిష్టతను ఆపాదించుకున్న దనక తప్పదు. జనవరి 1973 నాటికే 95 లక్షల రూపాయిలు ఖర్చుచేసి అయా ప్రగతిశీలక పనులను–అనగా సమాజవ్యవసాయ బావులపథకం, పేదలకు గృహనిర్మాణము కరువు పనులక్రింద రోడ్లువేయుట, కుంటలు మరమ్మత్తు, బావులను లోతుచేయుట మొదలుగాగల కార్యక్రమాలను అమలుపరచి రైతాంగానికి సౌకర్యము కలిగించుటతోపాటు పేదవారికి పని కల్పించటం జరిగినది. ఇట్టి ప్రగతిశీలక కార్యక్రమాలను జిల్లాయందు గత మూడు సంవత్సరాలనుండి ముమ్మరంగా జరుపబడడంతో బడుగు వర్గాలలో కనివినీ యెరుగని చైతన్యము పెల్లుబికినట్లగుపిస్తుంది. నిన్న మొన్నటివరకు ఎదురైన మధ్యవర్తి అనగా “పైరవికారు” లేనిదే ప్రభుత్వ కార్యాలయాలకు పోని పేద రైతులీనాడు యే కార్యాలయానికైనా నిర్భయంగా వెళ్ళి తమ పనిని చేయించుకో గలుగుచున్నారు. తమకు యిబ్బందులు యెదురైననాడు నేరుగా జిల్లా అధికారిని దర్శించి తమ యిబ్బందులను వివరించి తీర్చుకో గలుగుటతోపాటు తాముకూడా బాధ్యతాయుతంగా వ్యవహరించి యివ్వబడిన వనరులను సద్వినియోగ పరచుకొంటున్నారనవచ్చు. దానికి నిదర్శనం ఆయా గ్రామాదులందు నిరుపేదలే స్వయంగా వారికి మంజూరు చేయబడిన సమాజ వ్యవసాయ బావులను త్రవ్వుకొనుట మరియు ఆయా ఉమ్మడి మరియు సంయుక్త సహకార సంఘాలుగా ఆదర్శవంతమైన ప్రగతిని సాధించి నిరూపించుటయే తార్కాణం కాగలదు.

## పేదలలో ఆత్మవిశ్వాసం

బడుగు వర్గాలలో యిట్టి ఆత్మవిశ్వాసాన్ని అంకురింపజేసి దేశ ప్రగతి పథములో నిరుపేదలుకూడ పాలిభాగస్తులేనని వారు, వారి సమిష్టికృషితో వారు వారి స్వయం సమృద్ధిని సాధించుటతో పాటు దేశ అభ్యున్నతికి తోడ్పడగలరని నిరూపించింది. గత మూడు సంవత్సరాల ప్రగతిశీలక జిల్లా పరిపాలనా యంత్రాంగం వరంగల్ లో ఇట్టి బడుగువర్గాల అభ్యున్నతి కార్యక్రమాలు కుంటుబడకుండా కొంతకాలంపాటు సాఫీగా జరుగాలంటే, స్థిరపడాలంటే యిట్టి అభ్యుదయ కార్యక్రమాలపై అకుంఠిత విశ్వాసముగల పాలకవర్గం యెంతైన అవసరమని ఇటీవల వరంగల్ జిల్లా అనుభవం చెప్పకచెబుతుంది. కాగా పేదవర్గంకూడా సంఘములో తమ ఉచితస్థానాన్ని తాము అనుభవించుచూ యితర వర్గాలకు అనౌచిత అసూయభావాలను రేకెత్తించక కలసిమెలసి సదవగాహనకలిగి కార్యదీక్షతో ముందంజవేయడం ఎంతైన అవశ్యం. అన్నంత మాత్రాన 'దాసోహం' అనమనికాదు. 'తిరగబడ' మనీ కాదు. కాని యిరువర్గాలు ఒకే దేశీయులమన్న సద్భావముతో సంఘీభావాన్ని, సమైక్యతా భావాన్ని పెంపుచేసికొని సాంఘిక విలువలను, నైతిక విలువలను, ఆర్థిక స్తోమతను, వైజ్ఞానిక వికాసాన్ని పెంపుచేసుకొనుటకే దోహదం చెయ్యాలి కాని విచ్ఛిన్నతికి కారణం కారాదు.

అనాదినుండి అట్టడుగునవున్న నిరుపేదలీనాడు మన రాజ్యాంగపు స్వేచ్ఛల నీడలలో తమ సమిష్టి కృషితో తమను తాము ఆర్థికంగా సాంఘికంగా పునర్నిర్మించుకొనుట యెంతేని ముదావహము. కాగా వారి కృషికి యిటు ప్రభుత్వ యంత్రాంగం అటు తోటి రైతాంగపు నైతిక ప్రోత్సాహసహకారాలెంతైనా అవశ్యం– ఈ రెండూ లోపించిననాడు యీ అట్టడుగువాని — ఆశా, కృషీ, సమైక్యతలు ఏకాకులై విచ్ఛిన్నం కాకపోవు — కావున వారి కృషికి తోడు వారి తోటి లేక సాటి సమాజపు బాధ్యత ప్రదిలమైనది అనక తప్పదు — యిట్టి బడుగు వర్గాల నేర్పరుగని స్వయం కృషిని విమర్శించుటకంటె నిర్మాణాత్మకంగా ఆలోచించి వారికి నైతిక బలాన్ని చేకూర్చడం నిజమైన దేశసేవ. దేశభక్తి కాగలదు.

భూసంస్కరణలు తలపోసిన ఈ దశాబ్దిలో పెట్టుబడి లేని నిరుపేదలకు “సమిష్టి వ్యవసాయ పథకం యెంతయినా సముచితం కాగలదు.

సమిష్టి క్షేత్రంలో సంఘానికి ఆ భూమిపై హక్కు వుంటుంది — కాగా సంయుక్త వ్యవసాయక్షేత్రములో ఎవరి కమతములపై వారికి హక్కు భుక్తాలుంటాయి. కాకపోతే మొదటిదానియందు ఆ భూమిపై అందరికి సమిష్టిగా హక్కు వుంటుంది. ఉమ్మడిగా శ్రమించాలి — సమముగా అనుభవించుతారు. రెండవ పద్ధతిలో సన్నకారు రైతులంతా కలసిన కావలసిన వ్యవసాయ పెట్టుబడికి గాను ఋణం పొందగలుగుతారు. ఇట్టి సమిష్టి — సంయుక్త క్షేత్రాలు పేదలపాలిటి పెన్నిధి అనక తప్పదు. ఇట్టి పేదల కృషికి అర్థాన్నిచ్చిచేయూతనిచ్చిన వరంగల్ పరిపాలక యంత్రాంగం మరియు సాటి రైతాంగం మన రాష్ట్రంలోనేగాక దేశమంతటిలో ఆదర్శవంతం కాగలదనవచ్చు

# గిరిజనులకు నవోదయం

శ్రీ ఖాట్టం శ్రీరామమూర్తి



గిరిజనులు దురదృష్టవశాత్తూ సమాజంలోని వెనుకబడిన వర్గాలలో మరీ వెనుకబడిన వర్గానికి చెందినవారు. అనేక కారణాలవల్ల శతాబ్దాల తరబడి వారు యితర ప్రపంచంతో సంబంధం లేకుండా అడవులలో ఒంటరిగా జీవిస్తున్నారు. తత్ఫలితంగా సమాజంలోని యితర వర్గాలకూ, గిరిజనులకూ మధ్య పెద్ద అగాధం ఏర్పడింది. అందువల్లి తమ ప్రపంచంలో తామే నివసిస్తూ నాగరిక ప్రపంచంతో సంబంధం లేకుండా జీవించసాగారు.

1947 లో స్వాతంత్ర్యం లభించడంతో సమాజంలోని యీ దురదృష్టవంతులకు నూతన జీవితం ప్రారంభమైంది. గిరిజనుల సత్వర అభివృద్ధికి మన రాజ్యాంగవేత్తలు రాజ్యాంగంలో తగిన అవకాశాలు కల్పించారు. ఉదాహరణకు, సమాజంలోని బలహీనవర్గాలకు—ముఖ్యంగా షెడ్యూలు కులాల, షెడ్యూలు తెగల ప్రజల విద్యావిషయిక, ఆర్థిక పరమైన ప్రయోజనాలను పరీక్షించడానికి ప్రభుత్వం ప్రత్యేక శ్రద్ధతో కృషిచేస్తూ, వారిని స్వప్రయోజనాలకు వినియోగించుకోకుండానూ, అన్యాయాలకు గురికాకుండానూ చేస్తుందని రాజ్యాంగంలోని ఆదేశిక సూత్రాలలో పేర్కొన్నారు. తదనుగుణంగా, యితరరాజ్యాంగ సూత్రాలను అనుసరించి, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం గిరిజన సంక్షేమానికి అనేక శాసనాలను చేయడంతోపాటు వివిధ సంక్షేమ కార్యక్రమాలను అమలు జరుపుతున్నది.

## నూతన శకారంభం

ప్రథమ పంచవర్ష ప్రణాళికలోను, తర్వాతి ప్రణాళికలోనూ గిరిజన సంక్షేమానికి అనేక కార్యక్రమాలు జరపడంతో గిరిజనులకు నూతనశకం ఆరంభమైంది. మొదటి పంచవర్ష ప్రణాళికలో గిరిజన ప్రాంతాలలో రూ. 118.72 లక్షల ఖర్చుతో కార్యక్రమాలు అమలు జరిపారు. ఉట్నూరు, అరకు, నరసంపేట, పాడేరులలో నాలుగు బహుళార్థ సాధక ప్రాజెక్టులను ప్రారంభించటంతో దీర్ఘకాలికమైన ప్రణాళికకు నాంది పలకడం జరిగింది. మూడవ పంచవర్ష ప్రణాళికా కాలంలో గిరిజన ప్రాంతాలలో 24 గిరిజన అభివృద్ధి బ్లాకులను ఏర్పాటు చేయడంతో మరో ముందడుగు వేశారు.

తర్వాతి ప్రణాళికలో అభివృద్ధి గమనం మరింత వేగవంతంగా నడచింది. గిరిజన సంక్షేమానికి నిర్దేశించిన నిధులు రూ. 118.72 లక్షల నుండి నాలుగవ ప్రణాళికలో రూ. 734.03 లక్షలకు పెరిగింది. దానికితోడు, ఈ సాంఘిక సమస్యను మరింత ప్రత్యేక శ్రద్ధతో పరిష్కరించడానికి గిరిజన సహకార సంఘం ఆంధ్రప్రదేశ్ షెడ్యూలు తెగల సహకార గృహ నిర్మాణ సంస్థ వంటి ప్రత్యేక సంస్థను ఏర్పాటు చేశారు.

గిరిజనులకు ప్రధానమైన వృత్తి వ్యవసాయం. గిరిజనులు తమ భూములను ఎంతో ప్రాణప్రదంగా చూసుకుంటారు. అయితే ఎంతో కాలంనుండి వారు వడ్డీ వ్యాపారస్తుల చేతుల్లో నలిగిపోతున్నారు. 1947 సంవత్సరం తర్వాత పరిస్థితులు పూర్తిగా మారిపోయాయి. సంక్షేమ రాజ్యస్థాపనకు అంకితమైన ప్రభుత్వం పెద్ద ఎత్తున సహాయ కార్యక్రమాలను అమలు జరపనారంభించింది. ఇంతవరకు దాదాపు 10 లక్షల ఎకరాల భూమిని పేదలకు పంపిణీచేశారు. ఈ భూములు యివ్వడంలో షెడ్యూలు కులాలు, షెడ్యూలు తెగల వారికి ఎక్కువ ప్రాధాన్యం యిచ్చారు. కౌలుదారు, ముఠాదారు, మాల్గుజారీవంటి మధ్యదళారీలను రద్దుచేశారు. గిరిజన ప్రాంతాలలో గిరిజన అభివృద్ధి బ్లాకులను ఏర్పాటు చేయడంతో వ్యవసాయ అభివృద్ధికి ఎక్కువ శ్రద్ధ తీసుకోవడం జరిగింది.

## నీటి పారుదల పథకాలు

గడచిన రెండు ప్రణాళికల కార్యక్రమాలలో గిరిజన ప్రాంతాలలో చిన్నతరహా నీటిపారుదల పనులపై ప్రత్యేక శ్రద్ధ వహించారు. విశాఖపట్నంజిల్లా చింతపల్లి గిరిజన అభివృద్ధి బ్లాకులోని తాజంగి రిజర్వాయరు ద్వారా దాదాపు 1000 ఎకరాలకు నీటి పారుదల సౌకర్యం లభిస్తున్నది. విశాఖపట్నం, శ్రీకాకుళం జిల్లాలలో చిన్నచిన్న సెలయేరుల నుండి నీటిని గిరిజన ప్రాంతాలకు మళ్లిస్తున్నారు. ఖమ్మం, పశ్చిమగోదావరి, వరంగల్లు, ఆదిలాబాదు జిల్లాలలోని మెట్టప్రాంతాలలో పెద్ద ఎత్తున సేద్యపు నీటి బావుల త్రవ్వకం, చెరువుల త్రవ్వకం చేపట్టారు.

# పరిపాలనా వ్యవహారాలు

## రాష్ట్రస్థాయిలో స్త్రీ విద్యాసలహా మండలి

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర మహిళా, బాలికా విద్యాసంస్థ నొక దానిని ప్రభుత్వం ఏర్పాటుచేసింది. ఐదవ పంచవర్ష ప్రణాళికలో బలహీనవర్గాలలో విద్యాప్రాప్తికి (స్త్రీలుకూడా బలహీన వర్గాలకు చెందినవారే) యిచ్చిన ప్రాధాన్యం దృష్ట్యా ముందుగా యీ చర్య గైకొనబడింది.

స్త్రీ విద్యారంగంలో అభివృద్ధి సాధించడానికి ఏయే చర్యలు అవసరమో యీ సంస్థవారు ప్రభుత్వానికి సలహాయిస్తారు.

దీనికి శ్రీ హెచ్. సి. సరీన్, (గవర్నరు సలహాదారు)అధ్యక్షులు; శ్రీమతి శ్యామలా దేవి (ఆంధ్ర యువతీ మండలి) ఉపాధ్యక్షురాలు.

సభ్యులు: ప్రభుత్వవిద్యాశాఖ కార్యదర్శి లేక ఆయన ప్రతినిధి శ్రీమతి టి. యన్. అనసూయమ్మ ఎం.ఎల్. ఏ.; శ్రీమతి బి. సరోజిని పుల్లారెడ్డి, ఎం.ఎల్.ఏ; శ్రీమతి సుమిత్రాదేవి, ఎం.ఎల్.ఎ; శ్రీమతి వి. కమలాకుమారి, ఎం.ఎల్. సి . శ్రీమతి రోదామిస్త్రీ, ఎం. ఎల్. సి.; శ్రీమతి డి. కృష్ణవేణి, ఎం. ఎల్. సి.; విద్యాశాఖ డైరెక్టరు; మహిళాసంక్షేమశాఖ డైరెక్టరు; శ్రీమతి బ్రహ్మ, రాష్ట్ర సాంఘిక సంక్షేమ సలహాసంఘం అధ్యక్షురాలు; శ్రీమతి శాంతా రామేశ్వరరావు, విద్యావేత్రి; కార్యదర్శి-సభ్యురాలు: శ్రీమతిశారదా హెచ్. రావు,(ఎక్స్టెన్షన్‌శాఖాధిపతి).

## గిరిజన పాఠశాలల్లో స్కౌటు కార్యక్రమాలు

గిరిజన పాఠశాలల్లో హాస్టళ్లలో స్కౌటు కార్యక్రమాలు ఏర్పాటుచేయడంలో ఆంధ్రప్రదేశ్ దే అగ్రస్థానం. ఈ సందర్భంగా 100 మంది ఉపాధ్యాయులకు స్కౌటుమాస్టర్ల శిక్షణ యిచ్చారు. 100 స్కౌటుదళాలు ఏర్పాటుచేశారు. ప్రస్తుతం 4500 మంది విద్యార్థులు వీటిలో పనిచేస్తున్నారు. గిరిజన పాఠశాలల్లో, పనిచేసే ప్రతి ఉపాధ్యాయునికే, హాస్టళ్లలోని ప్రతి వార్డెన్‌కూ స్కౌటు మాస్టరుశిక్షణ యివ్వడానికి కృషి జరుగుతున్నది.

## పనివారికి వేతనాలు

జంటనగరాలలో ఆఫీస్‌కంటిన్‌జెన్సీలో నుండి జీతాలు చెల్లించబడే చిన్నతరహా నిపుణతలేని పనివారికి 1973-74 సంవత్సరానికి-దిగువ వేతనాలు నిర్ణయించబడినవని లేబర్‌కమీషన్ ప్రకటించారు.

| | |
|---|---|
| స్త్రీగానీ పురుషుడుగానీ: | నెలకు నిర్ణీతవేతనం రు. 50లు, అడహాక్ మొత్తం రు 5లు, 1972 ఆగస్టు 1వతేదీన అందుల్లోవున్న కరువుభత్యం రు. 71లు సి. ఎ. రు 6లు. |
| స్త్రీగానీ పురుషుడుగానీ (పార్ట్‌టైమ్) | : గంటకు 25 పైసలు లేదా నెలకు వేతనం రు. 20లు, కరువుభత్యం రు 5లు. |
| పిల్లవాండ్లకు | : నెలకు నిర్ణీత వేతనం రు. 35లు, కరువు భత్యం రు. 71లు, సి. ఎ. రు. 6లు. |
| పిల్లవాండ్లు(పార్ట్‌టైమ్): | గంటకు 25 పైసలు లేదా నెలకు వేతనం రు. 12లు. కరువుభత్యం రు. 5లు. |
| స్త్రీగానీ పురుషుడుగానీ : (రోజువారీకూలీ) | రోజు 1కి రు. 3లు. |

## పాఠ్యగ్రంధాలు

జాతీయం చేయబడిన పాఠ్యగ్రంధాలకు సంబంధించిన ముద్రణ, ప్రచురణ, పంపిణీ మొదలగు విషయాలకు సంబంధించిన సమస్యల పరిశీలనకై పరిశ్రమలశాఖ కార్యదర్శి శ్రీ ఎస్ ఆర్. రామమూర్తి ఐ. ఎ. ఎస్. అధ్యక్షతన ప్రభుత్వం ఒక సంఘాన్ని నియమించింది. ఆర్థికశాఖ కార్యదర్శి లేక ఆయన ప్రతినిధి, ముద్రణశాఖ డైరెక్టరు, విద్యాశాఖ డైరెక్టరు, శ్రీ వి. పి. రాఘవాచారి ఎం. ఎల్. సి. శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య యిందులో సభ్యులుగా వుంటారు. పాఠ్యగ్రంథాల ప్రెస్ డైరెక్టరు కార్యదర్శి సభ్యుడుగా పనిచేస్తారు.

## ప్రత్యేక ఉపాధి కల్పనా కార్యక్రమం

స్వయం ఉపాధి కల్పన పథకాల ద్వారా విద్యావంతులైన నిరుద్యోగులకు సుమారు 35-40 వేల ఉద్యోగాలను సృష్టించే నిమిత్తం ఆంధ్రప్రదేశ్‌కు 1973-74 సంవత్సరానికి గాను భారత ప్రభుత్వం ఇటీవలనే 6 కోట్ల రూపాయలు మంజూరు చేసింది. ఈ పథకాలను పరిశ్రమల శాఖ, విద్యాశాఖ, నీటిపారుదల శాఖ, వ్యవసాయశాఖ, వైద్య, ఆరోగ్యశాఖ మొదలైన అనేక శాఖల ద్వారా అమలు పరచడం జరుగుతుంది. దీనిలో పెద్దమొత్తాన్ని అంటే రూ. 3.5 కోట్లకు సంబంధించిన పథకాలను పరిశ్రమల శాఖ అమలు పరుస్తుంది. స్వయం ఉపాధికల్పనా కార్యక్రమాల పాటు, వాణిజ్య కార్యక్రమాలు వాటి సాంకేతిక వేత్తల సహకార సంఘాలు, వాయిదా చెల్లింపు పద్ధతిపై యంత్రాల కొనుగోలు మొదలైన వాటికి ఆర్థిక సహాయం లభించే విధంగా పథకాలున్నాయి. అభివృద్ధి చెందుతున్న కార్యక్రమాలు వేత్తలకు పరిశ్రమను నెలకొల్పడంలోనూ యాజమాన్యం వహించడంలోనూ పరిశ్రమల శాఖ శిక్షణ యిస్తుంది. ఈ పథకం 2 సంవత్సరాల క్రింద ప్రారంభించిన నప్పటి నుంచి యిప్పటి వరకు 1 లక్ష రూపాయల ఖర్చుతో 2 వేల మందికి అటువంటి శిక్షణ యివ్వడం జరిగింది.

రూ. 25 లక్షల పెట్టుబడి మించని కంపెనీలలో ఇంజనీరింగు పట్టభద్రులకు, డిప్లమా హోల్డర్లకు సబ్సిడీ ఎంప్లాయ్‌మెంటుకు సంబంధించిన పథకం ఒకటి వుంది. దీనికి కేంద్ర విద్యామంత్రిత్వ శాఖ ఆర్థిక సహాయం చేస్తుంది. దీని ప్రకారం ఒక ఏడాదిపాటు సగం జీతాన్ని అంటే ఇంజనీరింగు పట్టభద్రుడికి 100 రూ.లు డిప్లమా హోల్డర్‌కు 250 రూ.లు చొప్పున కేంద్ర ప్రభుత్వం, మరిసగం కంపెనీ యజమాని చెల్లిస్తారు. ఒక ఏడాది తర్వాత అతనికి యజమాని మామూలు జీతం యిచ్చి తన సంస్థలోనే అట్టి పెట్టుకుంటాడు. ఈ పథకం క్రింద 268 మందికి పరిశ్రమల శాఖ వివిధ కంపెనీలలో ఉపాధికల్పించింది.

బేంకులు, ఆర్థిక సహాయ సంస్థలు, జిల్లా పరిపాలనా యంత్రాంగం—వీరంతా యీ పథకాలలో పాల్గొనేట్టు చేయడానికై జూన్ 1 న విశాఖపట్టణంలోనూ, జూన్ 9 న తిరుపతిలోనూ కలెక్టర్లు, ఆర్థిక సహాయసంస్థల ప్రతినిధులు, పరిశ్రమల శాఖ ప్రతినిధులతో ప్రాంతీయ సమావేశాలు రెండు జరిగాయి.

## ప్రమోషన్ కమిటీలు

ఆంధ్రప్రదేశ్ సెక్రటేరియట్ సర్వీసు, సబార్డినేట్ సర్వీసులలో కమిషను పరిధిలో లేని పోస్టులకు సంబంధించిన వివిధ నాన్ గెజిటెడ్ పోస్టులకు ప్రమోషన్ నిర్ణయించే నిమిత్తం శాఖ పరమైన ప్రమోషన్ కమిటీలను ఏర్పాటు చేయాలని ప్రభుత్వం నిశ్చయించింది. ఆంధ్రప్రదేశ్ మినిస్టీరియల్ సర్వీసు పోస్టులకు ప్రమోషను యిచ్చేటప్పుడు సీనియారిటీని సమర్థతను పరిగణనలోకి తీసుకోవడం జరుగుతున్నప్పటికీ ఒక వ్యక్తి ప్రమోషను యివ్వడానికి అర్హుడా కాదా అనే విషయాన్ని నిర్ణయించేందుకు శాఖాపరమైన ప్రమోషను కమిటీలను ఏర్పాటు చేయాలని ప్రభుత్వం నిశ్చయించింది.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సబార్డినేట్ సర్వీసు నిబంధనలలోని 4 వ సాధారణ నిబంధన క్రింద సెప్టెంబరుతో సెలక్షన్లు పూర్తి అయ్యేందుకు వీలుగా యీ శాఖ పరమైన ప్రమోషను కమిటీలు ప్రతిఏటా ఆగస్టు నెలకు తగినంత ముందుగానే ఏర్పాటు కావలసి వుంటుంది. ఈ కమిటీలో సభ్యుల కాలపరిమితి ఒక ఏడాది మాత్రమే. ప్రతిఏటా సభ్యులు మారుతుంటారు.

ఇదేవిధంగా సర్వీసు కమిషను పరిధిలో లేని గెజిటెడు పోస్టుల ప్రమోషను విషయంలో శాఖా పరమైన ప్రమోషను కమిటీల ఏర్పాటుకు సంబంధించిన ఉత్తర్వులు విడిగా జారీ అవుతాయి.





జూన్ 7న దేవిన "నూతన బడ్జెట్ విధానం" గురించి జూబ్లీ హాల్లో జరిగిన ప్రభుత్వ కార్యదర్శుల శాఖాధిపతుల సమావేశంలో గవర్నరు సలహాదారు శ్రీ వి. కె. రావు ప్రసంగించారు.

# గాంధీగారి పొదుపరితనము




భారతీయుల పేదరికమొక సామెతయై పోయినది. "భారత పౌరుడు అప్పులో పుట్టుచున్నాడు. అప్పులో పెరుగుచున్నాడు. అప్పులోనే మరణించుచున్నాడు. తుదకు అప్పునే వారసులకిచ్చుచున్నాడు.'' ఈ విషయమెన్నడో గాంధిజీ తెలిసికొని యుండెను.

గాంధిజీ 'బారిష్టర్' అగుటకు ఇంగ్లండ్ వెళ్ళుటకుముందు తల్లి యాజ్ఞ ప్రకారము జైనసాధువు సమక్షమున 'మాంసము' మద్యము మహిళ, —యీ మూడింటికి దూరముగా నుందునని ప్రతిజ్ఞ చేసెను. ఈ విధముగా గాంధిజీ ఇంద్రియ నిగ్రహము—ముఖ్యముగా స్త్రీల యెడల—అలవర్చుకొనెను. లండన్‌లో చదువుకొనునపుడు విద్యార్థనకే కాలమును ధనమును వెచ్చించెను. కాని నృత్యము, గానము మొదలగు వినోద విలాసములకొఱకు ఖర్చుచేయలేదు. అట్టి కాలక్షేపము తగవని నిర్ణయించుకొనెను. నాటినుండియు గాంధిజీ జీవన సరళిలో చాల మార్పు వచ్చెను. వ్యయములో సగము తగ్గించుకొనెను. తాను నివసించుచున్న రెండు గదుల మకామును వదలి ఒక్కగదిలో నివసింపసాగెను. వంటకూడ స్వయముగా చేసికొనుచు చదువునకు ఎక్కువ ప్రాముఖ్యతనిచ్చెను. జీవితములో పొదుపరితనము, కాయకష్టము అలవర్చుకొనెను. కాఫీ, టీ మొదలగు పానీయములు త్రాగుట మానివేసెను. శరీరధారణ మాత్రమే దృష్టిలో నిడుకొని చౌకగా తయారగు ఆహారపదార్థములతో ఆకలిని కట్టివేసెడివాడు. అట్లు చేయుటవలన గాంధీజీకి క్రొత్త అనుభవము కలిగెను. రుచులకు మూలకారణము జిహ్వేంద్రియము కాదనియు మనస్సనియు గ్రహించెను. కావున మనస్సును వశపర్చుకొన్నయెడల సమస్తమును జయింపగలమని ఆయన నిశ్చయించుకొనెను.

## జమాఖర్చులు

తాను ఖర్చు చేసిన ప్రతిపైసకు గాంధీజీ లెక్క వ్రాసెడివాడు. దక్షిణాఫ్రికాలో బారిష్టరుగా ఉన్నప్పుడు కోట్లు, కాలర్లు, దుస్తులు (Coats, collars and clothes) స్వయముగా ఇస్త్రీచేసికొనెడివాడు. అంతియేకాక వెనుకొక అద్దము ముందొక అద్దము పెట్టుకొని క్రాప్ (crop) స్వయముగా చేసికొనెడివాడు.

సేవాగ్రామము నందలి తన ఆశ్రమములో ఉన్నప్పుడు భోజనపు గదిలో వ్రేలాడ గట్టబడిన ఒక 'బోర్డు'పై ఆయన యిట్లు వ్రాసెను:

"ఈ ఆశ్రమపుటాస్తి తమకును, పేదవారిలో మిక్కిలి పేదవారికిని చెందునట్లు భావింతురని నేను ఆశించుచున్నాను. అవసరమైనంత ఉప్పుకంటె ఎక్కువ వడ్డించరాదు. నీరముకూడ వృధాచేయరాదు."

వంట చేయుట, నూలు వడకుట మొదలగు పనులన్నియు ఆశ్రమవాసులే చేయవలెను. మద్య, మాంసాదులు ముట్టకూడదు.

కె. విశ్వేశ్వరరావు

అందరును సౌమ్యులు, సంఘసేవా పరులు, అహింసావ్రతులు అయి యుండవలెను. సత్యాగ్రహము ఆశ్రమ వాసుల ముఖ్య సూత్రము.

చిన్న చిన్న వస్తువులనైనను—బొత్తము, మేకు, పైస, కాగితపు ముక్క మొదలగు వానిని—విలువైన వాటినిగా గాంధీజీ పరిగణించెను.

ఒకనాడు గాంధీజీ ఒక తంతి వార్త (Telegram) పంపదలచెను. ఆ దినము సెలవురోజు అయినందున తపాలా కచ్చేరీ (Post Office) లో ప్రతి మాటకు అణాచొప్పున అదనపు చార్జీ

(ఏసూలు) చేయబడునని ఆయనకు తెలిసెను. అందుచే ఆయన టెలిగ్రాము పంపుటమాని, ఉత్తరముగా తిరిగి వ్రాసి ఉత్తరములు పోస్టు ద్వారా పంపివైచెను.

పోస్టు కార్డులను గాంధీజీ విరివిగా వాడెడివాడు. కాగితము నెప్పుడు ఆయన వృధాచేయలేదు. సాధ్యమైనంత వరకు ఉత్తరములు వ్రాయుటకు బదులు పోస్టు కార్డుల పైనే వ్రాసి పంపించెడి వాడు. ఆయన ఆశ్రమములో చిత్తు కాగితములు కవర్లుగా తయారు చేయబడెడివి. ఒకనాడు తన కార్యదర్శి ఒక వార్తను నోటు కాగితపు ముక్కపై వ్రాయుచుండుట ఆయన గమనించెను. వెంటనే ఆతని వద్దకు వెళ్లి, కార్డు చాలదా? అని ప్రశ్నించెను అచ్చు వేయబడిన ప్రకటనల కాగితముల వెనుక భాగముల మీద ఆయన తరుచుగా ఉత్తరములు వ్రాసెడివాడు. ఇతర ప్రజలనుండి వచ్చిన ఉత్తరముల వెనుక భాగములపై ముఖ్యమైన 'నోట్సు' వ్రాసి కొనెడి వాడు.

## పెన్సిలుముక్క

గాంధీజీతో — ఆయన ఆశ్రమమందు నివసించిన స్లేడ్ (Slade) అను యువతి యిట్లు చెప్పుచుండెడిది "బాలకాలము నుండి తాను ఉపయోగించుచున్న పెన్సిలు ముక్కను ఒకనాడు గాంధీజీ పోగొట్టుకొనెను. ఆశ్రమ వాసులందరు దాని కొరకు చాలవెదకిరి. ఎంత వెదకినను అది కనబడలేదు. ఒకరు క్రొత్త పెన్సిలు తెచ్చి యిచ్చెను. వద్దు — నాకు నెమ్మకటి నాపాత పెన్సిలే కావలెను. అని ఆయన అనెను. అందు చేత వారు దాని కొరకు వెదకుట మరల ప్రారంభించిరి. ఎట్టకేలకు అదిదొరికెను. నవ్వుచు బాపూ దానిని స్వీకరించెను.

సబర్మతీ ఆశ్రమములో ఉన్నప్పుడు గాంధీజీ ఒక మారు జబ్బు పడెను. అచ్చట దోమలు విరివిగా ఉండుటచే దోమతెర వాడుమనికొందరు సలహా నిచ్చిరి. 'అక్కరలేదు భారత దేశము నందలి గ్రామములలో నివసించు కోట్లకొలది బీద ప్రజలు ఉపయోగించలేని యేవస్తువునునేను ఉపయోగించను' అని ఆయన సమాధానమిచ్చెను. కొన్ని కెరొసిన్ నూనె చుక్కలు నుదుటి పైరుద్దించుకొని దుప్పటిలో ముసుగు వేసికొని స్వస్థత చెందు వరకును పరుండెను.

ప్రఖ్యాతి చెందిన ఉప్పు సత్యాగ్రహపు రోజులలో 'దండి'యను గ్రామమునందు గాంధీజీ మకాము చేసెను. ప్రతిదినము చుట్టుపట్లనున్న వేర్వేరు గ్రామములకు వెళ్లి ఉప్పు శాసనములనుల్లంఘింపుడని ఉద్బోధించెను. ఒక రోజు సమావేశము సన్నని ఉప్పు పొరతో కప్పబడిన ఒక చిత్తడి నేల దగ్గర జరిగెను. సమావేశము ముగిసిన తరువాత ప్రజలందరు చిత్తడి నేలయొద్దకు వెళ్లి, గాంధీజీతీసికొన్న తరువాత ప్రతి యొక్కరును ఒక్కొక్క గుప్పెడు ఉప్పు మట్టిని తీసికొనెను. తరువాత గాంధీజీ దారి పొడుగున ఉప్పు మట్టిని గుప్పెటలో పట్టుకొని దండికి తిరిగి వెళ్లెను. ఆ మకామునకు తిరిగి వెళ్లిన తరువాత ఆయన ఒక చిన్న కూజాలో చేతులు కడిగికొని సత్యాగ్రహులలో ఒకనితో ఆ మట్టిని తేరుకొననిచ్చి అటు పిమ్మట నీటిని మరగించి ఉప్పును తీయుమని చెప్పెను. ఒక్క ఉప్పు గల్లును కూడ వృథాచేయుటకు ఆయన కిష్టముండెడిది కాదు.

ఒకనాటి మిట్ట మధ్యాహ్నపు వేళ ఎండ తీవ్రముగానుండెను. గాంధీ తన అనుచరులతో ఒక గ్రామము గుండా వెళ్లుచుండెను. అలవాటు ప్రకారము తన నెత్తి మీద తడి తువ్వాలు(Towel) వేసికొనెను. సహచరులలో నొకడు త్రాగుటకు మంచినీరడిగెను. గ్రామస్థు డొకడు ఒకకుండతో నీటిని త్రాగుటకు ఇత్తడిలోటాను తెచ్చెను, అంతలో ప్రజలు గాంధీజీ 'కారు' చుట్టును మూగి ఆయనకు సొమ్ములు ఇవ్వసాగిరి. ఒక ముదుసలి స్త్రీ ఒక రూపాయి నాణెమును గాంధిజీకియిచ్చునాత్రములో దానిని ఆయన చేతికిచ్చుటకు మారుగా 'లోటా'లో పడవైచెను. వెంటనే గాంధీజీ ఆ జానపదునితో ఆనీరిక త్రావుటకు పనికిరాదు. తువ్వాలి (రుమాలు) పై పారబోయుమని చెప్పెను. కాని. లోటాను పట్టుకొనియున్న ఆపల్లెటూరివాడు గాంధీజీ మాటలు వినిపించుకొనకుండ ఆ నీటిని నేలమీదికి విసరివైచెను. ఇది చూచి గాంధీజీ చాల విచారించెను. ఒక లోటా నీరు వృథాచేయబడెను! అది త్రాగుటకు పనికిరానిదైనప్పుడు ఆ గ్రామస్థుడు గాంధీజీ తలపైనున్న తువ్వాలును తడుపుటకు ఉపయోగించినచో ఆ నీరు సద్వినియోగమై యుండెడిది !!

## మూడోతరగతి ప్రయాణం

ఒకనాడు గాంధీజీ రైలుబండిలో మూడవ తరగతి పెట్టెలో ప్రయాణము చేయుచుండెను. "మీరు మహాత్ములు కదా మొదటి తరగతి పెట్టెలో కూర్చుండరాదా? మూడవ తరగతి పెట్టెలో ఎందుకు కూర్చున్నారు?" అని ఒక ప్రయాణికుడు గాంధీజీ నడిగెను. ఆ ప్రశ్నకు గాంధీజీ ఇచ్చిన సమాధానమిది.

"నాల్గవ తరగతి పెట్టె లేదు కనుక మూడవ తరగతి పెట్టెలోనే ప్రయాణము చేయుచున్నాను."

రైలు బండిలో నాల్గవతరగతి పెట్టెయున్నచో అందులోనే గాంధీజీ ప్రయాణము చేసియుండెడివాడు!

మూడు మూరల కొల్లాయి గుడ్డతోనే గాంధీజీ లండను నందలి 'రౌండ్ టేబుల్' సమావేశమునకు వెళ్లెను. అంతటి చిన్నకొల్లాయితోనే ఆయన భారతదేశ స్వాతంత్ర్యమును సంపాదించెను. అందుచేతనే ఒకసారి ఛలోక్తిగా ఇంగ్లండు దేశ ప్రధాన మంత్రియైన చర్చిల్ గాంధీజీని'అర్ధదిగంబర సన్యాసి'(Half-naked Fakir) అనెను.

చిన్ననాటి నుండియు గాంధీజీ ఆదర్శప్రాయుడైన పౌరుడు. అందుచేతనే ఆయన మహాత్ముడయ్యెను. ఆ మహాత్ముని వలననే భారతదేశ పరాధీనత తొలగెను. ఇటువంటి పౌరుడు ఒక కుటుంబమున కొక్కడైన ఉన్నయెడల అన్నికుటుంబములు బాగుపడును. తద్వారా సంఘము బాగుపడును. తద్వారా సంఘము బాగుండును. సంఘము బాగుపడుట వలన గ్రామము, గ్రామములు బాగుపడుటవలన రాష్ట్రము, రాష్ట్రములు బాగుపడుట వలన దేశము బాగుపడును. రాజకీయ స్వాతంత్ర్యమే కాక ఆర్థిక స్వతంత్రత కూడ దేశమునకు కల్గును.





భారత దేశంలోని కెనడా హైకమీషనరు శ్రీ జె. ఆర్. మేటీ ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావుతో జనవరి 30 వ తేదీన సంభాషణలు జరుపుతోన్న దృశ్యం.

# వార్తా చిత్రాలు



కేంద్ర పరిశ్రమల శాఖ మంత్రి శ్రీ టి.ఎ. పాయ్ సికిందరాబాద్‌లో కాసెట్ టేప్ రికార్డరు విభాగానికి ప్రారంభోత్సవం చేశారు. ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు, పరిశ్రమల శాఖ మంత్రి శ్రీ పి.బసిరెడ్డి గార్లను కూడా చిత్రంలో చూడవచ్చు.



ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు జనవరి 16 న కామారెడ్డిలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ట్రాన్స్‌పోర్టు కార్పొరేషన్ వారి బస్‌డిపో కాంప్లెక్సుకు ప్రారంభోత్సవంచేశారు. ట్రాన్స్‌పోర్టు శాఖ మంత్రి శ్రీ జె. చొక్కారావు, ఎ. పి. యస్. ఆర్. టి.సి. అధ్యక్షులు శ్రీ పి. నరసింగ రావులను కూడా చిత్రంలో చూడవచ్చు.

రాష్ట్ర ప్రభుత్వాలు కూడా తమకు తగిన ఆర్థిక వనరులు లేకపోయినప్పటికి, తమ ఉద్యోగులకు కూడా భత్యం పెంచక తప్పదు. దాంతో ఇకా ధరలు పెరిగిపోతున్నాయి. ఉద్యోగికి భత్యం పెరిగినందువల్ల, ప్రయోజనం లేకుండా పోతుంది. ఈ విధంగా అవాంఛనీయమైన సంఘటనలు పునరావృతం అవుతూ వుంటాయి.

ప్రజల ఇబ్బందులు తొలగాలంటే, దేశంలో నిజమైన శాంతి నెలకొనాలంటే మన దృక్పథంలో విప్లవాత్మకమైన మార్పురావాలి. మన ఇరుగు పొరుగు రాజ్యాలు మనపట్ల శత్రుత్వవైఖరి, అవలంభించి, మనకు నష్టం కలిగించడానికి అదనుకోసం వేచి వున్నాయి. ఈ పరిస్థితులలో మన దృక్పథం మారకపోతే వినాశం తప్పదు.

## హింసాత్మక ఆందోళనలు

మన ఇబ్బందుల తొలగింపుకై హింసాత్మకమైన ఆందోళనలు చేయడానికి స్వస్తి చెప్పాలి. కనీసం, పది సంవత్సరముల వరకూ, ఎట్టి సమ్మెలుగాని జరుగనీయకూడదు. ఇబ్బందుల తొలగింపుకు చట్టబద్ధమైన ఏర్పాట్లులేని సందర్భాలలో, కమిటీలు నియమించి వారి సలహాలను పొంది, ఆ సలహాలను సాధ్యమైనంత వరకు పాటించాలి.

## విద్యారుల కర్తవ్యం

విద్యార్థులు ఏ పరిస్థితిలోనూ ఆస్తి నష్టమునకు, హింసకు దారితీసే చర్యలకు దిగరాదు. వారు కేవలం, తమ చదువులపట్ల మాత్రమే శ్రద్ధ వహించాలి. విద్యార్థులలో క్రమశిక్షణ పెంపొందించాలి. స్వాతంత్ర్యానికి పూర్వం విద్యార్థులు రాజకీయాల్లో పాల్గొనక తప్పలేదు. కాని స్వాతంత్ర్యం సాధించాం కనుక ఇక విద్యార్థులు రాజకీయాల జోలికి పోవలసిన అవసరం ఏమాత్రం లేదు. ఇప్పుడు పాఠశాలలలోనూ, కళాశాలలలోనూ విద్యార్థి సంఘాలకు ఎన్నికలు జరుగుతున్నాయి. కాని, అవి విద్యార్థులలో సంఘీభావాన్ని పెంపొందించడానికి మారుగా కక్షలను రేకెత్తించి అధ్యయన వాతావరణాన్ని కలుషితం చేస్తున్నాయి. విద్యార్థి సంఘాలు నిర్వహించడానికి ఆఖరు సంవత్సరం చదువుతున్న విద్యార్థులకు మాత్రమే ఎన్నికల్లో పోటీ చేయడానికి అనుమతించారు. దీనివల్ల కొంతవరకు బాధ్యత తెలిసిన విద్యార్థులు మాత్రమే ఎన్నిక కావడానికి వీలౌతుంది. విద్యార్థి సంఘాలధ్యేయం, కేవలం విజ్ఞానాభివృద్ధి, విద్యాసౌకర్యాలను సమకూర్చుకొనుట మొదలైనవి మాత్రమే అయిఉండాలి. విద్యార్థుల్లో సమ్మెచేసే అలవాటు పెంపొందించితే పరీక్షల్లో కాపీ కొట్టడానికి దారి తీయవచ్చు. కావున పిల్లలయొక్క తల్లిదండ్రులు, సంరక్షకులు విద్యార్థులు సమ్మెలు చేయకుండా నివారించాలి. నేటి విద్యార్థులే రేపటి పౌరులు. దేశ భవితవ్యాన్ని తీర్చిదిద్దవలసిన బాధ్యత వారిపై ఉంది. వారు తమ చదువులపై శ్రద్ధ వుంచి కష్టపడి విజ్ఞానాన్ని ఆర్జించిననాడే, వారు తమ బాధ్యతలను సక్రమంగా నిర్వహించగలుగుతారు. బ్రిటీషు ప్రభుత్వ కాలంలో రూపొందించబడిన విద్యా విధానం ఈనాటి మన అవసరాలకు తగినట్లుగాలేదు. ఈవిధానాన్ని ఇప్పటి ప్రజాస్వామిక వ్యవస్థకు అనుగుణంగా మార్చుకోవాలి. పాఠ్య ప్రణాళిక విద్యార్థి భావి జీవితంలో, ఉపయోగపడేదిగా ఉండాలి. చదువుకున్న ప్రతి వ్యక్తికి, ప్రభుత్వ ఉద్యోగం లభించేటట్లు చేయడం ఏ దేశానికీ సాధ్యంకాదు. కాయకష్టంతో కూడిన పనిచేయడం తన గౌరవానికి భంగమని నేడు ప్రతి విద్యావంతుడు భావిస్తున్నాడు. ఈ మనస్తత్వానికి స్వస్తి చెప్పాలి. కాయకష్టానికి ఉండే గౌరవాన్ని, మనం గుర్తించాలి. మనం ఏ పని చేసినా సరే నిజాయితీతో కష్టపడి పని చేసి పొట్టపోసుకోవడం హీనమైనదికాదని గ్రహించాలి. నెలకు నాలుగు వందల రూపాయల ఆదాయం కలవారందరు వారి ఆదాయంలో ఒక శాతము నిరుద్యోగ నిధికి విరాళంగా యివ్వాలి.

ఇప్పుడు గుమస్తా ఉద్యోగాలకు కూడ కనీసఅర్హత బి. ఎ. కావలసి ఉంది. నిజానికి గుమస్తాపని చేయడానికి బి. ఎ. వరకు చదవనక్కరలేదు. గుమస్తా ఉద్యోగాల్లో నియామకాలకు మెట్రిక్యులేషన్ పరీక్షలోని మార్కులు మాత్రమే పరిగణనలోనికి తీసుకోవాలి. అలాచేసినప్పుడు, కాలేజీలో రద్దీ తగ్గుతుంది. వాస్తవంగా విద్య నేర్చుకోవాలనే కుతూహలం, అభిరుచి గలవారు మాత్రమే కాలేజీలో చేరడానికి వస్తారు. కాలేజి చదువులకొరకు విద్యార్థుల అభిరుచి, ఆసక్తిని పరీక్షించి వారికి ఆయా విషయాల్లో మాత్రమే చదువు చెప్పించాలి. ఉద్యోగాలకోసం కాలేజీ డిగ్రీలకు ప్రాధాన్యత ఈయకూడదు. అభ్యర్థులను ఉద్యోగాలలో చేర్చుకొన్న పిదప, వారు నిర్వహించాల్సిన పనులనుబట్టి ఆయారంగాల్లో ప్రత్యేక శిక్షణ యివ్వాలి. కర్మాగారాలకు, శిక్షణ కేంద్రాలకు. పారిశ్రామిక సంస్థలకు, సాంకేతిక పాఠశాలలను ఇతోధికంగా జత పరచాలి. అభివృద్ధి చెందిన దేశాలలోపనిలో దక్షతగల వారెవ్వరు ప్రభుత్వ ఉద్యోగాలకొరకు ప్రాకులాడరు, దక్షులైనవారందరు, చాలావరకు ప్రయివేటు సంస్థల ఉద్యోగాలలోనే చేరుతారు. ప్రయివేటు సంస్థలలో ఉద్యోగానికి పనికిరానివారు మాత్రమే ప్రభుత్వోద్యోగాలలో చేరుతుంటారు.

ఇప్పుడు మనదేశంలో వ్యవసాయభూములపైనను, పట్టణ ప్రాంత ఆస్తులపైనను గరిష్ఠపరిమితి విధించడానికి తీవ్రమైన చర్యలు తీసుకోబడుతున్నాయి. ఉన్నతోద్యోగుల జీతాలపై కూడ పరిమితి విధించబడాలి. ఉద్యోగ విరమణజేసి పింఛను పొందుతున్నవారు సాంఘిక సేవారంగంలో కృషి చేయాలి. అలా వారు కృషి చేస్తే ఆరోగ్యము బాగా వుంటుంది. వారికి ప్రొద్దు పోతుంది.

ఇక పారిశ్రామిక రంగం తీసుకుందాం. ఇప్పుడు పరిశ్రమల్లో చీటికిమాటికి సమ్మెలు చేయడం పరిపాటి అయిపోయింది. దీనివల్ల ఉత్పత్తి దెబ్బతింటుంది. కాబట్టి సమ్మెలు చేయనవసరం లేకుండా పారిశ్రామిక వివాదాల పరిష్కారం జరిగేటట్లు ఏదైనా ఒక కట్టుదిట్టమైన వ్యవస్థను ఏర్పరచాలి. కనీసం పది సంవత్సరాల కాలం పాటైనా సమ్మెలను పూర్తిగా నిషేధించాలి. ఇతోధికంగా పరిశ్రమలను స్థాపించి ఉద్యోగావకాశాలను, ఉత్పత్తిని పెంచాలి. ఉత్పత్తి పెరిగినపుడే ధరలు తగ్గుతాయి. ధరలు తగ్గినపుడే సామాన్యమానవుడి బ్రతుకు బాగుపడుతుంది.

## కుల వ్యవస్థ

ఇప్పుడు సాంఘిక స్థితులను పరిశీలిద్దాం. మన సమాజంలో ముఖ్యంగా హిందూసమాజంలో ఎన్నో మూఢనమ్మకాలు, దురాచారాలు వేళ్ళుతన్నుకొని ఉన్నాయి. కులవ్యవస్థ, మన సమాజాభివృద్ధికి గొడ్డలిపెట్టుగా తయారైంది. సాంఘిక వికాస కార్యక్రమాలకు మనం ఎంత ధనం ఖర్చుపెట్టినా, మతాల నిర్మూలన జరగనిదో అది బూడిదలో పోసిన పన్నీరే అవుతుంది. ఈ కుల వ్యవస్థ, మన దేశానికి ఎన్నోఅనర్థాలు తెచ్చిపెట్టింది.కాబట్టి ఈవ్యవస్థనుసత్వరంగా నిర్మూలించాలి.దేశంలోవిద్యావ్యాప్తి, దారిద్ర్య నిర్మూలనతో, కుల వ్యవస్థ దానంతటదే రూపు మాసిపోతుందని, ఒక వాదన ఉంది; కాని ఈ వాదన సరియైనది కాదు. ఎందుచేతనంటే వివిధకులాలకు చెందిన సంపన్నులువిద్యాధికులు కూడ కుల వ్యవస్థను పాటిస్తున్నారు. వారిలో కులతత్వ మనస్తత్వం నమసిపోలేదు. కాబట్టి, కులవ్యవస్థా నిర్మూలన జరగాలంటే, కులాలవల్ల కలుగుతున్న అన్యాయాలను, అనర్థాలను గూర్చి పల్లెపల్లెలో ప్రజలకు తెలియజెప్పడానికి కట్టుదిట్టమైన ఒక ప్రచార వ్యవస్థ ప్రభుత్వంలో ఉండాలి. కులాంతర వివాహాలు ప్రోత్సాహింపబడాలి. కులాంతర వివాహాలు చేసుకున్న దంపతులకు వారి పిల్లలకు ఉద్యోగాల్లో ప్రాధాన్యత ఇవ్వాలి. గ్రామాల్లో తరచుగా సహపంక్తి భోజనాలు ఏర్పాటు చేయాలి. హరిజనవాడలను, విడిగా ఊరికి దూరంగా ఎక్కడో నిర్మించగూడదు. హరిజనులకు గ్రామంలో అందరితో పాటే, నివాసం ఏర్పరచాలి. హరిజన బాలురకు వేదమంత్రాలు నేర్పించి వారిని దేవాలయాల్లో అర్చకులుగా నియమించాలి.

## మానవతా చైతన్యం

మానవ సేవయే మాధవ సేవ అని మతాలు ప్రబోధిస్తున్నాయి. అయినా కొన్ని దురాచారాలను మతానికి, దైవభక్తికి అంటగట్టటం జరుగుతోంది. దొంగ వ్యాపారస్థులు, ఆహార పదార్థాలను, మందులను కల్తీ చేసేవారు, లంచగొండి ఉద్యోగులు వీరంతా తమ అన్యాయార్జితంలో కొంతభాగం దేవునికి చెల్లిస్తే పాపవిముక్తి అవుతుందని తలుస్తారు. దేవాలయాల్లోనే, జరిగే అన్యాయాలకు అంతులేదు. దేవుని దర్శనానికి, దేవుని పూజకు గూడా రకరకాల రేట్లు నిర్ణయించారు. సంపన్నులు డబ్బు చెల్లించి, గుడిలో పూజలు, కల్యాణ మహోత్సవాలు, సహస్ర నామార్చనలు చేయిస్తూంటారు. ఇవన్నీ జరిగే వరకు, పేదవాడు మాత్రం దేవుని దర్శనం కోసం, చలిలో ఎండలో గంటల తరబడి వేచివుండాలి. దేవుళ్లకు జంతు బలి, ఒక్కొక్కప్పుడు మానవబలి గూడ ఇస్తుంటారు. ఇవన్నీ కూడ, తాము చేసిన పాపాలు తొలగిపోతాయనో, లేక దేవుడు అనుగ్రహించి, తమకు ఏదో మేలు చేకూర్చుతాడనో, చేస్తుంటారు. ఇక స్వాములు, గురువుల సంగతి చెప్పనక్కరలేదు. వాళ్లు ఈ కుల వ్యవస్థ, దేవుడు పెట్టిందేనని అమాయక ప్రజల బుర్రల్లో ఎక్కిస్తారు. మానవుడు ప్రారబ్ధ కర్మను బట్టి ఆ యా కులాల్లో జన్మిస్తుంటాడని చెప్తారు. హరిజనులు, తక్కువ కులాలవారు తమ పాదాలను తాకినా, అపవిత్రులై పోయినట్లు, భావించుకుంటారు. ఆవులకు, పాములకు పూజలు చేస్తే పుణ్యం వస్తుందని చెప్తారు. యజ్ఞాలు, యాగాలు చేస్తే వర్షాలు పడతాయంటారు. పూర్వ జన్మలో పుణ్యం చేసినవాళ్లే ఈ జన్మలో భాగ్యవంతులవుతారని చెబుతుంటారు. కాబట్టి ఈ స్వాముల ప్రచారాలను అరికట్టకపోతే, సంఘం ఏనాటికీ బాగుపడదు. ప్రజల కష్టాలు తొలగించడానికి భగవంతుని స్తోత్రము చేయలా? మరి ఈ సమాజంలో కొందరు అవినీతిపరులూ అమాయక ప్రజలను దోచుకొని భాగ్యవంతులై బ్రతుకుతున్నారంటే దానికి కారణం ఎవరంటారు? ఏ దైవశక్తీ ఆ అపనీతిని నిరోధించుట లేదు. వారు పూర్వ జన్మలో పుణ్యకార్యం చేశారు కాబట్టి ఈ జన్మలో ఇదంతా అనుభవిస్తున్నారట! ఈ జన్మలో పాపాలు చేస్తే చచ్చింతరువాత నరకానికి పోతారట. అంత వరకూ వారు, ఇక్కడ హాయిగా జీవితం గడుపవచ్చునట. అప్పటి వరకు వారిపాపకార్యాలను గూర్చి భగవంతుడేమీ పట్టించుకోడట. గుడులలో దేవుళ్ల ఆదాయాన్ని, సొమ్మును, వాటి తాలూకు భూముల ఆదాయాన్ని అపహరిస్తూ ఉంటే, దుర్వినియోగ మౌతూ ఉంటే పట్టించుకోని దేవుళ్లు లోకంలో జరిగే దుర్మార్గాలను అన్యాయాలను అరికట్టుతారా? అంతరిక్ష పరిశోధనల్లో నరకంగాని, స్వర్గంగాని ఎక్కడ ఉన్నట్లు కన్పించలేదు—వీనిని మన మత గురువులు ఎందుకు సృష్టించారంటే, మానవుల్లో సత్కార్యాపేక్ష, పాపభీతి పెపొందించడానికే. ఈనాడు మానవుడు, వైజ్ఞానిక రంగంలో, ఎంతో ప్రగతి సాధించాడు. మానవుల నడవడిని క్రమబద్ధం చేయడానికి సమగ్రమైన శాసనాలు 'రూపొందింపబడ్డాయి. కావున మానవులు తాము చేసిన పాపపుణ్యాలకు, చచ్చిన తర్వాత నరకమో స్వర్గమో అనుభవిస్తారని ప్రచారం చేయవలసిన అవసరంలేదు. అవినీతిపరులకు, మనశ్శాంతి ఉండదని ఏవో ధర్మసూత్రాలు చెబుతూ ఉంటారు. అయితే అన్యాయంగా డబ్బు సంపాధించినవారందరు మతి భ్రష్టులై పోతున్నారా? సాంఘిక రంగంలో అభ్యున్నతిని సాధించాలంటే మూఢనమ్మకాలకు, పుక్కిటి పురాణాలకు, స్వస్తిచెప్పాలి. మానవత్వపు విలువలను గూర్చి, విరివిగా ప్రచారం చేయాలి. ప్రజల్లో హేతుబద్ధమైన దృక్పథాన్ని పెంపొందింపజేయాలి. ఆకాశవాణిలో మతసంబంధమైన ప్రసారాలను మానివేసి, ఆ సమయాన్ని సాంస్కృతిక, సాంఘిక కార్యకలాపాల ప్రసారాలకు ఉపయోగించాలి. మానవతా చైతన్యంలేకపోవడం వల్ల, ప్రజాస్వామ్యంలో ఆర్థిక సాంఘిక సమానత్వం సాధించలేకపోతున్నాం.

సాంఘికరంగంలో మార్పులు రావాలంటే, ఈ క్రింది సూత్రాలు అమలు జరపాలి—

* ప్రజలలో హేతుబద్ధమైన లౌకిక దృక్పథం పెంపొందింపజేయాలి.

* మానవత్వాన్ని పెంపొందింపజేసి మతం ఒక బూటకం ఆర్భాటములేని మానవ సేవ ద్వారానే తరించేది, అని గ్రహించేట్లు చేయాలి. సాంప్రదాయంగా వస్తూవున్న మూఢ ఆచారాలు మూఢ విశ్వాసాలు వదలుకోవాలి. అందరిలో ఆత్మవిమర్శనాశక్తిని పెంపొందింపచేయాలి.

* ప్రజలలో క్రమశిక్షణను పెంపొందింపచేయాలి. ఇందుకు మొదటి చర్యగా బస్సుస్టాండులు, సినిమాహాల్సు మొదలైన వాటి దగ్గర క్యూలలో వేచియుండే అలవాటును ప్రజలలో కలిగించాలి.
* వంద ప్రబోధాలు చేయడంకంటె ఒక్కదానిని ఆచరించడం మంచిదని గ్రహించాలి.
* లంచగొండితనము, దొంగవ్యాపారం, ఆహార పదార్థాలను మందులను కల్తీచేయడం మొదలయిన అవినీతికరమైన పనులనుగూర్చి సమాచారం తెలియవచ్చిన వెంటనే అందుకు సంబంధించిన అధికారులకు ఆ సమాచారము అందజేయాలి. వాటిని అరికట్టుటకు ప్రతివారు తోడ్పడాలి.
* 400 రూపాయలకు మించిన ఆదాయం గలవారందరూ, తమ ఆదాయంలో కనీసం ఒక్కశాతం (1%) "నిరుద్యోగ సహాయనిధి"కి తప్పనిసరిగా విరాళం ఇవ్వాలి. ఆ డబ్బుతో నిరుద్యోగులకు వసతి గృహాలను, భోజనశాలలను ఏర్పరచి సాంఘిక సంరక్షణ కార్య క్రమాలకు వారిని ఉపయోగించుకోవాలి. అట్టికార్యక్రమాలలో ఎక్కువ సేవాధర్మం చూపినవారికి అన్ని రంగాలలోనూ ప్రత్యేక అవకాశములు కల్పించబడాలి. నిధికి జమకట్టబడిన సొమ్ముతో చిన్న చిన్న పరిశ్రమలు స్థాపించి నిరుద్యోగ సమస్యను వీలయినంతవరకు పరిష్కరించడానికి ప్రయత్నించాలి.
* ఏ సమస్య పరిష్కారానికైనాసరే, హింసాత్మకమైన ఆందోళనలు జరుగకుండా చూడాలి.
* విద్యార్థులు సమ్మెలో పాల్గొనకుండా, దౌర్జన్యపూరితమైన చర్యలకు దిగకుండా చూడాలి.
* వ్యక్తులపేర్లలో శర్మ, శాస్త్రి, రెడ్డి, చౌదరి, నాయుడువంటి కులసంకేతాలు వదిలివేయబడాలి.
* హోటళ్ళపేర్లు బ్రాహ్మణహోటలు, రాజుల హోటలు అని కాకుండా శాఖాహార హోటలు, మాంసాహార హోటలు అని మార్చబడాలి.
* హరిజనవాడల్లో తరచుగా సహపంక్తి భోజనాలు ఏర్పాటు చేయబడుతుండాలి.
* కులాంతర, మతాంతర వివాహాలు ప్రోత్సహింపబడాలి.
* గ్రామాల్లోనూ, పట్టణాలలోనూ పారిశుధ్యకార్యక్రమాలను స్వయంగా నిర్వహించుటద్వారా స్వయం సహాయశక్తిని పౌరుల్లో పెంపొందింపజేయాలి.
* నేరములను, కామోద్రేకమును ప్రేరేపించే సినిమాలు చూడరాదని ప్రచారం చెయ్యాలి.



## ఈ సంచికలోని రచయితలు

శ్రీయుతులు

హెచ్.సి. సరీన్, గవర్నరు సలహాదారు, హైదరాబాదు.
బి. సుదర్శనం, బి.ఎ.పి.ఆర్.ఒ, నర్సంపేట, వరంగల్లు జిల్లా
బి.యస్. నాగ్ C/o డా. ఎస్. వీరమల్లు, కవిటం, వయాపోడూరు, ప.గో. జిల్లా
కె. విశ్వేశ్వరరావు, ఆర్థిక, గణాంకశాఖ, హైదరాబాదు
జె. వీరాస్వామి, న్యాయశాఖ కార్యదర్శి, సచివాలయం, హైదరాబాదు,
జి. శ్రీరాములు, టీచర్, యు.పి.ఎస్, పెంబి పోస్ట్, ఖనాపూర్ తా, అదిలాబాద్ జిల్లా
కంబాల కృష్ణమూర్తి, 4-1-465, ట్రూప్ బజార్, హైదరాబాదు-1.
పంద్రంగి రాజేశ్వరరావు, అడ్వకేటు, ఏలూరు.
ఎ. పండరీనాథ్, టీచర్, ఇబ్రహీంపట్నం, హైదరాబాదు.
మధురశ్రీ, జర్నలిస్టు, పెద్దాపురం, తూ. గో. జిల్లా.
కుమారి అచ్యుతుని రాజ్యశ్రీ, C/o ఎ. దుర్గాప్రసాద్, C/o నటరాజ అయ్యర్ &కం.
ఛార్టర్డ్ ఎక్కౌంటెంట్స్, కెనరాబ్యాంకు ఎదురుగా. అబిడ్సు, హైదరాబాదు-1.
కప్పగంతుల లక్ష్మణశాస్త్రి, 69. ఆదర్శనగర్, హైదాబాదు-4.
ఇల్లిందల సరస్వతీదేవి, 2-2-11181/2 న్యూనల్లకుంట, హైదరాబాదు, 44
ఎస్. వెంకటరామారెడ్డి, C/o జూనియర్ కాలేజి, నిర్మల్
పి. రాజగోపాల నాయుడు, ఎం.ఎల్.సి. చిత్తూరు.
బి. ఎస్. రాఘవ, 40/788, క్లబ్ రోడ్, కర్నూలు.
అలీ అక్బర్ అహమద్, ప్రొబేషన్ ఆఫీసర్, బి-847, మల్లెపల్లి, హైదరాబాదు.

# అభినవపోతన శ్రీ వానమామలై వరదాచార్యులు

గోవర్ధనగిరి శ్రీరాములు

సువిస్తృతమైన ఇతి వృత్తంతో, స్వతంత్రమైన కల్పనతో ప్రతిభావంతంగా మహాకావ్య ధోరణిలో కవిత్వాన్ని వ్రాయగలిగిన ఇరవయ్యో శతాబ్దపు తెలంగాణా మహాకవి శ్రీ వానమామలై వరదాచార్యులుగారు. భాగవత గ్రంథ కర్త, భక్తశిఖామణి అయిన బమ్మెర పోతరాజు జీవితాన్ని, మహా మనిషిని, మహా వ్యక్తిని, వ్యక్తిత్వాన్ని, ఉదాత్తమయిన ఆశయాలను మన ముందుంచిన మరో పోతన్న—ఆచార్యులవారు. ఈయన గురించి, 'పోతన చరిత్రము' గురించి తెలియని వాళ్ళుంటూ విద్యావంతులయిన తెలుగు వాళ్ళలో లేరనే చెప్పాలి. కవి సమ్మేళనాలలోను, కవితా గోష్ఠులలోను, సభలూ సమావేశాలలోనూ పండిత పామర జనాన్ని బహుళంగా ఆకర్షించి ప్రశంసలూ, సన్మానాలూ, సత్కారాలూ పొందుతూ ప్రచారం చెందిందీ 'పోతన చరిత్ర' మహా ప్రబంధం. ప్రస్తుత నాగరీకుల్లో కావ్యాలు చదువగల వాళ్ళ సంఖ్య అతి స్వల్పమే. కావ్యాలకు, కవిత్వానికే ఆదరణ, ప్రోత్సాహం లభిస్తే పోతన చరిత్ర ఇంకెంత ప్రచారం పొందేదో! ఎన్ని వేల మంది పాఠకులు స్వయంగా చదువ గలిగే వాళ్ళో!! ప్రాచీన కవుల జీవిత చరిత్ర అంతగా తెలుసుకోదగిన సరియైన ఆధారాలు లేని మనకు-పోతనామాత్యుని జీవిత గాథను సముచితమైన కల్పనతో, ఔచిత్య దృష్టితో సంస్కరించి మహా ప్రబంధంగా రచించ గలిగిన అసమాన ప్రతిభాశాలి శ్రీ వరదాచార్యులు.

వరదా చార్యులు గారిని సన్నిహితులంతా 'వరదన్నా' అని పిలుస్తారు ఆప్యాయంగా. యువకవులకూ, మహా కవులకూ తలలోని నాలుక శ్రీ వరదన్న. తెలుగు భాష అందాలకు అలంకారికుడు ఈ కవి. తన కలంలో నుంచి అమృతపు జల్లులే కురిపించి పాఠకుని హృదయ పీఠంలో శాశ్వత కవితా స్రవంతిని ప్రవహింప జేయగల దిట్ట. 'కవిత్వం అంటే ఇది' అని ప్రత్యక్షంగా చూప గలిగిన ఆధునిక కవిసత్తముడు.

వరదాచార్యులు గారి స్వస్థలం వరంగల్లు జిల్లా మడికొండ. జననం పంధొమ్మిది వందల పదకొండులో. తండ్రి బక్కయ్య శాస్త్రిగారు. వీరు గొప్ప పౌరాణికులు. సంస్కృతాంధ్ర ద్రావిడ భాషల్లో అఖండ పాండిత్యాన్ని సంపాదించిన ప్రజ్ఞాశాలి. వేదాంతమూ, జ్యోతిశ్శాస్త్రాలలో వీరి ప్రతిభ అమోఘమైనది. వాల్మీకి సంస్కృత రామాయణాన్ని పురాణ పద్ధతిలో అతి చక్కగా వ్యాఖ్యానిస్తూ, ఒక్కొక్క శ్లోకాన్ని అనేక విషయాలతో ఉదహరిస్తూ వివరణ చెప్పేవారు. అప్పట్లో వీరిని గురించి "బ్రతికి బక్కయ్య శాస్త్రి పురాణము వినవలె" ననెడి నానుడి సార్థక మయింది.

వానమామలై వారి వంశ వృక్షాన్ని తొలినుంచీ పరిశీలిస్తే అప్పటికీ ఇప్పటికీ కూడా మహాకవులు, పండితులు కనబడుతారు.

వరదాచార్యులు గారి పెద్దన్నగారు వేంకటాచార్యులుగారు. వీరు నానా శాస్త్ర పారంగతులు. బహు భాషా వేత్తలు. ఉర్దూ, ఆంగ్ల భాషలనే కాకుండా ఆధునిక గణిత శాస్త్రాన్ని స్వయం కృషితో నేర్చుకుని తన ప్రతిభను ప్రదర్శించి అనేకుల మన్ననలకు పాత్రులయినారు. మడికొండలోని వీరి ఇల్లు ప్రాచీనతను సంతరించుకుని ఒక గురుకుల వాసంగా వుండేది. వేంకటాచార్యుల గారి వద్ద చదివి అప్పటి 'ఉస్మానియా మెట్రిక్' పరీక్ష పాసయిన వాళ్ళు కూడా వున్నారు. ఆయనను ఆత్మీయులంతా 'పెద్దన్న గారు!' అంటారు.

ద్వితీయ సోదరులు లక్ష్మణా చార్యులు గారు. ఈయన చక్కని కవి, మంచిపండితుడు, తర్కశాస్త్ర వేత్త. బహుభాషా కోవిదుడు. తెలుగు భాషలోనే కాకుండా సంస్కృతము, హిందీ, అరవ భాషల్లోనూ రచనలు చేశారు. చాందా జిల్లాలోని ఆహిరీ రాజా సంస్థాన విద్వాంసులుగా చాలా కాలం వున్నారు. అప్పుడే 'కోయ' భాషకు లిపి, సారస్వతాన్ని సృష్టించి ఆ భాషకు ఎంతో సేవ చేశారు. ఆయన కోయ భాషకు చేసిన సేవ—గిడుగు రామమూర్తి పంతులుగారు సవర భాషకు చేసిన సేవ వంటిదని చెబితే అతిశయోక్తి కాదు. అయితే, లక్ష్మణాచార్యులు గారికి తన ప్రతిభను చాటుకోవటం ఇష్టం లేకనే ఆయన గురించిన ప్రతిభా విశేషాలు చాలా మందికి తెలియక మరుగున పడిపోయినవి. వీరు 1964 లో కీర్తి శేషులయినారు. మరో పది కాలాల పాటు ఈయన వర్ధిల్లి వుంటే ఇంకే విధమయిన సాహిత్య సృష్టి చేసే వారో!

మూడో వారు జగన్నాథాచార్యులు గారు. మాతృ భాషలోనే కాకుండా సంస్కృతము, ద్రావిడ భాషల్లోనూ పాండిత్యాన్ని సంపాదించారు. కొంత కాలం వ్యవసాయ వృత్తిని స్వీకరించి రైతులకు సన్నిహితంగా వుంటూ వారి వ్యావహారిక భాషా పదవిన్యాసాన్ని అవగాహన చేసుకుంటూ కొన్ని వందల వ్యవసాయ పదాలను సేకరించుకుని, ఆ పదజాలాన్ని ఉపయోగిస్తూ రైతు రామాయణము' అనే మహా కావ్యాన్ని రాశారు. 'రైతు జీవిత గాథతో రామాయణ కథను ధ్వనింప జేస్తూ వందల కొద్దీ పద్యాలతో, కొత్త పోకడలతో వ్రాయబడిందీ నవీన కావ్యం. కాని మన దేశ దౌర్భాగ్యమో, ఆంధ్రుల దురదృష్టమో—ఆ మహాకావ్యం ఇంత

వరకూ ముద్రణకు నోచుకోలేదు. ఆ కావ్యం ప్రచురింపబడిన నాడు సాహిత్యంలో సంచలనం కలిగించక మానదు. అంతకుముందే, ఒక వైష్ణవ భక్తుని కథ ఆధారంగా 'కార్పాసలక్ష్మి' అనే నాటకం రచించారు. ఇది పలుమార్లు, పలువురు మిత్రులకు, రసజ్ఞులకు చదివి వినిపించారు కూడా. అయితే, ద్రవ్యాభావం వలన చాలకాలం వరకు ప్రచురింప బడక, ఈ నాటకం లుప్తమైపోయింది. ఈ పరిస్థితి బహు శోచనీయమనిచెప్పకతప్పదు.

వేదాంతి, ఆధ్యాత్మికుడు, పోతన చరిత్ర కృతికర్త అయిన వరదాచార్యులుగారు సోదర వర్గంలో చిన్నవారు. బాల్యదశ నుంచీ ఆయనలోవున్న స్వాతంత్ర్యాభిలాష వల్ల చదువు ఎంతో కాలం సాగలేదు. సంస్కృత, ఆంధ్ర సాహిత్యాలలో వున్న అభిలాష ఆయనకు నిర్బంధంగా పాఠాలు చదువుకోవటంలో కనబడలేదు. సంగీతము, చిత్రకళ మొదలైన లలితకళల్లోనూ ఆయనకు బాగా ఆసక్తి వుండేది. సోదరుడు జగన్నాథాచార్యులకునూ, వరదాచార్యుల గారికినీ మృదుమధురమైన కంఠస్వరం పిత్రాస్తిగా సంక్రమించింది. అప్పటికింకా మనదేశంలో సినిమాలు లేవు. మైలవరం కంపెనీ వంటి ప్రసిద్ధ నాటక సమాజాలు కొన్ని అక్కడక్కడా ప్రదర్శన లిస్తుండేవి. వరంగల్‌లోను ప్రతి యేటా నాటక ప్రదర్శనలు జరుగుతుండేవి. కపిలవాయి రామనాథశాస్త్రి, నిడుముక్కల సుబ్బారావు మొదలైన వాళ్ళ పాటల గ్రామ్‌ఫోన్ రికార్డులు ప్రజాబాహుళ్యంలోకి అప్పుడే వస్తున్నాయి. వరదాచార్యులుగారూ, వారి అన్నగారూ ఆ రికార్డులను పదే పదే వింటూ తామూ పాడుకునే వారు. కేవలం ఊహా మాత్రంగానే తబలా, హార్మోనియం, మృదంగ వాద్యాలు నేర్చుకున్నారు వరదాచార్యులుగారు. ఆ తరువాత మడికొండలో—గ్రామయువకులు ప్రదర్శించిన నరకాసురవధ, గయోపాఖ్యానము మొదలైన నాటకాల్లోనూ ముఖ్యపాత్రలు ధరించి పలువురి ప్రశంసలు, అభినందనలు అందుకున్నారు.

అప్పటికే, ఆయన ప్రాచీన ఆంధ్ర సాహిత్యమంతా కంఠతా పట్టారు. ఆధునిక సాహిత్య ప్రక్రియలన్నీ అవగతం చేసుకున్నారు. తెలుగుభాషా సాహిత్యాన్నే కాకుండా, అన్యభాషా సాహిత్యంనుంచి వచ్చిన అనువాద గ్రంథాలనుకూడా సవిమర్శగా, పరిశీలనా దృష్టితో చదివేవారు. విశ్వకవి రవీంద్రనాథ టాగూరు గీతాంజలి, విలియం వర్డ్స్ వర్త్ పద్యాలు అప్పట్లో ఆయన అభిమానించే వారు.

వరదాచార్యులుగారు రచన ప్రారంభించక పూర్వం మడికొండ సమీపంలోని 'మెట్టు గుట్ట' అనే కొండమీద గుడిలోను, గుహలలోను ఒకసంవత్సరం పాటు గురూపదిష్ట మార్గంలో వాగీశ్వరీదేవి మంత్రోపాసన చేశారు. ఆయన ఏకాగ్రత, అచంచలమైన దీక్షవల్లనూ వాగీశ్వరీదేవి కటాక్షాన్ని స్వల్పకాలంలోనే పొంది—కొంతకాలం స్వీయ పాండిత్యాన్ని అభివృద్ధి చేసుకున్నారు.

వీరి తొలిరచన 'దాగురింతలు' అనే ఖండకావ్యం. విప్లవాత్మక దృష్టి, ప్రాచీన, ఆధునిక కవిత్వ ధోరణుల సమ్మేళనము, వేదాంత తత్త్వము, ప్రకృతి చిత్రణ, సామాన్యుని జీవనగతి ఆయన రచనల్లో తప్పనిసరి కనిపించే చక్కని చిక్కని అందాలు. అయితే ఆయన మితవాది.

## మణిమాల

మహాకవి పోతనకు విహారస్థలమైన ఓరుగల్లు నగరంలో ఇరవయ్యారు సంవత్సరాల క్రితం వరదాచార్యులగారి 'మణిమాల' అనే ఖండకావ్యం ఒక మహా సభలో ఆవిష్కృతమైంది. కీ. శే. వెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి, అడవి బాపిరాజు, శ్రీ మదజ్జాడ ఆదిభట్ల నారాయణదాసు, కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ, కాటూరి మొదలగు విద్వత్కవి పండితులెందరో ఆ కావ్య ఖండికలను చదివి ఆనాడే ప్రశంసించారు. 'మణిమాల' వరదాచార్యులగారికి కవి కీర్తిని పెద్దల మన్ననలను ఆర్జించి పెట్టింది. ఆ తరువాత 'ఆహ్వానము' అనే మరోగేయ సంపుటిని వ్రాసి ప్రకటించారు. పద్య కవిత వ్రాయగలిగినట్లే, గేయ కవిత్వం కూడా సమర్థవంతంగా వ్రాయగలరని ఈ ఆహ్వానమనే గేయ సంపుటిద్వారా ఆయన నిరూపించుకున్నారు.

అవి నిజాంరాజు హైదరాబాదు రాష్ట్రాన్ని నిరంకుశంగా పరిపాలిస్తున్న రోజులు. ఆచార్యులగారు ఒకసారి 'ఫిరదౌసీ చరిత్ర' చదువుతున్నప్పుడు అందు వర్ణితమైన రాజులుచేసే దుర్ణయాలు ఆయన మనస్సును కలవరపరచినవి. రాజులను ధిక్కరించి, వారి నిరంకుశ చర్యలను అసహ్యించుకుని, కర్షక వృత్తితో జీవనోపాధి సాగిస్తూ ఆత్మాభిమానాన్ని రక్షించుకున్న మహాకవి, భక్తాగ్రేసరుడు అయిన పోతానామాత్యుడు ఆయన స్మృతిపథంలో నిలిచాడు. ఆశకు లొంగనివానికి ఈశ్వరుడు లోబడునని నిరూపించిన పోతనయే మహామనిషి అనిపించింది. అప్పుడే, పోతన చరిత్ర రచనకు నాంది ప్రస్తావన జరిగిందని చెప్పవచ్చు!

## పోతన చరిత్ర

1946లో పోతనచరిత్ర రచన ప్రారంభించారు. ఈ కావ్య రచన సాగుతున్న కాలంలోనే కావ్య ప్రాశస్త్యాన్ని గురించిన ప్రసిద్ధి తెలంగాణా అంతటా వ్యాపించింది. గ్రంథరచన పూర్తి కాకుండానే కావ్యంలోని రసవంతమైన ఘట్టాలు అనేకసార్లు కవితా సభలలో ఆచార్యులవారు గానం చేయగా వేలాది శ్రోతలు విని ఆనందభరితులయినారు. తన పాండితీ ప్రకర్షతో విద్వత్కవి పండితుల ప్రశంసలూ అందుకున్నారు. 'అభినవ పోతన' బిరుదాంకితులయి పలుచోట్ల గౌరవింపబడ్డారు.

## అనారోగ్యం

1948లో వరదాచార్యులుగారి ఆరోగ్యం చెడింది. అప్పటికే ఆయనను వెంటాడుతున్న ఆర్థిక దుస్థితితో బాటు అనారోగ్యం కూడా సంభవించింది. రాజులకు రావలసిన రాజయక్ష్మ ఈ కవిని వరించింది.

అప్పటి హైదరాబాదు రాష్ట్రంలో 'పోలీసుచర్య' జరుగుతున్న కాలంలో వరదాచార్యులుగారు మైసూరులో చికిత్స పొందుతున్నారు. ఆయన గురించి అప్పట్లో ఎవరూ వినగూడని దుర్వార్త వినవచ్చింది— 'వరదాచార్యులుగారు మృత్యువు వాత పడ్డారని'. ఈ వార్త పలువురు ఆప్తులను, అభిమానులను, మిత్రులనూ కలవరపరచింది.

పోలీసు చర్య అనంతరం 'ఆచార్యులవారు జీవించియే వున్నారని' తెలిసి అందరూ సంతోషించారు. ఆనందభరితులయినారు. ఆ ఆపత్ సమయంలో వరదాచార్యులుగారికి అన్ని విధాల సహాయ సహకారాలొనర్చి ఆదుకున్న కవి మిత్రులు శ్రీయుతులు కాళోజీ నారాయణ రావు, దాశరథి, డా॥ సి. నారాయణరెడ్డిగార్లు. డా॥ శ్రీ॥ బూర్గుల రామకృష్ణరావుగారు కూడా ఆచార్యుల వారి పరిస్థితి తెలుసుకుని విచారపడి వెయ్యి రూపాయలు పంపించారు.

ఎలాగయితేనేం, ఎన్నో చికిత్సలు, కత్తికోతలుజరిపి, పూర్తిగా చెడిన ఒక ఊపిరితిత్తిని ఆపరేషన్ చేసి తొలగించిన తరువాత ఆయన బ్రతికి బయట పడ్డారు. ఆయన శ్రేయోభిలాషులు అదే పదివేలనుకుని సంతృప్తి చెందారు.

ప్రాణాలను దక్కించుకోవటంకన్నా తదుపరి రక్షించుకోవటమే ఆయనకు మరో పెద్దసమస్యగా పరిణమించింది. భుక్తి కోసం ఏదో ఒకటి చేయక తప్పిందికాదు. దోమకొండ జనతా కళాశాలలో వయోజనులకు బుర్రకథలు, ఏకాంకికలు, భక్తిగీతాలు కానే వ్రాసి, నేర్పుతూ—ప్రదర్శింపజేస్తూ కొంతకాలం వున్నారు. అప్పటికి, పోతనచరిత్ర మహాకావ్య రచన పూర్తయింది.

'పోతన చరిత్రము' వ్రాయగలగటం ఒక యెత్తు; ఆ మహాకావ్యం ప్రచురించబడి వెలుగు చూడటం మరొక యెత్తూ అయింది. కావ్య రచనలోనే కాకుండా, ముద్రించి ప్రకటించటంలోనూ ఆయన ఎన్నో క్లిష్ట సమస్యలనూ, అవాంతరాలనూ ఎదుర్కొవలసి వచ్చింది. ఆ శ్రమ లేకుంటే మరో అంతకావ్యం వ్రాసేవారేమో!

ఆంధ్రప్రదేశ ప్రభుత్వం వారు పదివేల రూపాయలు ఈ కావ్యప్రచురణకు విరాళంగా ఇచ్చారు. ఇంకా—మిత్రులు, సహృదయాంధ్ర ప్రజానీకము వీరి కావ్య ప్రాశస్త్యాన్ని గుర్తించి వేనోళ్ళ అభినందించారు. సభా, సన్మానాలు జరిపి యథాశక్తి ధనసహాయం చేసూ వచ్చారు. 1966లో పోతన చరిత్రము ప్రచురించబడింది.

ఆ తరువాత 'జయధ్వజం' అనే మరో ఖండకావ్యం ప్రచురించారు. ఈ సంవత్సరం 'విప్రలబ్ధ' అచ్చయింది. ఈయన రచనలలోని ఆధునిక కవితా రీతులను పరిశీలించే వారికి ఆ పుస్తకాలు చక్కని నిదర్శనాలు.

ఇలా, ఆయన వ్రాసిన పద్య, గద్య కృతులు, గేయ ఖండికలు, ఏకాంకికలు, నాటకాలు, బుర్రకథలు, ఇంకా ఇతర రచనలు అసంఖ్యాకంగా వున్నాయి. సాహితీ లోకంలో ఆయన స్థానం అగ్రగణ్యమైనది. తెలంగాణాలో ఆయన వెదజల్లిన సాహితీ సౌరభం, యువ కవులకు, రచయితలకు ఆయన ఇచ్చిన చేయూత చిరస్మరణీయమైనవి. ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ ఫెలోషిప్ యిచ్చి గౌరవించటము, రాష్ట్ర శాసనసభా సభ్యత్వమూ ఆయన శేముషీ ప్రతిభకు తార్కాణాలు.

ఆయన— నిరంతరాన్వేషి. జిజ్ఞాసువు. ప్రాచీన రీతుల్లో ఆధునిక ప్రబంధాలు, ఆధునిక రీతుల్లో నాగరిక గ్రంథాలు వ్రాయగల సమర్థుడు. ఆయన అమృత హృదయంలో పోతన్న తరువాత ఇంకే మహనీయునికి స్థానం లభిస్తుందోనని తెలుగు వాళ్ళంతా వేచి చూస్తున్నారు.

---

## యండగండి

(11 వ పేజి తరువాయి)

సర్వీరామకృష్ణ ఇతర సర్పంచీలకు మార్గదర్శకమని వేరే చెప్పనవసరంలేదు. ఆకివీడు సమితి అధ్యక్షులైన శ్రీ పి.వి.ఎల్ తిమ్మరాజుగారికి అమూల్య సలహా సహకారాలు శ్రీ సుబ్బరాజుగారికి లభించాయి. వీరిద్దరి కృషిఫలితంగా ఈ గ్రామంలో ఉన్న 130 హరిజన కుటుంబాలకు స్థలం సేకరించి ఇళ్ళు నిర్మించటానికి పట్టాలు ఇవ్వటం జరిగింది. హరిజన ఇళ్ళకాలనీ నిర్మాణానికి సర్పంచ్ శ్రీ సుబ్బరాజుగారు, సమితి అధ్యక్షులు శ్రీ తిమ్మరాజుగా విరామమెరుగక కృషిచేస్తున్నారు.

యండగండి గ్రామ ప్రజలకు ఉపయోగానికిగాను పరిరక్షిత మంచినీటి పథకాన్ని 1968 సంవత్సరంలో అమలుపరచింది. ఈ పథకం అమలు పరచడానికి లక్ష రూపాయలు ఖర్చు అయింది.

### ప్రజా విరాళాలు

యండగండి గ్రామ పంచాయతీ ప్రజలు ఎంతో చైతన్యవంతులు. వారికి నాయకత్వం వహించిన శ్రీ పెన్మెత్స సుబ్బరాజుగారు ఉదారంగా విరాళాలు యివ్వడంలో పెట్టిందిపేరు. గ్రామంలో గ్రంథాలయ భవన నిర్మాణానికిగాను 10 వేల రూపాయల విరాళం ఇచ్చారు. గ్రామంలో ఆర్. టి. సి. బస్సుస్టాండు నిర్మాణానికిగాను 10 వేల రూపాయలు విరాళం యిస్తున్నారు. యండగండి గ్రామంలో పశువైద్యకేంద్రం స్థాపించడానికి అయిదువేల రూపాయలు విరాళం యిచ్చారు.

ఈ గ్రామ పంచాయతీ పదవులకు, ఇతర ప్రజాసంస్థలకు జరుగుతున్న ఏకగ్రీవ ఎన్నికలే ఈ గ్రామ ప్రజలు సమైక్యంగా ఉన్నారనటానికి ఒక నిదర్శనమయితే, ఆ గ్రామ పంచాయతీ పసూల్లు చేస్తున్న నూటికి నూరుపాళ్ళు పన్నులు, ఆ గ్రామ ప్రజలు తమ పంచాయతీకి అందజేస్తున్న సహకారానికి ఒక చక్కని ఉదాహరణ.

"ప్రజలు విరాళాలు యివ్వడం, ఉత్సాహంగా పాల్గొని సంక్షేమ కార్యక్రమాలకొరకు ప్రజలు కృషిచేయడమే యండగండి గ్రామపంచాయతీ ప్రత్యేకత"- అని ఆ గ్రామ పంచాయతీ సందర్శించిన తర్వాత తిరిగి కలుసుకున్నపుడు నర్సాపురం డివిజనల్ పంచాయతీ ఆఫీసరు శ్రీ ఎస్. దేవేంద్రుడు గారితో అన్నాను. ★

# సృష్టి పరిశీలన

కంభాల కృష్ణమూర్తి

## సమస్యల పరిష్కారము

చార్లెస్ డార్విన్ ఆంగ్లేయుడు. 2 సం॥ లు మెడికల్ కాలేజిలో చదివి కాలేజి విడిచిపెట్టి ఓడలో బయలుదేరి 5సం॥ లు మహా సముద్రాలలో విహరించి ప్రయోగాలు చేసి ఈ సృష్టి ప్రారంభమై 200కోట్ల సంవత్సరములైనదని వ్రాసెను. 130 కోట్ల సం॥ లు భూమి కాలుచున్నది. 70 కోట్ల సం॥ ల క్రితము భూమి చల్లబడి ప్రాణి కోటి బయలు దేరినది. 5 లక్షల సం॥ ల క్రితము మానవుడు తన ప్రస్తుత రూపమును ధరించెనని కూడా వ్రాసెను.

హెచ్. జి. వెల్స్ ప్రపంచ చరిత్రలో ఈ సృష్టి ప్రారంభమై 200 కోట్ల సం॥ లైనదని వ్రాసెను. భూగర్భ శాస్త్రములలో గూడా (Geology) అంతే వ్రాసిరి. చిత్రమైన విషయమేమంటే మన పంచాంగము కూడా అదే లెక్క వ్రాసినది. 195 కోట్ల 58 లక్షల 80 వేల సం॥లైనదని. పాశ్చాత్యుల లెక్కలకు మన పంచాంగ లెక్కలు సరిపోవుట మన పూర్వీకుల గణిత శాస్త్ర నిపుణతకు నిదర్శనము.

కాని వేదము ఈ సృష్టికి మొదలు చివర లేదని చెప్పును. బౌద్ధ జైన సిద్ధాంతములు గూడా ఈ సృష్టికి ఆద్యంతములు లేవని తెలుపు చున్నవి.

సృష్టిలో కాలమునకు ఎట్లు అంతులేదో అట్లే సృష్టి వైశాల్యము గూడా అంతులేదని ఖగోళ శాస్త్రము సూచించుచున్నది. ఉదాహరణకు ఆకాశంలో 10 వేల కోట్ల గాలక్సిలున్నవి. గాలక్సి అనగా నక్షత్రముల గుంపు అని అర్థము. ఒక గుంపుకు 10 వేల కోట్ల నక్షత్రములున్నవి. వీని సంఖ్యయేగాదు వీని పరిమాణము గూడా మనము వూహించలేనంత గొప్పది. ఉదా:- భూమి కంటే సూర్యుడు 13 లక్షల రెట్లు బరువు. సూర్యుని కంటే ఆరుద్ర నక్షత్రమొకటి $2\frac{1}{2}$ కోట్ల రెట్లు పెద్దది. జ్యేష్ఠా నక్షత్రము సూర్యుని కంటే 9కోట్ల రెట్లు పెద్దది. ఇంత బరువైన బ్రహ్మాండమైన గోళములు ఆకాశంలో నిరాధారముగా కోట్ల సం॥ ల నుండి వ్రేలాడు చున్నవి. దైవము ఎంత గొప్పవాడో వూహించగలమా ? అందుకే పోతన భాగవతములో " హరి హరి హరి చిత్రలీల హరియే ఎరుగున్." అని వ్రాసినాడు.

సూర్యునికి మనకు మధ్య దూరము 9 కోట్ల 38 లక్షల మైళ్లు. అచట నుండి మనకు వెలుతురు చేరుటకు 8 నిముషముల 20 సెకండ్లు పట్టును. (వెలుతురు సెకండుకు 186000 మైళ్ల ప్రయాణము చేయును.) సూర్యునికి చాల దూరములో కొన్ని నక్షత్రములున్నవి. అచటనుండి అదే వేగముతో పయనించి భూమికి వెలుతురు చేరుటకు 12 వందల కోట్ల సంవత్సరములు పట్టును. ఇంతటి అద్భుతమైన అనంతమైన బ్రహ్మాండమైన సృష్టిని చేయు భగవంతుని గొప్పతనము పూర్తిగా ఏ మానవుడు ఎప్పుడూ చెప్పలేడని అవతార పురుషుడైన గాంధీజీ చెప్పెను. స్వామి వివేకానందుడు సప్తర్షులలో ఒకడని రామకృష్ణ పరమహంస చెప్పెను. (ఆయన ధ్యాన సమాధిలోనుండగా ఆ విషయము దెలిసినదట) అట్టి సప్తర్షులలో ఒకరైన స్వామి దైవముగురించి మనకు కొంచెమే తెలియునన్నారు. అని బిసెంటు తన పూర్వ జన్మ గూర్చి చెప్పినది. తాను పూర్వ జన్మలో యిండియాలో పుట్టితినని స్వప్నము గాంచి వెంటనే యింగ్లాండునుండి యిండియాకు వచ్చి జీవితాంతము మన దేశమునకు సేవ జేసెను. పూర్వజన్మ దెలిసిన ఆమె గూడా దైవమును గూర్చి చెప్పలేక పోయెను. సృష్టి అంతమయ్యే ముందు మానవునకు దైవ రహస్యము దెలియునని చెప్పెను. ఆమెయేగాదు వేదములు గూడా చెప్పలేదు.

వేదములు దైవమును గూర్చి ఈ రూపముగాదు, ఈ నామము గాదు, ఈ గుణముగాదు, ఇదిగాదు, ఇదిగాదు (నేతి, నేతి) అని చెప్పినవిగాని పరమాత్మని స్వరూప స్వభావము లిట్టివని వేదములు గూడ చెప్పలేకపోయెను.

### కష్టజీవుల కన్నీరు

ఇంత గొప్ప దైవ సృష్టిలో దుఃఖమెక్కువ, సుఖము తక్కువ కనబడుచున్నది. వ్రాయబడిన చరిత్రలో బుద్ధునికి మించిన మహానుభావుడు పుట్టలేదని జవహర్‌లాల్ చెప్పెను. ఘనుడైన బుద్ధభగవానుడు "దుఃఖసమయంలో కష్టజీవులు కార్చిన కన్నీరు" నాలుగు సముద్రములలో నీటికంటె ఎక్కువని సెలవిచ్చెను.

మహాభారతములో భీష్మాచార్యులు "భూమిపై గడ్డిఎక్కువ. గడ్డికంటె దుఃఖమెక్కువ" యని చెప్పెను. ఇంత దుఃఖముతో గూడిన సృష్టిఎందుకు జేయవలెనని భగవానుడైన రమణ మహర్షిని ఒకరు ప్రశ్నించిరి. భారతదేశములో ఇద్దరు సూర్యులున్నారు. ఒకరు గాంధీజీ. రెండవవారు రమణమహర్షి అని సరోజినీనాయుడు (Nightingale of India) చెప్పినది. ఆమె సోదరుడు శ్రీ హరీంద్రనాథ్ ఛటోపాధ్యాయ ఒక విలువైన వ్యాసమువ్రాసి దాని చివర నీ విధముగా ముగించెను. "Sri Aravindo is the mighty personality, Sri Ramana is the mighty impersonality." రమణ మహర్షి కుమారస్వామి అవతారమని ప్రతీతి. పై ప్రశ్నకాయన 10 నిమిషము లాలోచించి, "ఈసృష్టి భగవంతుని లీలా వినోద" మనెను.

బుద్ధభగవానులు ఈ లోకములోని దుఃఖమునకు రెండు కారణములున్నవని చెప్పెను. 1. అజ్ఞానము 2. అసమానత్వము.

అజ్ఞానము దొలగించుటకు బుద్ధుడు పాదచారియై 50 ఏండ్లు దేశాటనజేసి జ్ఞానదానము గావించెను. అందుకే అన్నిదానములలో జ్ఞానదానము గొప్పది అన్నారు.

ప్లేటోశిష్యుడు అరిస్టాటిల్ వేయిగ్రంథముల రచయిత. మొదటి గ్రంథాలయ స్థాపకుడు. అలెగ్జాండరు గురువు. గ్రీకురాజ వైద్యుని సుతుడు. అరిస్టాటిల్ ప్రపంచమేధావంతులలో అగ్రగణ్యుడని ఇటాలియన్ కవి డాంటే వ్రాసెను.

ఈ ప్రపంచములో ఎప్పుడూ యుద్ధములే రక్తపాతమే కనబడుచున్నది. ఎప్పటికైనా శాంతియుండునా యని ఆలోచించి ఈ దుఃఖమునకు అశాంతికి కారణ మరయ గోరి, 158 రాజ్యాంగచట్టములు చదివెను.

## సమానత

వానిని చదివిన తదుపరి అరిస్టాటిల్ "The craving of men for equality is the source of unrest on earth." అని చెప్పెను, అనగా సమత్వమునకై ప్రజలు పడు తహతహయే లోకములోని దుఃఖమున కంతటికి కారణము.

ఈశావ్యాసోపనిషత్తు. సమత్వము, సోషలిజముగూర్చి వ్రాసినది. అది చదివి గాంధీజీ టాగూరు ఆనందపరవశులైరి.

మిల్టను కోమసు నాటకముతో సమత్వము కావలెననికోరెను. షేక్స్పియర్ కింగ్‌లియర్ నాటకములో డగ్లసుద్వారా సమత్వమును ధ్వనింపజేసెను. భారతీయుల పవిత్రగ్రంథము భగవద్గీతలో 40 చోట్ల సమతాధర్మమును శ్రీకృష్ణుడు అర్జునునకుపదేశించెను.

"నీ వలెనే అందరిని భావించు. అందరివంటివాడవే నీ వనుకొనుము". (యజుర్వేదం 40వ అధ్యాయం. 6వ. మంత్రం)

మహాకవి మిల్టనువ్రాసిన కోమసు నాటకంలో కొద్దిపాత్రలు మాత్రమున్నవి. ఇద్దరు సోదరులు ఒకసోదరి అరణ్యంగుండా పోవుచుండగా దారిలో గాలివాన వచ్చినది. అంతసోదరి ఒకప్రక్కకు, సోదరులిరువురు మరొకప్రక్కకు విడిపోయిరి. అమ్మాయి అందమైనది. ఆమెనొక మాంత్రికుడు దారిలో చూచి ఆమె సోదరులిరువురిని వెదకి తెచ్చెదనని నమ్మించి తన యింటికి తీసుకొనిపోయి చివరికి తన్ను పెండ్లాడమని కోరెను. ఆమె అతనినేమీ దూషించక పరమేశ్వరునిట్లు ప్రార్థించెను.

"పరమేశ్వరా నన్ను ప్రేమించుట ఈతని తప్పుగాదు. అందమైన అమ్మాయిలను అబ్బాయిలు ప్రేమించుట సహజము. కాని ఈ తప్పు మీది. సౌందర్యాన్ని లోకం లోని స్త్రీల కందరికి సమానంగా పంచినయెడల నన్నీతడు నేడు బాధించక పోయెడివాడు గదా " యనెను.

నమోవృక్షేభ్యః =వృక్షములను,
నమశ్వభ్యః = శునకములను (కుక్కలు),
నమో అశ్వేభ్యః = గుఱ్ఱములను,
నమో అస్తుసర్పేభ్యః = పాములను,

ఇవ్విధముగ సర్వజీవులను ప్రేమించి నమస్కరింపుమని వేదమందున్నది.

## కులభేదములు

"జీవరాసులన్నిటిలో కల్లా మానవుడు విశిష్టమైనవాడు. మానవునికి వున్నంత విజ్ఞానం, మేధస్సు మరొకప్రాణికి వుండే అవకాశం లేదు. అలాంటి మానవాళిలోనే ఎక్కువ తక్కువలు కుల మత భేదాలు వుండటం మానవజాతికి అవమానకరం." అని మహాత్మాగాంధీజీ తన స్వీయ చరిత్రలో పేర్కొనినాడు.

రామానుజాచార్యులు ఏటికి స్నానానికి పోవునప్పుడు ఒక అగ్రవర్ణుని భుజముపై చేయివేసి పోవువారు. స్నానముచేసి తిరిగి వచ్చునపు డొక అంటరాని వాని భుజముపై చేయివేసి వచ్చెడివారు. అదిగాంచి అగ్రవర్ణముల వారు మండి పడి అట్లెందుకు చేయుచున్నారని యడుగ యింత కాలము కొందరిని తక్కువ వారని అవమానించిన పాపము పోవుటకిదియే వుపాయమని చెప్పిరి.

ఆర్థికసాంఘిక సమత్వము కావలెనని క్రీస్తు, మహమ్మదు బోధించుటచే అనేక మంది అణగద్రొక్కబడిన హిందువులు మతాంతరులైరి. ప్రసిద్ధ పారిశీక పండితుడు ఫెరిస్టా 12 వ శతాబ్దములో 60 కోట్ల మంది హిందువులున్నారని వ్రాసిరి. ఆలెక్క ప్రకారం యిప్పుడు కొన్నివందల కోట్ల హిందువులుండాలి. కొద్ది మాత్రమేయున్నారు. కారణం అగ్రవర్ణులైన హిందువుల బాధలు పడలేక ఇతర మతములలో కులములేదని వారితో కలిసిరి. ఇతర మతములు తక్కువనిగాదు నేను వ్రాయునది.

"మాజాతి మతముల కవ్వల గూడా బ్రహ్మజ్ఞానులుగలర"ని వ్యాసభగవానుడు వ్రాసెను. అందుచే మనకన్ని మతములు జాతులు ఒక్కటే. అట్టి సమత్వము సిద్ధించినపుడే లోకములో శాంతి యుండును.

అందుకు వ్యతిరేక నిదర్శనములు గూడ కనుపించుచున్నవి. ఉదా:- రష్యా చైనా దేశములు సోషలిస్టు దేశములు. కాని ఆ రెండు కలహించుచున్నవి. అందుచే శాంతి ఎప్పటికైనా లభించునా

యని అనుమానము. కాని మన విధి మనము చేయవలెను కదా ? మన విధి సమత్వముకై కృషి చేయుట. తరువాత ఫలితము కృష్ణార్పణము. పరిపూర్ణ అవతార పురుషులైన శ్రీరాముడు, శ్రీకృష్ణుడు ఈ లోకమును పూర్తిగా మరమ్మతు చేయలేక పోయిరి. రామ బాణమునకు తిరుగు లేదు. శ్రీ కృష్ణుని చక్రమునకు ఎదురు లేదు. అట్టి తిరుగు లేని ఆయుధములు పట్టిన వారికే ఈ లోకపు మరమ్మతు సాధ్యము కానప్పుడు మనకు సాధ్యమగునా? అని అనుమానము. అట్లని చైతన్య రహితులమగుట మహాపాపమని వేదాంత కేసరి శ్రీ వివేకానందులు చెప్పిరి. మనవల్ల ఒక వ్యక్తి మారినాచాలుననిరి.

ఆర్థిక సమత్వము చేకూరిన సాంఘిక సమత్వము సులభమని కొందరి యూహ. ఇది నిజమో కాదో తెలియదు. నిజం కావచ్చు. ప్రయోగంచేసి చూడాలి. సమత్వ సిద్ధికి అనేక మార్గములున్నవి. అందొకటి సహకార సంఘములు.

ఒక వస్తువు ఫాక్టరీలో 5 రూపాయలకు తయారగుచున్నది. దానిని బజారులో 10 రూపాయల కమ్ముచున్నారు. తేడా 5 రూపాయలు. ఈ 5 రూపాయల తేడాను సర్‌ప్లస్ వేల్యూ (Surplus Value) అందురు. ఇదేలోకంలో అసమానత్వమునకు సర్వానర్థములకు కారణ భూతమని మార్క్సు మహాశయుడు 2 పెద్ద గ్రంథములు రచించెను.

## సహకార సంఘాలు

అందుచే సర్వత్రా అనగా ప్రతి ఆఫీసులో హాస్టల్లో, క్లబ్బులో, పాఠశాలలలో కళాశాలలలో ప్రతివీధిలో, వాడలో ఒక సహకార సంఘము నుస్థాపించి ప్రతి వస్తువును మధ్యవర్తి నుండి కానక ఫాక్టరీనుండి తెప్పించుకొని అమ్మిన, పేదలకు మహోపకారము చేయుటే గాక సమత్వమును సాధించిన వారమగుదుము. దానికి నిజాయితీ పరులైన వ్యక్తులు కావలెను. అవినీతి పరులు చేరిన సహకార వ్యవస్థ కొనసాగదు. శ్రీరామ కృష్ణమిషన్ వంటి సంస్థలు దానికి పూనుకొనుట వాంఛనీయము.

ద్విజుడైనా సరే, చండాలుడైనా సరే ఎవ్వడు జ్ఞానసంపన్నుడో వాడే నా గురుడు.

— జగద్గురు శ్రీ ఆదిశంకరుడు

సూర్యునికి చీమకు తత్వమున ఎంత మాత్రము భేదము లేదు:— బుద్ధుడు.

శ్రీరామానుజాచార్యులవారు మంగలిని హరిజనునిగూడా గురువులుగా నియమించిరి. వారినే ఆళ్వారులందురు.

శ్రీరాముడు గుహుని, శబరి ఆతిథ్యము స్వీకరించెను.

శ్రీకృష్ణుడు శూద్రుడైన విదురునింట భుజించెను.

శ్రీరామకృష్ణ పరమహంస ఉపనయన కాలమున విశ్వబ్రాహ్మణ స్త్రీయొద్ద భిక్షగొని నాటినుండి సర్వకులస్థులనుండి భిక్షగొని తెమ్మని శిష్యులకాజ్ఞయిచ్చెను.

శ్రీమతి శారదామాత సోదరి నివేదితను తన గదియందే బస చేయనిచ్చెను. తల్లి సర్వ సమత్వము పాటించెడిది.

గాంధీజీ హరిజన బాలికను పెంచుకొనెను. (లక్ష్మి) హరిజనుని వంట మనిషిగా నియమించెను. (హరిరామ్) స్వామి వివేకానందుడు హరిజనునింట భుజించెను. పాకీవానితో భంగు పీల్చెను. సిద్ధాంతములు భేదిల్లినను సకల మానవులు సమానము అను విషయము ప్రచారము చేయుటలో రామానంద, కబీరుదాసు చైతన్య, నానక్, రామానుజులు ఏకాభిప్రాయము కలిగియుండిరి.

సృష్టికి పూర్వదశ ఏకత్వము. వైవిధ్యమే సృష్టి. మిక్కిలి అర్వాచీన గ్రంథములలో సైతము వివిధ వర్ణములవారు ఏక పంక్తిలో భుజించుటకు నిషేధములేదు.

సత్యయుగమున ఒకే కులముండెడిది. అందరూ బ్రాహ్మణులే, నేడుగూడ అట్లే కావలెను.

—స్వామి వివేకానంద.

ఖేత్రి మహారాజొక రోజు వివేకానందుని వేశ్యగానమును వినుటకు పిలువగా స్వామి నిరాకరించెను. అంత నామె సూరదాసు కీర్తన పాడెను. దాని అర్థమిది —"పరమేశ్వరా నాదుర్గుణముల గణింపకుము. నీవు సర్వసమదృష్టివిగదా! ఒక ఇనుపముక్క దేవాలయములో విగ్రహముగుచున్నది. వేరొకటి కసాయివాని కత్తియగుచున్నది. కాని రెండును స్పర్శవేదిని దాకినంతనే బంగారమగుచున్నవి గదా", అది విని స్వామి లజ్జించి ఇక నేనెవ్వరిని ద్వేషించననెను.

సృష్టి యనగా నిర్మించుటగాదు. జీలుగు బెండు రేణువులను నీటి తొట్టె అడుగున బడవేసినపుడు అవి వొక్కొక్కటిగాని గుంపులు గుంపులుగాని పై భాగమునకు వచ్చునట్లు తాను కోల్పోయిన సమత్వమును మరల పొందు నిమిత్తము ప్రకృతి చేయు తీవ్ర ప్రయత్నమే సృష్టి, సమత్వము మరల సాధింపబడినంతనే ప్రపంచము అంతమగును. ఎవరు సమత్వమును గడింతురో వారు భగవద్గీత జీవనులు.

సమత్వమునుబొందు ప్రయత్నము నిరంతరము సాగుచునే యున్నది. స్వేచ్ఛకు గుర్తు సమానత్వమే. సర్వసమ దృష్టియే వేదాంత నీతి సారాంశము. ప్రత్యేకపు హక్కును గురించిన తలంపును మనము విడిచి పెట్టవలెను. అప్పుడే ఆస్తిక్యము సిద్ధించును. అని వేదాంతము చెప్పును. బుద్ధుని మహత్తర సందేశములలో నొకటి సర్వ సమానత్వము. ఆయన కుల భేదము సుతరాము పనికిరాదనెను.

---

ప్రముఖ పత్రికా సంపాదకులు

# కోటంరాజు సోదరులు

అరుదుగా సోదరులు పత్రికా సంపాదకులుగా వన్నెకెక్కుతారు. మన దేశమందు అట్టి వారిలో ప్రథములు ఘోషుసోదరులు (శిశిర్ కుమార్, మోతిలాల్). వీరు తొలుత అమృతబజారు పత్రికను బెంగాలీలో నిర్వహించేవారు. లిట్టను ప్రభువు ప్రవేశపెట్టిన దేశభాష లందునడిపే పత్రికలను కుదించే చట్టముక్రింద ఆంక్షవిధింపబడగానే అమాంతముగా తమ పత్రికను ఆంగ్ల దినపత్రికగా మార్చివేసినారు. నాటినుండి నేటి వరకు ఆ పత్రిక ఘోషుకుటుంబము అధ్వర్యమున సలక్షణముగ వెలువడుచున్నది. తరువాత యిట్టి ప్రతిభను ప్రకటించినవారు జోసఫ్‌సోదరులు (జార్జి, పోథాన్) జార్జిజోసెఫ్ పండిత మోతిలాల్ నెహ్రూ అధ్వర్యమున వెలువడిన "ఇండిపెండెంటు" అను ఆంగ్ల దినపత్రికకు సంపాదకులుగా నుండి తుదకు కేంద్ర శాసనసభ సభ్యులైరి. పోథాన్ జోసెఫ్ సోదరునివలె బారిష్టరైనా ఎన్నడు కోర్టు గుమ్మం త్రొక్కకుండా పత్రికానిర్వహణలోనే తమ జీవితాన్ని గడిపారు. వీరు పని చేసినన్ని పత్రికలలో మరే పత్రికా రచయితా పని చేయలేదు. పాశ్చాత్యులు నిర్వహించే పత్రికలలోనేగాక శ్రీ మహమ్మదాలీ జిన్నా ముస్లిమ్‌లీగ్ ఆశయాలను ప్రచారం చేసేందుకు స్థాపించిన "డాన్" దిన పత్రికకు సంపాదకులుగా పని చేశారు. వీరి 'టీ' కప్పు శీర్షిక బహుళ ప్రచారం పొందింది. వీరు స్వర్గస్థులైనాక 'పద్మభూషణ' బిరుదుతో భారత ప్రభుత్వం వీరి స్మృతిని గౌరవించింది.

ఈ కోవకు చెందినవారే కోటంరాజు సోదరులు (సర్వ శ్రీ. పున్నయ్య, రామారావు). పున్నయ్యగారు జ్యేష్ఠులు. మునివారు కొంచముదివారుగా మారి కోటయ్య, రాజయ్య అనే మూలపురుషులతో కోటంరాజువారయ్యారు. వీరిది తొలుత గుంటూరుజిల్లా, తెనాలి తాలూకా, కతేవరం. అచటి నుంచి నైజాం ప్రాంతానికి వలసవెళ్లి చీరాల చేరుకున్నారు. వీరి తండ్రి నారాయణరావుగారు స్కూలు మాష్టరు, జీతం పన్నెండు రూపాయలు. పిల్లలు పండ్రెండుగురే. కాలానుగుణ్యంగా నూతన భావాలనలవరచుకున్న సంస్కారులు. పిల్లలలో జ్యేష్ఠులు శ్రీ పున్నయ్య బాపట్ల హైస్కూలులో చదివి మెట్రిక్యులేషను పరీక్ష వ్రాశారు. లెక్కలలో సున్న రావటంచేత పరీక్ష తప్పారు. సిగ్గుతో బొంబాయి పారిపోయారు. మనుగడ సాగించేందుకు మేడలపైకి నీళ్ల మోసేవారు. శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారి అమృతాంజనం సంస్థలో గుమాస్తాగా ప్రవేశించారు. అమృతాంజనం ప్రచారానికి కరపత్రాలు దేశంలో దశదిశలందు పంచేందుకు పోస్టు చేయవలసియుండుటచేత వీరికపుడే భారతదేశంలోవున్న పోస్టాఫీసుల పేర్లన్ని కంఠస్థమయ్యాయి.

బ్రహ్మసమాజ ప్రభావానికి లోనై మదరాసు వచ్చి ప్రచారకులుగా పనిచేయటమేకాక "హ్యూమానిటీ" అనే ఆంగ్ల పక్షపత్రికను నడిపేవారు. నెలసరి ఆదాయం రూ 65/ లలో సోదరులైన శ్రీ రామారావును పట్టభద్రుని చేయటానికి నెలకు ముప్పయి రూపాయలు ఖర్చుపెట్టేవారు. వారి సోదరప్రేమ అట్టిది. కరాచీ నుంచి ప్రచురితమయ్యే "సింధు అబ్జర్వరు" అనే ఇంగ్లీషు దిన పత్రికలో సహాయసంపాదకులుగా ప్రవేశించి అచిరకాలంలో సంపాదకులయ్యారు. సింధు రాజకీయాలను వీరు తీర్చిదిద్దారంటే అతిశయోక్తి లేదు. అన్ని పార్టీలవారు వీరిని సంప్రతించేవారు. వీరితో ఏకీభవించని వారు సహితం వీరి నీతి నిజాయితీని అభిప్రాయాలను గౌరవించేవారు. వీరికి సంస్థాన ప్రజలహక్కులయెడ సానుభూతి వుండుటచేత ఆ విషయాన్ని గురించి శ్రీ జవహర్‌లాల్‌నెహ్రూ యిచ్చిన దీర్ఘోపన్యాసాన్ని యథాతథంగా ప్రచురించారు. అందుకు పత్రిక యజమాని కోపించగా వీరు తమ వుద్యోగానికి రాజీనామా యిచ్చి మరో పత్రిక

పండ్రంగి రాజేశ్వరరావు

పెట్టటానికి నిశ్చయించుకున్నారు. అంత యజమాని తమాయించి తమ తొందరపాటుకు ఖేదపడి తమ పత్రికలో వుండేందుకు వప్పించారు. అట్లా వీరు మూడు దశాబ్దాలపాటు "సింధు అబ్జర్వరు" సంపాదకులుగావున్నారు. సి.పి. స్కాటు 'మేన్ ఛెష్టరు గార్డియన్'కు ఎటో వీరు తమ పత్రికకు అట్లు వుండిరి. 'క్రీమ్ క్రేకర్' శీర్షిక క్రింద రోజూ చక్కటి వ్యాసాలు వ్రాసేవారు.

## జిన్నాలో మార్పు

నేను (1937-39)పాట్నాలో వుండగా రాజకీయంగా చాలా మార్పులు వచ్చాయి. అంతవరకు జాతీయవాదిగా వున్న శ్రీ జిన్నా మతోన్మాదిగా మారుతోన్నరోజులు. శ్రీ సావర్కరు సమాన వుజ్జీగా తయారయ్యారు. మొదటి వుపన్యాసంలో మహాత్మాగాంధి అనుటయేగాక వుర్దూలో మాట్లాడమంటే తనకు మాతృభాష అయిన గుజరాతీ, నేర్చుకున్న ఇంగ్లీషుమాత్రమే వచ్చునన్న జిన్నా క్రమేపీ మిష్టరు గాంధి అంటూ కచ్చాపచ్చగా వుర్దూలో మాట్లాడటం ప్రారంభించారు. సావర్కరు హిందువులు జాతి, ముసల్మానులు సంఘము మాత్రమే అంటూ హిట్లరు జర్మనీలోని జర్మను యూదులతోపాటు పోల్చేవారు. అపుడు కొద్దిరోజుల తేడాలో పాట్నాలో ముస్లింలీగు వార్షికసమావేశము, భాగల్పూరులో హిందూ మహాసభ సమావేశము జరిగాయి. అపుడు శ్రీ పున్నయ్య యీ రెండు సమావేశాలను గురించి తమ పత్రికకు నా చేత ప్రత్యేక వ్యాసాలు రాయించుకున్నారు. ఏ పార్టీకిచెందని ప్రముఖుడైన డాక్టరు సచ్చిదానందాకు నేను సన్నిహితుడుగా వుండుటచేత ప్రధాన విషయాలపై ఆయన అభిప్రాయాలను నా ద్వారా సేకరించేవారు. మా అత్తగారు కోటంరాజు వారి ఆడపడచు అగుటచేత నా యెడ ఆయనకు ప్రత్యేకమైన అభిమానం కూడా వుండేది. నీటికంటే రక్తము చిక్కనకదా.

అదృష్టవశాత్తు మహారాష్ట్ర క్రైస్తవయువతి డాక్టరు తారాబాయి ఆయనకు సహధర్మచారిణిగా దొరికింది. ఆమెకు మంచి ప్రాక్టీసు వుండటమేకాక ఆనాటి కరాచీలో సగం జనాభాను ఆమె స్వయంగా ఎరుగుంటే మిగతా సగం ఆమెచేతుల మీద పుట్టినవారే అనే సూక్తి ప్రచారంలో వుండేది. She knew half of Karachi personally and she delivered the other half ). నెలసరి సంపాదన మూడువేల రూపాయలదాకా వుండేది. ఆమెపేర అచట అపుడే స్త్రీల వున్నతపాఠశాల స్థాపించబడింది. నేటికీ ఆ విద్యాలయం ఆ పేరుతోనే నడుస్తోందని వినికిడి. కరాచీలో ఒక ప్రాంతానికి పున్నయ్యా పూర్ పేరు పెట్టారు. పగలు యింట్లో శాకాహారము. సాయంకాలము ఆయన పాలు పళ్లు తీసుకొని భార్యాపిల్లలు మాంసాహారము తీసుకునేందుకు అడ్డు పెట్టేవారుకారు. ఆదివారం మధ్యాహ్నము మాత్రం అందరూ శుద్ధ ఆంధ్ర బ్రాహ్మణ భోజనం ఆవకాయ, అప్పడాలు వడియాలతోసహా అపుడు అచట వుండిన ఆంధ్రులందరితో కలసి ఆహ్లాదంగా విందారగించేవారు. వారికి లక్ష ఏబదివేలు విలువచేసే యిల్లుండేది. ఇద్దరు కొడుకులూ యిద్దరు కూతుళ్లూ, ఆంధ్రులకు వారి ఇల్లొక ధర్మసత్రంలా వుండేది.

## చరమ దశ

కాని చరమ దశలో కష్టాలపాలయ్యారు. ఇంపీరియల్ బ్యాంకులో పనిచేసే పెద్దబ్బాయి సేనలోచేరిన చిన్నబ్బాయి మరణించారు. ఒక కుమార్తె వితంతువయింది. దేశ విభజనవల్ల ఆస్తిపాస్తులు వదలి బొంబాయి తరలివచ్చిన కొలది కాలానికే ది. 27-7-1948వ తేదీని ఆయన పరమదించారు. అంతకుముందు సోదరునితో విజయవాడవచ్చి "కృష్ణవేణి ప్రచురణలు'' అనే సంస్థను స్థాపించి ఇంగ్లీషులోను తెనుగులోను పత్రికలను పుస్తకాలను ప్రచురించాలని ఏర్పాట్లు చేశారుకూడా. కాని ఆ ప్రణాళిక గాలిమేడ అయింది. శ్రీమతి తారాబాయి చివరకు బెంగుళూరులో స్థిరపడ్డారు. వైధవ్యము, వృద్ధాప్యము, బధిరము జతకాగా యింట్లో దొంగలుపడి విలువైన వస్తువులు ఎత్తుకుపోయారు. ఆ పురాణ దంపతులకు రావలసిన కష్టాలుకాదు. కాని విధి బలీయము. ఇటీవల రాజమండ్రి వెళ్లినపుడు, లోగడ కాంగ్రెసు సారథిగాను జాతీయ సౌధానికి పునాది రాయిగాను పరిగణింపబడిన శ్రీ బారు రాజారావు కుటుంబాన్ని చూచినపుడు ఒళ్లు జలదరించింది.

రామారావుగారు పున్నయ్యగారికన్న పదిహేనేళ్లుచిన్న. అన్నగారివద్ద పత్రికా రచయితగా ఓనామాలుదిద్ది, చింతామణిగారు సంపాదకుడుగానున్న "లీడరు'' పత్రికలో ప్రవేశించారు. అందులోంచి బ్రిటీషువారి ఆధ్వర్యమున వెలువడే "టైమ్స్ ఆఫ్ ఇండియా''లో ప్రవేశించారు. పత్రికా రచనకు సంబంధించిన అన్ని రంగాలలోను అందెవేసిన చెయ్యిగా తయారయ్యారు. ప్రకాశంగారి ''స్వరాజ్య''లో పనిచేసి రావలసిన జీతం బకాయికై దావాచేసి వసూలుచేసుకున్నారు. మొత్తం 26 పత్రికలలో పనిచేశారు. అందులో రెండుమాత్రమే వార పత్రికలు. మిగిలినవన్నీ దిన పత్రికలే. శ్రీ జవహరలాల్ నెహ్రూ స్థాపించిన ''నేషనల్ హెరాల్డు'' సంపాదకుడుగా శాశ్వతమైన కీర్తిని సంపాదించారు. అంతకు పూర్వమే హార్నీమన్, విల్సన్ లాంటి వుద్దండులతో బుజాలు రాసుకుని యుండుటచేత సంపాదకుడుగా వారిని మించారు. రాష్ట్ర గవర్నరుతో "ఢీ"కొని గజగజలాడించారు. జైలు జీవితం కూడ గడిపారు. రెండవ ప్రపంచ యుద్ధ సమయంలో ''నేషనల్ హెరాల్డు'' మూతపడింది. అపుడు వీరు వ్యాసాలువ్రాసి కాలక్షేపం చేశారు. డాక్టరు పట్టాభి శీతారామయ్య ప్రభృతులు స్థాపించిన ''శుభోదయ'' సంస్థకు సంపాదకులుగావచ్చి ఎంత కాలానికి పత్రిక వెలువడనందున వైదొలగవలసి వచ్చింది. కష్టాలలో నున్నపుడే వీరి సత్తా వికసించేది.

తిరిగి ''నేషనల్ హెరాల్డు'' పత్రికను ప్రారంభించారు. స్వతంత్రం వచ్చాక రాజ్యసభ సభ్యులై తమ విధులను ప్రతిభావంతంగా నిర్వహించారు. శ్రీ నెహ్రూ ప్రధాన మంత్రిగా అమెరికా పర్యటించినపుడు కూడా వుండిరి. పంచవర్ష ప్రణాళిక ప్రచురణాధికారిగ దేశమంతటా పర్యటించిరి. ఎచట ఏ పని చేయుచున్నను ఆంధ్రత్వమును వీడలేదు. కలకత్తాలో (1933-35) "Free India'' సంపాదకులుగ వచ్చినపుడు మా అందరకు అచట సన్నిహితులైరి. ఏదోవిధంగా ఆంధ్రుల ప్రతిభను సంపాదకీయాలలోవుటంకించేవారు. పాట్నాలో ''సెర్చిలైటు" సంపాదకుడుగా నేపాలు జాతీయ నాయకులకు అండదండలుగా నిల్చారు. నీతి, నిజాయితీలకు గీటురాయిగా వర్ధిల్లారు. హైదరాబాదు సంస్థానమందు ఆర్యసమాజస్థులు పౌర హక్కులకు సత్యాగ్రహము ప్రారంభించినపుడు వీరు బలపరచిరి. వీరిని తమవైపు త్రిప్పుకొనుటకై నైజాము తన ఏజెంటును లంచముతో పంపగా వీరు తరిమివేసిరి. తమ పురోభివృద్ధికంటె సహచరులకై తాపత్రయపడెడువారు. కలాన్ని కత్తిగా వుపయోగించుటచేత "Sword as my Pen" అను తమ ఆత్మకథను ఆంగ్లములో రచించి చరితార్థులైరి. ది. 9-3-1961వ తేదీని ప్రమాద వశాత్తు రైలునుండి జారిపడి తమ 64వ ఏట పరమపదించిరి.

వీరి నల్గురు కుమాళ్లు వృద్ధిలోకి వచ్చారు. పెద్దవాడు శ్రీ ప్రతాప్ పత్రికా రచయితగా జీవితాన్ని ప్రారంభించి, విదేశీ శాఖలో ప్రవేశించి ఇండోనీషియా, ఆఫ్రికా, పశ్చిమ జర్మనీలందు మనరాయబార కార్యాలయములలో పనిచేసి యిపుడు అమెరికా సంయుక్త రాష్ట్రములందు మన రాయబార కార్యాలయమందు ప్రథమ కార్యదర్శిగా పనిచేయుచున్నారు. రెండవ కుమారుడు శ్రీ నారాయణరావుగారు ఇండియన్ అక్కౌంట్సు అండు ఆడిట్ సర్వీసులో బీహారునందున్నత పదవిలో వున్నారు. మూడవ కుమారుడు శ్రీ విక్రమరావు ''టైమ్స్ ఆఫ్ ఇండియా''లో పని చేయుచున్నారు. నాల్గవ కుమారుడగు శ్రీ సుబ్బారావు బ్యాంకు వుద్యోగిగా నున్నారు. వీరి కుమార్తెను వుత్తర హిందూస్థానపు బ్రాహ్మణునకిచ్చి వివాహము చేసిరి. ఆమె భర్తతో అమెరికాలో నున్నది.

వీరి స్మారకార్థము హైదరాబాదులో పత్రికా రచయితల వాడను నిర్మించిరి. అట్టిపని పాట్నాలో చేయుటకు ప్రయత్నములు జరుగుచున్నవి. ఎట్లా చూచినా కోటంరాజు సోదరులు చిరస్మరణీయులు. వీరి జీవితము ఆదర్శప్రాయము. వీరి స్మృతికి శాశ్వతత్వము కల్పించుట ఆంధ్రుల కనీస ధర్మము.

## రాజకీయ నాయకుడు

## ప్రజాహిత గ్రంథ రచయిత

# ఉన్నవ లక్ష్మీనారాయణ

( 1873-1958 )

ఎ. పండరీనాథ్

అటు రాజకీయ రంగంలోనూ ఇటు సాహిత్య రంగంలోనూ సమపాళ్ళలో కృషిసలిపిన వారు అరుదుగా కనిపిస్తారు. ఉన్నవ లక్ష్మీనారాయణగారు భారత జాతీయోద్యమంలో పాల్గొంటూనే సంఘ సంస్కరణోద్యమాన్ని కూడా కడు సమర్థతతో నిర్వహించారు.

### మాలపల్లి

ఉన్నవ లక్ష్మీనారాయణ గారిపేరు ఎత్తగానే "మాలపల్లి" నవల మనుస్మృతి పథంలో కదులుతుంది. వీరి రచనలలో మాలపల్లి అగ్రస్థానాన్ని ఆక్రమిస్తుంది. మాలపల్లి అప్పటి ఆంధ్రదేశంలోని రాజకీయ, సాంఘిక వైజ్ఞానిక పరిస్థితులకు ప్రతిబింబం అది ప్రజా హృదయాలలో విపరీత పరిణామాలను కలిగిస్తుందని భావించి దానిని కొద్దికాలం వరకు ప్రభుత్వం నిషేధించింది కూడాను. ఇంకా నాయకురాలు, స్వరాజ్య సోదె వంటి రచనలు వీరి సాహిత్యకృషికి ప్రబల నిదర్శనాలు.

సౌజన్యమూర్తి, అకలంక దేశభక్తుడు అయిన ఉన్నవ లక్ష్మీనారాయణగారు గుంటూరు జిల్లాలోని వేములూరుపాడు గ్రామములో జన్మించారు. వీరితండ్రి శ్రీరాములుగారు. వీరు గుంటూరులోని క్రిష్టియన్ కళాశాలలో ఎఫ్. ఏ. వరకు చదివి కొన్ని చిన్న చిన్న ఉద్యోగాలను చేస్తూ ప్లీడరు పరీక్షలో ఉత్తీర్ణులైనలభయ్యోయేట గుంటూరులోనే ప్లీడరు వృత్తిని ప్రారంభించారు. 1913లో ఐర్లండుకుపోయి డబ్లిన్ నగరంలో బారిష్టరు పట్టాన్ని పుచ్చుకున్నారు. వీరిలో పుట్టుకతోనే స్వాతంత్ర్యభావాలు ఉదయించగా ఐర్లండు స్వాతంత్ర్యోద్యమ నాయకుడైన డివేలెరాతో కలిగిన పరిచయం వీరి భావాలను ఇనుమడింపజేసింది.

### సహాయ నిరాకరణోద్యమం

స్వదేశానికి తిరిగివచ్చి వీరు మదరాసులోనూ, గుంటూరులోనూ బారిస్టరు వృత్తిని ప్రారంభించి ఎంతో కీర్తినీ, ధనాన్నీ సంపాదించారు. గాంధీజీ పిలుపు విని వీరు 1920లో బారిస్టరు వృత్తికి తిలోదకాలర్పించి సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొన్నారు. ఇంకా వీరు వివిధ రాజకీయోద్యమాల్లో పాల్గొని ఎన్నో సార్లు జైలుశిక్ష ననుభవించారు. వీరు 1910లో మొట్టమొదట భాషా రాష్ట్ర నిర్మాణాన్నికోరుతూ తీర్మానాన్ని చేయించారు. విశాలాంధ్ర నిర్మాణానికై తీవ్రకృషి సలిపినవారిలో వీరుకూడా ఒకరు.

### స్త్రీ జనాభ్యుదయం

స్త్రీ జనాభ్యుదయానికై వీరు సల్పినకృషి మరుపురానిది. 1902లో వీరు గుంటూరులో వితంతు శరణాలయమును స్థాపించి ఎంతో మంది వితంతువులకు వివాహములను కావించారు. కొంత కాలం వీరేశలింగంగారితో సహకరిస్తూ రాజమహేంద్రవరంలో కూడా ఉన్నారు. 1922లో గుంటూరునందు "శారదా నికేతనము"ను స్థాపించి జాతీయ విద్యావిధానాన్ని అనుసరించి స్త్రీలకు సామాన్య విద్యావిధానాన్ని ప్రారంభించారు. స్త్రీలకు విద్యతోపాటు విజ్ఞానాన్నే కాక వృత్తివిద్యను నేర్చుకునే ఏర్పాట్లను గావించారు. శారదానికేతనం నారీ లోకానికి వెలుగుబాటనుచూపి ఎంతోమంది స్త్రీల జీవితాలను తీర్చిదిద్దింది.

సాహితీసేవతోపాటు సంఘసంస్కరణోద్యమాన్ని తలపెట్టి ఎంతో సామర్థ్య తో నిర్వహించిన వీరి సేవ మరపురానిది.

# సమిష్టి కృషి ద్వారా సమాజ సంక్షేమం

## సీతానగరం గ్రామ ప్రజల ఆదర్శం

సీతానగరం ఒక ప్రత్యేక గ్రామ పంచాయతీ కాదు. పెద్దాపురం సమితిలోని జగ్గంపేట పంచాయతీలో చేరివున్న గ్రామం. 1961 సంవత్సరం లెక్కల ప్రకారం ఈ గ్రామం జనాభా 362, కుటుంబాలు 119 మాత్రమే. ఈనాడు ఈ గ్రామ జనాభా 589, కుటుంబాలు 220. ఈ గ్రామం ఆయకట్టు 1400 ఎకరాలు మాత్రమే. వివిధ వర్ణాలవారు ఈ గ్రామంలో సమైక్యంగా కృషిచేస్తున్నారు. ఈ గ్రామం ఒక ఆదర్శ కుటుంబానికి చక్కని నిదర్శనం అంటే అతిశయోక్తి లేదు. జగ్గంపేటకు రెండుమైళ్ళ దూరంలో పెద్దాపురం గోకవరం రోడ్డుపై ఉంది సీతానగరం గ్రామం.

ఈ గ్రామం వ్యవసాయ రంగంలో సాధించిన అభివృద్ధి లెక్కలోకి తీసుకొన వలసినది. మొదట్లో యిక్కడ వ్యవసాయం వర్షాధారమే. కాని పెద్దాపురం సమితి అందజేసిన సహాయ సహకారాల వల్ల ఈ గ్రామంలో రైతులు 49 బావులు తవ్వుకొని, 175 ఎకరాలు సాగులోకి తెచ్చుకొని పంటలు పండిస్తున్నారు. ఇప్పటికి సమితి లక్ష రూపాయలు ఆర్థిక సహాయం అప్పురూపంలో యిచ్చింది. వ్యవసాయంకోసం రైతులు 11 ఆయిల్ యింజనులు కొనుక్కున్నారు. ఈ సహాయమేగాక సహకార బ్యాంకుల నుంచి అప్పులు తీసుకొని ఒకనాడు బీటలు వారి బీడులుగా, నిరుపయోగంగా పడి ఉన్న భూములను సస్యశ్యామలం చేశారు సీతానగరం రైతాంగం.

సీతానగరం గ్రామ ప్రజలకు చదువు సంధ్యలపై శ్రద్ధ ఎక్కువ అని ఆ గ్రామంలో పనిచేస్తున్న అధ్యాపకులు శ్రీ గుత్తుల నారాయణ మూర్తిగారు అన్నారు. ప్రజలు విద్యాప్రాముఖ్యాన్ని గుర్తించారు. 20 విద్యార్థులకు నోచుకోలేని పాఠశాలకు 60 మంది బాల బాలికలు వచ్చి విద్య నభ్యసిస్తున్నారు. పెద్దాపురం సమితి సహకారంతో 60 మంది బాల బాలికలకు ఉపయోగపడే మధ్యాహ్న భోజన పథకం అమలు జరుప బడింది. 9 వేల రూపాయలు ఖర్చుతో నిర్మించిన పాఠశాల శాశ్వత భవన పథకంలో నాల్గవ వంతు మేరకు సీతానగరం గ్రామ ప్రజలు శ్రమదానం చేశారు.

### యువజన సంఘం

సీతానగరం గ్రామంలో శ్రీరామ యువజన సంఘం 25 మంది సభ్యులతో పనిచేస్తున్నది. ఈ యువజన సంఘం ఒక ఎకరం నేలను కౌలుకు తీసుకొని, ఆధునిక పద్ధతులపై వ్యవసాయం చేస్తున్నది. ఈ యువజన సంఘానికి అధ్యక్షులుగా శ్రీ పాపలపాటి సీతారామరాజు, ఈ సంవత్సరం యువజన సంఘ పరంగా ఒక పఠనాలయాన్ని ప్రారంభించాలని యోచిస్తున్నామని తెలియజేశారు.



శ్రమదానం చేస్తున్న సీతానగరం ప్రజలు

### మహిళా మండలి

సీతానగరం గ్రామంలో శ్రీమతి జంపన వెంకట నరసాయమ్మ గారి అధ్యక్షతను ఒక మహిళామండలి పనిచేస్తున్నది. ఈ మహిళా మండలి కుట్టుపనిని మహిళలకు నేర్పిస్తున్నది. పెద్దాపురం సమితి రెండు

---

**మధుర శ్రీ**

---

కుట్టుమిషనులను నాల్గవవంతు విరాళంపై అందజేసింది. సీతానగరం మహిళామండలి చైతన్యవంతమైన పాత్రవల్ల, ఈ గ్రామంలో ప్రతీ కుటుంబం ఒక పెరటి తోటను పెంచుకుంటున్నారని పెద్దాపురం సమితి బలవర్ధక ఆహార పథక కార్యక్రమాలను చూసే అధికారిణి కుమారి మనోరమ అన్నారు. ఈ మహిళామండలి ఒక గ్రంథాలయాన్ని నిర్వహిస్తున్నది.

( తరువాయి 33వ పేజీ )

అనంత

# నూనెల సాంకేః

సాల్వెంట్ తీసే యంత్రానికి







వంట యంత్రముతో కూడిన మెకానిక్ స్క్రూ ప్రెస్

★

లేబటరీ దృశ్యం



పురంలోని

# క పరిశోధనసంస్థ



ష్ట్రపతి ప్రారంభోత్సవం చేశారు.





క్రొవ్వు ఆమ్లము వడపోత యంత్రం



రోటరీ డ్రైయర్ యంత్రం



# హిందీ సాహిత్యములో
## వీర రస ప్రాధాన్యత--జాతీయ భావన--దేశభక్తి ప్రబోధము

సాహిత్యమనగా అన్ని రసముల సమ్మేళనము. మహాకావ్యములలో శృంగార, వీర, శాంతములలో ఒకదానికి మిగుల ప్రాధాన్యమీయబడును. అన్నింటికన్నను వీరరసము ప్రధానమైనది. విశ్వసాహిత్యములో కూడా దీనికే ప్రాముఖ్యమీయబడినది, "ది ఫెయిరీక్వీన్", "ట్రోజన్‌వార్" మొదలగు వానియందును, వాల్మీకి రామాయణమందు రామ రావణ యుద్ధము, మహాభారతము మున్నగునవి వీరరస ప్రధానమైనవి.

వీరరసమునుండియే జాతీయ భావము. దేశభక్తి, దేశప్రేమ, "నా దేశము" అనెడి మమకారము, ప్రేమ పుట్టుకొస్తాయి. కవులు తమ కలములలో, గాయకులు తమ గళములలో ఈ దేశభక్తిని, జాతీయ సమైక్యతను అంకురింపజేసి ప్రబోధిస్తారు. ఇది కేవలము యుద్ధమునకై జనుల సంసిద్ధ పరచుటగాక, సాంఘిక సాంస్కృతిక విప్లవమునుదెచ్చు శంఖారావముగ భావించ వచ్చును. కవి తన దేశ పరిస్థితిని ప్రతిబింబించునట్లు రచన గావించి మాతృదేశము ఎడ పౌరుల కర్తవ్యాన్ని ఉద్బోధిస్తాడు. భౌగోళిక ఏకత్వము, రాజనైతిక ఏకత్వము, సాంస్కృతిక ఏకత్వము యొక్క సమగ్ర రూపమే 'జాతీయత.'

"జంబూద్వీపే, భరత వర్షే, భరత ఖండే" "జననీ జన్మ భూమిశ్చ స్వర్గాదపి గరీయసీ" మొదలైన పలుకులలో 'నా దేశము, నా జన్మభూమి' – అనెడి భావము నిబిడీకృతమైయున్నది.

హిందీ సాహిత్యములో వీరగాధా కాలమున పేరుకు తగినట్లు వీరరస ప్రధానమైన కవితలల్లబడినవి. ఆ కాలపు రాజకీయ స్థితిగతులు అస్తవ్యస్తముగ నుండెడివి. రాజులు విలాసములలో మునిగి తేలెడివారు. దేశము చిన్నచిన్న రాజ్యములుగ విభజింపబడి యుండటంలో ఈర్ష్యాద్వేషాసూయలతో, రాజ్య విస్తరణకాంక్షతో రాజులెల్లప్పుడు యుద్ధములలో మునిగితేలుచుండెడివారు. కవులు తమ తమ రాజుల శౌర్య ప్రతాపముల నుగ్గడించు అతిశయోక్తులతో గూడిన కవితలల్లి ఇటు రాజు అటు ప్రజల అభిమానము బొందెడివారు. "పృథ్వీరాజ రాసో", "బీసలదేవరాసో", "అల్హాఖండ్" మున్నగునవి అప్పటి రచనలు. చందవరదాయీ ప్రముఖ కవి. తమతమ ఆశ్రయ దాతల పొగడుట, వారి పరాక్రమ వర్ణన, యుద్ధక్షేత్రములలో వీరుల ఉత్సాహపూరితుల గావించుట, యుద్ధవర్ణన, సైన్యముల తయారీ, అస్త్ర శస్త్ర ప్రయోగముల వర్ణన గావించెడివాడు. ఈ కాలపు ఇంకొక విశేషమేమనగా కవులు తమ రాజులతోపాటు స్వయముగా యుద్ధక్షేత్రముల దర్శించి వానిని కథావస్తువులుగా స్వీకరించి దేశభక్తి ప్రబోధకరముగా రచించెడివారు.

రీతికాలమందలి ప్రముఖ ఆచార్య కవియైన కేశవదాసుని "రామచంద్రిక" లో రామ రావణ యుద్ధము, రాముని సేనతో లవకుశుల యుద్ధ వర్ణన మిగుల భావోత్తేజ జనకముగ వీరరసోదీప్తి కలిగించునట్లుండును. రీతికాలపు కవులైన గోరే, లాల్, సూదన్ ల కావ్యములలోని నాయకులు ఆర్తత్రాణపరాయణులుగా, దుష్టశిక్షణ, శిష్టరక్షణ ధ్యేయముగా కలవారుగా, హిందూ మతోద్ధారకులుగా చిత్రింపబడిరి. వీరందరిలో ముఖ్యుడు భూషణ్. ఈయన హిందీ సాహిత్యపు హోమర్ కవి, ఆయన రచనలు— "శివాబావనీ," "శివరాజభూషణ్" "ఛత్రసాలదశక్" మున్నగు వానిలో హిందీ సాహిత్యపు జాతీయత, దేశభక్తి దృగ్గోచర మగును. ఛత్రపతి శివాజీ మహరాజ్ వీరశౌర్య ప్రతాపములను, ఆయన దేశభక్తిని, ధార్మిక సాంస్కృతిక రక్షణకు శివాజీ యొనర్చిన సేవలను భూషణ్ మిగుల ప్రశంసిస్తాడు. ఒక విధముగ 'భూషణ్'జాతీయకవి యనిన అతిశయోక్తిగాదు. తన రచనలో వీరరసమును మిగుల పోషించి జాతీయ భావములు ప్రజల మదిలో చొచ్చుకొని పోవునట్లు ప్రబోధించిన భూషణ్ నిజముగ జాతీయకవులందరకీ శిరోభూషణము వంటివాడు.

కుమారి అచ్యుతుని రాజ్యశ్రీ

ఆధునిక కాలము శ్రీ భారతేందు హరిశ్చంద్రయుగముగా పిలువబడును. హిందీ సాహిత్యములో ఈ కాలము మిగుల విశిష్టమైనది. చైతన్య వంతమైనది. సాహిత్యములోని వివిధ శాఖలు బాగా విస్తరిల్లినవి. శ్రీ భారతేందు యుగపురుషులు. ఆంగ్లేయుల పాలనలో మ్రగ్గుచున్న భారతమాతనుగని ఆ కాలపు కవుల హృదయము మిగుల వగచినది. పరదాస్య పీడను తొలగించుట, శృంఖలా బద్ధయైయున్న భారతాంబను చెరనుండి విడిపించుట, సమాజములోని కుళ్లును, అవినీతిని, అంధవిశ్వాసముల తొలగించుట, భారత స్త్రీల దుర్భర దయనీయ స్థితిని పునరుద్ధరించుట, దేశప్రేమ, దేశభక్తి ప్రబోధించుట – వీరి ముఖ్యాశయములు. సాహిత్యములో ఒక గొప్ప ప్రయోజనాత్మక విప్లవయుగముగ దీనిని పేర్కొన వచ్చును. "వసుదైక కుటుంబమే" వారి ధ్యేయము. వారు ఆదర్శపూరితులైన సంస్కరణాభిలాషులు.

శ్రీ 'హరఔధ్' ని "ప్రియప్రవాస్" లో రాధాకృష్ణులు సమాజ సేవకులుగా చిత్రింపబడినారు.

ఆధునిక హిందీ కవులలో శ్రీ మైథిలీ శరణ్‌గుప్త ప్రముఖ జాతీయకవి, గాంధీ వాది. "భారత్ భారతీ" వారి అమర జాతీయకృతి.

వర్తమాన భారతదేశపు స్థితిగతులు వారి కవితలో చక్కగా చిత్రీకరింపబడినవి. సామాజిక అవసరములకు తగినట్లు సాహిత్య సృజన చేయగలిగిన ప్రతిభావంతులు. భారతీయ ఆధ్యాత్మికతత్వము, గాంధీగారి ప్రభావము వీరి రచనల్లో ద్యోతకమౌతాయి. మన ప్రాచీన సంస్కృతీ ప్రాభవముల నుగ్గడిస్తూ నేటి మన దుస్థితిని కనులకు కనుపింప జేయుచు భవిష్యత్తులో మన కర్తవ్యాన్ని ప్రబోధిస్తారు ఈ అమర కవి.

శ్రీ గుప్తజీ సోదరుడు శ్రీ సియారామ్‌శరణ్‌గారి కవిత "బాపూ" లో గాంధీవాదము, జాతీయత వెల్లివిరుస్తాయి. శ్రీ జయశంకర్ ప్రసాద్ రచనల్లో, నాటకములలో దేశప్రేమ, జనులలో జాగృతి ముఖ్య వస్తువులు. వారు ఇతిహాస గాథలను చక్కని నాటకములుగ తీర్చిదిద్దారు. "రాజశ్రీ", "చంద్రగుప్త", "స్కంద గుప్త" మొదలైనవి ప్రసిద్ధ దేశభక్తి పూరితమైన చారిత్రక నాటకములు.

ప్రగతి వాదులైన కవులు తమ రచనలలో రైతు, కూలీ, పీడిత శోషిత జనుల బాధామయ గాథలను కథావస్తువులుగా చిత్రించుచున్నారు. వీరి రచనల్లో మానవతా వాదము, సమత, సమానత్వము, సౌభ్రాతృత్వము, 'మానవులంతా సమానమే, ఒకటే' అనెడి ఘోష లిజపు భావనలు కానవస్తాయి. శ్రీ సుమిత్రానందన్ పంత్, శ్రీ దినకర్ ప్రముఖ సామ్యవాద కవులు. శ్రీమతి సుభద్రా కుమారీ చౌహాన్ కవితల్లో భారతీయ వీర నారీమణుల వీరశౌర్య త్యాగములు ద్యోతకమవుతాయి. "ఏక్ భారతీయ ఆత్మ" లో జాతీయ భావనల జాగృతి కన్పట్టుతుంది. సర్వశ్రీ చతుర్వేది శ్యామ్ నారాయణ్ పాండే మొదలగువారు ప్రసిద్ధ దేశభక్తి జాతీయ కవులు.

ఆధునిక హిందీ కవితలోనే జాతీయ భావములకు, దేశభక్తికి తగిన ప్రోత్సాహము, ప్రేరణ లభించెను. ఆదికాలమున తమతమ ప్రభువుల వీరశౌర్యముల పొగిడి, తద్వారా మిగతా సామాన్య జనులను ఉత్సాహపూరితుల గావించిరి. జాతీయ సమైక్యతను, దేశభక్తి, దేశప్రేమను, ఛత్రపతి శివాజీ వీరశౌర్య ప్రతాపముల నుగ్గడించి తద్వారా జనులలో ప్రభువుపై భక్తిగౌరవముల ఇనుమడించునట్లు గావించిన ప్రముఖ జాతీయ దేశభక్త కవిగా భూషణ్‌నే పేర్కొనవలెను. రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యమునే గడగడలాడించిన గాంధీమహాత్ముని ప్రబోధనలు, నాటి సాంఘిక పరిస్థితులు, బ్రిటిష్ దాస్యపీడనము, స్వాతంత్ర్య పిపాస, ఫ్రెంచి-రష్యన్ విప్లవములు భారతీయులలో దేశభక్తిని, జాతీయతను అంకురింపజేసినవి. ఆ భావములే వారి కవితలలో పెరిగి శాఖోపశాఖలై విస్తరిల్లినవి. శ్రీ భారతేందు హరిశ్చంద్ర నాటిన ఈ దేశభక్తి జాతీయతా భావ బీజములే శ్రీ మైథిలీ శరణ్ గుప్త కాలంలో పుష్పించి నేటి ఆధునిక కవుల కవితల్లో పరిమళించి ఫలించినవి. ఈ విధముగ ఆదికాలము నుండి ఆధునికకాలము వరకు హిందీ సాహిత్యములో వీరరసము, జాతీయ భావన, దేశభ మిగుల ప్రబోధ కరమై, ప్రభావంతమై, ఉత్తేజ ఉత్సాహ జనకమై యావత్తు భారతమును ఏకత్రాటిపై నడిపించి భిన్నత్వములో ఏకత్వమును దర్శింప జేసినది.



## సీతానగరం పంచాయతీ

( 29వ పేజీ తరువాయి )

ఈ మహిళామండలిలో కొంతమంది సభ్యురాండ్రకు చేతి పనుల్లో మంచి ఆసక్తి కలిగించటంలో కుమారి మనోరమ కృతకృత్యులయ్యారు. కుమారి మనోరమ ఈ మహిళామండలి ఆంధ్రప్రదేశ్‌లో ఉత్తమంగా పనిజేసినందుకు మూడవ ఉత్తమ బహుమతి అందుకొంది.

## బలవర్ధక ఆహార పథకం

బలవర్ధక ఆహారపథకం సీతానగరం గ్రామంలో విజయవంతంగా నిర్వహించబడిందని చెప్పవచ్చు.

30 మంది బాలబాలికలు, 15 మంది గర్భిణీస్త్రీలు, 15 మంది చంటిపిల్లల తల్లులకు ఉద్దేశింపబడిన పథకమే బలవర్ధక ఆహార పథకం అని అన్నారు కుమారి మనోరమ. ఈ గ్రామంలో 2 ఎకరాల 70 సెంట్ల భూమిలో పండిస్తున్న కూరగాయలతోపాటు, కోళ్ళకేంద్రంలో కోడిగ్రుడ్లుకూడా ఈ పథకంక్రిందకు వచ్చే సభ్యులకు యివ్వబడుతున్నాయి. 1967-68 సంవత్సరంలో 1300 కిలోగ్రాముల కూరగాయలు పంచిపెట్టబడ్డాయి.

ఈ గ్రామంలో ఒక బాలవాడీ కేంద్రం నిర్వహించబడుతున్నది. ఈ బాలవాడీలో 30 మంది బాలబాలికలు శిక్షణపొందుచున్నారు.

సీతానగరం గ్రామ ప్రజల ఆరోగ్యపు అలవాట్లు అత్యుత్తమమయినవి. ఈ గ్రామ ప్రజలు బావులలోని నీటనే త్రాగుతారు. ఈ చిన్న గ్రామంలో 30 మంది కుటుంబ నియంత్రణ శస్త్రచికిత్సలు చేయించుకున్నారు.

## శ్రమదానం

సీతానగరం గ్రామప్రజలు శ్రమదానం చేయటంలో యావద్భారతానికే మార్గదర్శకు లయ్యారు. గ్రామ ప్రజలు రోడ్లు నిర్మాణ కార్యక్రమంలో పాల్గొన్నారు. ఎకరానికి ఐదు రూపాయలు చొప్పున విరాళాలు యిచ్చారు. విరాళాలు యివ్వలేని వారు స్వంత ఎడ్లబళ్ళను ఉపయోగించి, మట్టిని చేరవేశారు. సీతానగరంనుంచి నాయకంపల్లి వరకు ఉన్న రోడ్డును ప్రభుత సహాయంగాని, సమితి సహాయంగాని లేకుండా నిర్మించుకున్నారు. ఆ రోడ్డు పొడవు ఒక మైలూ ఆరు ఫర్లాంగులు. ఈ పనివిలువ 20 వేల రూపాయలు ఉంటుందని అంచనా. ప్రజావిరాళాలు లేని కార్యక్రమం ఈ గ్రామంలో నిర్వహింపబడలేదు.



# మహాభారతము

తెన్నెటి గంగలుల లక్ష్మణశాస్త్రి

## 67

ఈ విధముగా శకుని చెప్పిన మాటలువిని దుర్యోధనుడు తన పాదములపైన బడిన దుశ్శాసనుని తనచేతులతో పైకి ఎత్తి కౌగలించుకొని అతని శిరము మూర్కొనెను. ఇతర మిత్రులు గూడ నట్లే బోధించిరి.

ఆ మాటలన్నియు విని దుర్యోధనుడు మిగుల శోకార్తుడై యిట్లనెను. "నాకు ధనము, ఐశ్వర్యము, సుఖము. ధర్మము, రాజ్య భోగములు ఇవియేవియు అక్కరలేదు. మీరు నా నిశ్చయమునుండి నన్ను మరలింపకుడు, వెడలిపొండు. ప్రాయోపవేశమునందే నిశ్చల ముగా నా బుద్ధియున్నది. మీరందరు హస్తినాపురమునకు పోయి గురుజనులను సేవించుచుండుడు."

ఆ మాటలు విని వారందరు దుర్యోధనునితో "రాజా నీకు ఏగతియో మాకును అదియేగతియగును, నిన్ను వీడి మేము పట్టణ మునందెట్లు ప్రవేశింపగలము" అనిచెప్పిరి.

జనమేజయమహారాజా! మిత్రులు, మంత్రులు, సోదరులు ఇతర బంధుజనులు ఎన్నివిధముల చెప్పినను దుర్యోధనుడు వారి మాటలు లెక్కచేయలేదు. ప్రాయోపవేశమునుండి చలించలేదు. అని వైశంపాయనముని చెప్పి తర్వాత వృత్తాంత మిట్లు చెప్పు చుండెను:— "ప్రాయోపవేశ నిశ్చయముతో దుర్యోధనుడు దర్భలు పరచుకొని, ఆచమనముచేసి, శుచియై భూమిపైన పరపబడిన దర్భస్తరణము పైన వల్కలను ధరించి నిష్ఠానియమములతో, మౌనము వహించి ప్రాణత్యాగమునకు పూనుకొని కూర్చొనెను. అప్పుడతడు స్నానపానాది బాహ్యక్రియలన్నియు త్యజించెను.

అతని ప్రాయోపవేశ నిశ్చయమును పాతాళవాసులైన దైత్యులు దానవులు, చూచిరి. వారు మహావేదకారులు, పూర్వము దేవతల చేత ఓడింపబడినవారు. 'దుర్యోధనుడు వ్యర్థముగా నశించినచో తమ పక్షము క్షీణించి పోవును.' అని వారు దుర్యోధనుని తమ లోకమునకు ఆహ్వానింప దలచి. మంత్ర విద్యలో నిపుణులైన దైత్యదానవులు, బృహస్పతి-శుక్రాచార్యుల చేత వర్ణింపబడినట్టి దియు, అధర్వవేదమునందు ప్రతిపాదింపబడిన విజయమగు మంత్రములద్వార విస్తృతమైన అగ్నిచే సాధింపదగిన యజ్ఞకర్మను చేయుటకు ఆరంభించిరి. ఇట్లు అగ్నియందు పాలను మంత్రపూర్వకముగా హోమము చేయగా, యజ్ఞాంతరము నందు యజ్ఞకుండమునుండి 'కృత్య' (మాయారూపధారిణియగు నొక దేవత) పుట్టి పైకివచ్చి 'నాకేమియాజ్ఞ' అని అడిగెను. అప్పుడు రాక్షసులామెతో "ప్రాయోపవిష్టుడై భూలోకమునందు కూర్చొని యున్న దుర్యోధనుని ఇక్కడికి తేవలయును" అని చెప్పిరి. 'అలాగే! యని చెప్పి కృత్య ఒక క్షణములో దుర్యోధనుని అక్కడకు తెచ్చి యుంచెను. అతనిని చూచి రాక్షసులు సంతుష్టులై అందరు మంత నములు సలిపి, దుర్యోధనునితో నీ విధముగా చెప్పిరి:—

"రాజా! నీవు భరతకుల భూషణుడవు, అనేక శూరులు, మహాత్ములు నిన్నెపుడును గొలుచుచుందురు. అట్టి నీవు ఈ ప్రాణత్యాగమనెడి చెడ్డ పనికి ఏల పూనుకొంటివి. ఆత్మహత్య చేసికొనువాడు అధోగతి చెందును, లోకనిందకు పాల్పడును. దానివలన నీకు అపకీర్తి కలుగును. ఆత్మహత్య ఎప్పుడుగూడ తన అభీష్టమును సిద్ధింప జేయదు. అది అతి పాపకార్యము. అది సమూలముగా వ్యక్తిని నశింపజేయును. ఇటువంటి ఆత్మహత్యను నీవంటి బుద్ధిమంతులు చేయరు. ధర్మార్థ సుఖనాశకరమైన యీ బుద్ధిని నీవు విడువుము, దీనివలన నీయశస్సు, ప్రతాపము, వీర్యము, నశించిపోవును. నీ శత్రువులు హర్షించెదరు. రాజా! నీ రూపము దివ్యము. నీ శరీర నిర్మాణము గూడ అద్భుతమైనది, ఈ రహస్యమును నీకు మేము తెలిపెదము. అది విని ధైర్యముతో నుండుము." అని యిట్లు చెప్పదొడగిరి:—

## దుర్యోధనుని జన్మ వృత్తాంతము

"రాజా! పూర్వము మేము తపస్సుచేత భగవంతుడైన శంకరుని ఆరాధించి నిన్ను పొందినాము. నీ శరీరము నందు నాభినుండి పైనున్న ఊర్ధ్వ భాగము వజ్రములచేత నిర్మింపబడినది, కనుక ఆ నీ అర్ధ శరీరము ఎటువంటి అస్త్ర శస్త్రములచేత కూడ భేదింపబడదు. ఆ విధముగానే నాభినుండి క్రిందనున్న నీ అర్ధ శరీర భాగము పార్వతీదేవి పుష్పమయముగా నిర్మించెను. ఆ భాగము మిక్కిలి సుందరమై స్త్రీలకు మనోహరముగా నుండును. రాజా! ఇట్లు నీ శరీరమును పార్వతీ పరమేశ్వరులు నిర్మించినారు. కనుక నీవు మానవుడవు కావు. దివ్యపురుషుడవు, భగవంతుడు మొదలైన పరాక్రమశాలురు దివ్యాస్త్రములతో నీకు బాసటగా నుండి నీ శత్రువులను సంహరించగలరు. కనుక నీకు భయము లేదు. దుఃఖించకుము. నీకు సహాయార్థమై ఇదివరకే భూలోకములో అనేక రాక్షసులు వెలసి యున్నారు. రాక్షసులు కొందరు భీష్మ ద్రోణ కృపాచార్యుల శరీరములో ప్రవేశించి ఉండగలరు. రాక్షసత్వముచేత ఆవిష్టులై భీష్మాదులు దయా గుణమును విడిచి నీ శత్రువులతో యుద్ధముచేయగలరు. రాజా! భీష్మ ద్రోణాదుల శరీరములలో రాక్షసుల అధికారమే సాగుచుండును: రాక్షసత్వముతో వారు యుద్ధములో స్నేహము విడిచి కొడుకులను, సోదరులను, పితృ జనమును బంధువులను, శిష్యులను తమ కుటుంబము వారిని బాలకులను వృద్ధులను అందరిని విడువకుండా చంపుచుందురు. వారు అప్పుడు అజ్ఞాన మోహితులై ఉండెదరు. మనస్సునందు మాలిన్యము ఏర్పడును. మైత్రిని వీడి సంతోషముగా శత్రువులను సంహరించుచుందురు, ఇది, దైవ నిర్మితము. మహాత్ములైన పంచ పాండవులు భీష్మ ద్రోణాదులతో పోరాడి వారిని సంహరించెదరు. రాక్షసులు క్షత్రియుల గర్భములలో పుట్టి యున్నారు. వారు నీ శత్రువులను చంపెదరు. అర్జునుని వలన భయము నీ మనస్సులో ఉన్నది. దానిని విడువుము. మేము ఇదివరకే అర్జునుని వధోపాయము యోచించినాము. పూర్వము శ్రీకృష్ణుని చేతిలో చచ్చిన నరకాసురుని ఆత్మ కర్ణుని శరీరములో దూరినది. కనుక నరకావిష్టుడైన కర్ణుడు కృష్ణార్జునులతో పోరాడగలడు. మహా పరాక్రమ వంతుడైన కర్ణుడు అర్జునునిపై విజయమును సాధించు విషయము విని ఇంద్రుడు కర్ణుని కవచ కుండలములను అపహరించ గలడు. అందువలన ఈ కార్యముకొరకు ఒక లక్ష రాక్షసులను మేము సంసిద్ధ పరచినాము. వారు సంశప్తకులు అనుపేరుతో నున్నారు. వారు అర్జునుని చంపగలరు. కనుక నీవు దుఃఖింపకుము రాజా ! నీవు ఈ సమస్త భూమండల రాజ్యములను ఏలవలెను. దుఃఖించుట నీకు మంచిది కాదు. నీవు నశించినచో మా పక్షమే నశించును. నీవు పొమ్ము. దేవతలు పాండవుల పక్షమున నున్నారు. మేము నీపక్షమున నున్నాము" అని రాక్షసులు దుర్యోధనునితో చెప్పి కౌగలించుకొని అతనిని పుత్రునివలె ఊరడించి, అతని బుద్ధిని స్థిరపరచి, "నీకు జయమగుగాక" అని చెప్పిరి. వైశంపాయనుడు జనమేజయునితో తరువాత ఇట్లు చెప్ప దొడగెను.

"రాక్షసులనుండి సెలవుతీసికొనిన దుర్యోధనుని "కృత్య" తిరిగి అతని పూర్వ స్థానమునకు చేర్చి అదృశ్య అయ్యెను. తరువాత అతడు జరిగిన వృత్తాంత మంతయు స్వప్నములో జరిగినట్లుగా అనుభూతిని పొందెను. రాక్షసుల ఉపదేశముచే దుర్బుద్ధి గలవాడై 'పాండవులను నేను జయించగలను' అని నిశ్చయించుకొనెను. సంశప్తకులు కర్ణుడు శత్రు సంహారము తప్పక చేయగలరని తలచెను. నరకాసురుని చేత ఆవిష్టుడైన కర్ణుడు గూడ తాను అర్జునుని చంపగలనని తలచెను. ఆ విధముగానే భీష్మ ద్రోణులు గూడ రాక్షసావిష్టులై తలచిరి. ఈ రహస్యమును దుర్యోధనుడు ఎవరికిని చెప్పలేదు."

మరునాటి ఉదయమునందు కర్ణుడు దుర్యోధనుని కడకు వచ్చి ఇట్లనెను.

"కురునందనా ! చచ్చినవాడు ఎప్పుడుకూడ శత్రువులపై జయమును సాధించలేడు. జీవించినవాడే యెప్పుడైనను సుఖమును పొందగలడు. చచ్చినవానికి ఈ రెండును దూరమగును. ఇది నీకు దుఃఖించుటకు భయముచెందుటకు, చచ్చుటకు సమయము కాదు" ఇట్లుచెప్పి కర్ణుడు దుర్యోధనుని దగ్గరకు తీసికొని ఆలింగనము చేసికొని ఇట్లనెను "రాజా ! లెమ్ము. ఎందుకు నిద్రించు చున్నావు. నీకు శోకమెందుకు? శౌర్యము చేత శత్రువులను తపింప చేసిన నీవు ఇప్పుడు ఎందుకు చావ గోరుచున్నావు ? అర్జునుని నేను తప్పక వధించెదను. పదమూడవ యేడు దాటగనే పాండవులను నీకు వశపరచెదను." కర్ణుడు చెప్పిన ఈ మాటలు విని ధుర్యోధనుడు లేచెను. రాక్షసుల మాటలు తలుచుకొనుచు మరల సైన్యమును చేకూర్చుకొని మేఘములు లేని ఆకాశము నందలి శరచ్చంద్రికవలె ప్రకాశించెను. సపరివారుడై హస్తినాపురమునందు సంతోషముతో ప్రవేశించెను.

## కర్ణ దుర్యోధనులకు భీష్ముని మందలింపు

ధుర్యోధనుడు పాండవులచేత గంధర్వులనుండి విడిపింపబడి హస్తినాపురమును చేరిన తరువాత భీష్ముడు దుర్యోధనునితో నిట్లనెను :—

"నాయనా ! నీవు ద్వైత వనమునకు పోవునపుడే పోవలదని చెప్పితిని. అక్కడికిపోయి నీవు చేసిన పనికూడ మంచిదిగలేదు. శత్రువులు బలాత్కారముగా నిన్నుబంధించిరి. ధర్మాత్ములైన పాండవులునిన్ను ఆ సంకటము నుండి విడిపించిరి. ఇంతైనను నీవు సిగ్గుపడుట లేదా ? నీవు చూచుచుండగనే కర్ణుడు గంధర్వులకు భయపడి యుద్ధభూమి నుండి పారిపోయెను కదా ! నీవు సేనతోపాటు మొరపెట్టుకొనుచుండగా పాండవులు తమ బలపరాక్రమములను చూపించుట నీవు ప్రత్యక్షముగా చూచియే యున్నావు. కర్ణుని దురవస్థను గూడ అప్పుడు నీవు చూచినావు కదా ! ధనుర్విద్యయందుగాని, శౌర్యమునందుగాని, ధర్మాచరణమునందుగాని కర్ణుడు పాండవులకు పావు భాగము కూడ చాలడు. కాబట్టి నేను కురు వంశపు అభ్యు

దయము కొరకై పాండవులతో సంధి చేసికొనుట తగునని తలచు చున్నాను"

ఆ మాటలు విని దుర్యోధనుడు నవ్వి శకునితో పాటు అచ్చటి నుండి వెడలిపోయెను. అతనిని కర్ణ దుశ్శాసనులు అనుసరించి పోయిరి. అట్లు వెడలిపోయిన వారిని చూచి భీష్ముడు మూర్ఖులకు బోధించుట తప్పు అని సిగ్గుపడి తన నివాసస్థానమునకు వెడలి పోయెను. ఆ తరువాత దుర్యోధనుడు తిరిగి ఆ చోటికివచ్చి మంత్రులతో రహస్యాలోచన చేసెను. "మన కిప్పుడు చేయదగిన మంచి పని యేది? ఏ కార్యము మిగిలియున్నది. మనము ఏ విధముగా పని చేసినచో మంచి ఫలము కల్గును? మనకు హితమేది? నేడు ఈ విషయములను గూర్చియే రహస్యముగా విచారింపవలసి యున్నది." అని మంత్రులతో అనెను. అప్పుడు కర్ణుడు ఇట్లు చెప్పెను :—

## కర్ణుని దుర్బోధ

"రాజా భీష్ముడు సర్వదా పాండవులను పొగడుచు మనను నిందించుచుండును. నీయందు ఆయనకుగల ద్వేషముచేతనే నన్ను గూడ ద్వేషించుచుండును. నీయెదుట భీష్ముడు నన్ను నిందించుట నేనెప్పుడు గూడ ఓర్వజాలను. పాండవులను ప్రశంసించుచు నిన్ను నిందించుట గూడ నేను సహించను. కనుక నేను దిగ్విజయము చేసి వచ్చెదను. అనుజ్ఞ యిమ్ము. సముద్ర వన పర్వత సహితముగా సమస్త భూమండలమును జయించివచ్చెదను. భూమండలమంతటిని పాండవులు నలుగురుచేరి జయించినారు. చూడుము, నేనొక్కడనే జయించివచ్చెదను. అప్పుడు నా పరాక్రమమును కురుకులాధముడు, దుర్బుద్ధియునైన భీష్ముడుచూచుగాక. అనింద్యుని నిందించుచు. అప్రశస్తుని ప్రశంసించుచున్న భీష్ముడు ఇప్పుడు నాశక్తినిచూచి పశ్చాత్తాపముతో, తనను తాను గర్హించుకొనునుగాక. కనుక రాజా! నాకు దిగ్విజయమునకు ఆజ్ఞ యిమ్ము. తప్పక విజయము సాధించెదను అని నా శస్త్రమును ముట్టి శపథము చేయుచున్నాను" ఇటు కర్ణుని మాటలు విని దుర్యోధనుడు సంతసించి యిట్లనెను :—

"వీర శ్రేష్ఠా! నేను ధన్యుడను. నీ యనుగ్రహమునకు పాత్రుడనైతిని. నీవంటి శక్తి సంపన్నులైన మిత్రులు సర్వదా నాకు హితమును చేయదలచుచుండుట నా భాగ్యము. నేడు నా జన్మము సార్థకమైనది. దిగ్విజయము చేయగలగుదువను విశ్వాసము ధైర్యము నీకు ఉండినచో సర్వశత్రునాశనము చేయగలుగుదువేని తప్పక బయలుదేరుము. నీకు కావలసినది యిచ్చెదను చెప్పుము నీకు శుభమగుగాక". ఆ మాటలు విని కర్ణుడు దిగ్విజయయాత్రకు ఆవశ్యకమైన యేర్పాట్లు చేయుటకు ఆజ్ఞయిచ్చెను. మంగళ స్నానం చేసి బ్రాహ్మణాశీర్వాదముపొంది మంచి తిథి–వారము–నక్షత్రమునుగల సుముహూర్తమునందు జయధ్వనులు మిన్నుముట్టగా కర్ణుడు దిగ్విజయయాత్రకు బయలు వెడలెను.

## కర్ణుని దిగ్విజయము

కర్ణుడు బయలుదేరిపోయి ద్రుపదమహారాజు పట్టణమును ముట్టడించెను. ద్రుపదునితో గొప్ప యుద్ధముచేసి, అతనిని వశపరచుకొని అతని నుండి సువర్ణరత్నాదులను కప్పముగా తీసికొనెను. ద్రుపదునికి అనుయాయులైన రాజులనుగూడ ఓడించి కప్పములను తీసికొనెను. ఆ తరువాత ఉత్తరదిక్కులో నున్న రాజులను వశపరచుకొనెను. భగదత్తాదివీరులను జయించెను. హిమాలయప్రాంతములను గాలించి అందరిని వశపరచుకొనెను నేపాలదేశమునుగూడ జయించిన తరువాత హిమాలయము నుండి దిగి పూర్వదిగ్విజయమునకు వెడలెను. అచ్చట అంగ–వంగ–కళింగాది రాజులను జయించి అచటి నుండి వత్సదేశమునకు తరలెను. అచ్చట 'కేవల–మృత్తికావతి–మోహనము–త్రిపురి కోసలాది–ఇత్యాది నగరములను, దేశములను జయించెను. అచటినుండి దక్షిణదిక్కులో రుక్మిని జయించి అతని సహాయముతో పాండ్యాది రాజులను ఓడించెను. కేరళదేశమునందు నీలుడు మున్నగు రాజులను గెలిచి కప్పములను గొనెను. అచటి నుండి వెడలి చేది దేశమునందు శిశుపాలపుత్రుని. అతనికి బాసటగా వచ్చినవారినందరిని జయించెను. అవంతిరాజులను, వృష్ణివంశీయులను గెలిచి పశ్చిమదిక్కుగా వెడలెను. అచట యవన–బర్బరాదులను జయించెను. ఈ విధముగా కర్ణుడు సమస్త భూమండలమును తన వశము చేసికొని తిరిగి హస్తినాపురికి వచ్చెను. దుర్యోధనుడు చాల సంతోషించి సపరివారముగా నతని నెదుర్కొని సత్కరించెను. భీష్ముడు, ద్రోణుడు కృపాచార్యులు మొదలైన మహాయోధులు ఎవరుగూడ నాకింతటి సంతసమును కలిగించలేదని కర్ణుని పొగడెను. కర్ణా! నేడు నేను సనాథుడనైతిని. ఇంతదాక అనాథుడనై పడియుంటిని. పాండవులు నీ పదియారవ అంశమునకు గూడ సరిపోలజాలరు నీవు ఈ శుభవార్తను నా తలిదండ్రులకు ఇప్పుడే పోయి నివేదించుము. అదితి వద్దకు ఇంద్రునివలె నీవు మా తల్లివద్దకుపోయి ఆమెను ఆనందపరచుము. పట్టణములో సంతటను కలకలము బయలుదేరెను. కొందరు కర్ణుని అభినందించిరి. మరికొందరు నిందించిరి. జనమేజయ మహారాజా! ఈ విధముగా కర్ణుడు దేశములన్నియు కొద్దికాలముననే జయించి అనేక ధనములను తెచ్చెను. అంతఃపురములో గాంధారీధృతరాష్ట్రులకు పుత్రునివలె పాదవందనము చేసెను వారు ఇతనిని ఆలింగనము చేసికొని సంతసించిరి. అది మొదలు దుర్యోధనుడు, శకుని మొదలైనవారు కర్ణునిచేతిలో పాండవులు ఓడిపోవుట తథ్యమని నిశ్చయించుకొనిరి." అని వైశంపాయనుడు చెప్పి తరువాతికథ యిట్లు చెప్పదొడగెను,

## వైష్ణవయజ్ఞము

కర్ణుడు దిగ్విజయముజేసి సంపాదించిన దేశములన్నియు, ఇంద్రునివలె నేలుకొనుమని దుర్యోధనునకు చెప్పెను. అప్పుడు దుర్యోధను డిట్లనెను:—

"వీరోత్తమా! నీవు నా కొరకు ప్రేమతో సహాయము చేయుటకు ప్రయత్నించుచుండగా నాకు యీలోకములో దుర్లభమైన దేదియునుండబోదు. పాండవులు చేసిన రాజసూయయాగము చూచిన తరువాత ఆ యాగముజేయవలెనను తలంపు నాకుగూడ కలిగినది. దానిని నెరవేర్చుభారము నీపైన గలదు,"

అది విని కర్ణుడిట్లనెను. "రాజా! నీకిప్పుడు రాజులందరును వశులైయున్నారు కనుక బ్రాహ్మణులను పిలిచి ఆ యాగమునకు ఆవశ్యకములైన సామగ్రులను చేకూర్చుకొనుము. ఆ యజ్ఞము నీవు యథావిధిగా మహావైభవముతో జేయుము. నీకిప్పుడేలోప మును లేదు."

ఆ ప్రకారమే దుర్యోధనుడు పురోహితుని పిలిపించి యజ్ఞ కర్మకు తగిన యేర్పాట్లు చేయుమని యతనితో చెప్పెను. అది విని పురోహితుడిట్లనెను. "రాజా! యుధిష్ఠిరుడు బ్రతికియుండగా మీ వంశములో ఆక్రతువుచేయుటకు నీకు సాధ్యముకాదు. ఇంతేకాక నీ తండ్రి ధృతరాష్ట్రుడు దీర్ఘాయువై జీవించియున్నాడు. ఆకారణచే గూడ ఇప్పుడు నీకు రాజసూయము చేయుట తగదు. రాజసూయ మునకు తుల్యమైన మరియొక మహాయజ్ఞమున్నది. అది నీవుచేయుము. నీకిప్పుడు వశులైనరాజులందరును, సువర్ణ వస్తువులరూపములోను సువర్ణ రూపములోను కప్పము చెల్లించెదరు. ఆ బంగారముతో నొక నాగలి చేయించుము. ఆ నాగలితో యజ్ఞవాటికభూమిని దున్నించుము. ఏ విధమైన ఆడులేకుండ యజ్ఞము నీవు మహా వైభవముగా జేయుము. దానిపేరు 'వైష్ణవయజ్ఞము'. అది సత్పురుషులు చేయదగినది. ఈ యాగము పూర్వము విష్ణువుదప మరి యెవ్వరును జేయలేదు. రాజసూయముతో పోటీ చేయదగిన యజ్ఞమిది. ఇది నీవు తలపెట్టినచో నిర్విఘ్నముగా నెరవేరి నీకు మేలు చేకూర్చును. దీని చే నీ కోరిక నెరవేర గలదు"

పురోహితులు, ఇతర బ్రాహ్మణులు చెప్పిన మాటలు విని దుర్యోధనుడు కర్ణునితో, శకునితో, తమ్ములతోను, ఈవిషయము చెప్పి వారి యనుమతి తీసుకొనెను. శిల్పులను పిలిచి బంగారు నాగలి చేయుటకాజ్ఞ నిచ్చెను. యజ్ఞమునకు కావలసిన సంభారము లన్నియు యథావిధిగా సిద్ధము చేయుటకు ఆజ్ఞనిచ్చెను.

తరువాత నొక శుభముహూర్తమున యజ్ఞమును, బంగారు నాగలితో దున్నబడిన, భూమిలో చేయుటకు దుర్యోధను డారంభించెను. కురు వృద్ధులైన భీష్మ ద్రోణాదులు, విదురుడు సంతసించిరి. రాజులను, బంధువులను ఆహ్వానించుటకు శీఘ్రగాములైన దూతలు పోయిరి. దుశ్శాసనుడొక దూతను ద్వైత వనములోనున్న పాండవులను పిలుచుటకు పంపెను. ఆ దూత పోయి ధర్మరాజునకు నమస్కరించి, ధృతరాష్ట్రుని ఆహ్వానము తెలిపెను. దూత మాటలకు యుధిష్ఠిరుడు సంతోషించి, మేము 13 సంవత్సరములు వనవాసాదులను అనుభవించ వలసియున్నది గనుక నగరములో ప్రవేశించుటకు వీలులేదు సమయ పరిపాలనమే ముఖ్య ధర్మము, గదా యని చెప్పెను. అప్పుడు భీముడు దూతతో ఇట్లనెను.

"భద్రముఖా! నీవు నీ రాజు దుర్యోధనునితో చక్రవర్తియైన ధర్మరాజు పదమూడు సంవత్సరముల గడువు తీరిన తరువాత, అచటకు రాగలరు. ఈ యజ్ఞమునకు రారు." అప్పుడు జరుగు రణ యజ్ఞములో శస్త్రాస్త్రములచే ప్రజ్వలితమైన క్రోధాగ్నితో నిన్ను ఆహుతి నీయగలడు. నీ సోదరు లందరూ రణయజ్ఞములో ఆహుతి కాగా ఆ అగ్ని ఆరకుండ, ధర్మరాజు తన కోపమనెడు ఘృతమును పోయుచుండును, ఆ యజ్ఞమునకు మాత్రమే వచ్చెదననెను. తక్కిన తమ్ములూరకుండిరి దూత తిరిగి పోయి దుర్యోధనున కావృత్తాంతము తెలిపెను.

విష్ణుమహాయజ్ఞమునకు వివిధ దేశాధీశ్వరులు బ్రాహ్మణులు హస్తినాపురికి వచ్చిరి. దుర్యోధనుడు యథావిధిగా ఆదర సత్కారములు చేసెను. ధృతరాష్ట్రుడు విదురునితో 'అందరినీ యథా క్రమముగా యజ్ఞమున సత్కరించు'మని చెప్పెను. విదురుడు అలాగేచేసెను. ఆటుతరువాత దుర్యోధనుడు అతిధులను వీడ్కొలిపి, తమ సోదరులతో కర్ణ శకునులతో హస్తినాపురము ప్రవేశించెను.

పౌరులందరు అతనిని ప్రశంసించిరి. కొందరు ఈ యజ్ఞము ధర్మరాజు చేసిన రాజసూయముతో సమానము కాదని ఉన్మత్త ప్రలాపము చేసిరి. రాజభవనమునందు ప్రవేశించి దుర్యోధనుడు పెద్దలకు నమస్కరించి పిన్నల నమస్కారములందుకొని సుఖాసీనుడయి యుండగా కర్ణుడిట్లనెను, "రాజా! విష్ణు మహాయజ్ఞము మహా వైభవోపేతముగా జరిగెను. ఇకపైన పాండవులు చనిపోయిన తర్వాత నీవుగూడ రాజసూయము చేయవచ్చును. అప్పుడు నేనే స్వయముగా నీతో చేయించెదను." అనెను. అప్పుడు దుర్యోధనుడు తన అనుచరులతో 'ఎప్పుడు పాండవులను వధింపగలిగెదను? ఎప్పుడు రాజసూయము చేసెదను అని నేను చాల ఉబలాటపడుచున్నాను? అనెను. అప్పుడు కర్ణుడిట్లు ప్రతిజ్ఞ చేసెను — 'అర్జునుని సంహరించువరకు నేను ఇతరులచేత కాళ్ళు కడిగించుకొనను. నీటినుండి మాత్రమే పుట్టిన వస్తువేదియును తినను. 'ఆసుర వ్రతము' క్రూరత్వముతో కూడిన వ్రతమును ధరించను. ఎవరేది అడిగినను లేదనకుండ ఇచ్చెదను, అని ప్రతిజ్ఞ చేయగనే దుర్యోధనుడు తాను పాండవులను జయించినట్లుగానే నిశ్చయించుకొనెను. తరువాత అందరు తమతమ యిండ్లకు పోయిరి,

[ సశేషము ]

# కడసారి వాడు

రాజు గబగబా నడుస్తున్నాడు సిమెంటు రోడ్డుమీద. పన్నెండేళ్లయినా నిండాలేని రాజు బుగ్గల మీద కన్నీరు చిందుతోంది. మధ్యమధ్య చొక్కాతో తుడుచుకుంటున్నాడు. జారిపోతున్న చేతి సంచీని బుజమ్మీదికి లాక్కుంటున్నాడు. పొద్దుటి నుంచీ అన్నంలేని కడుపు లోపలికి పోయింది. కళ్లు చీకట్లు కమ్ముతున్నాయి. అడుగులు తడబడటం మొదలు పెట్టాయి. ఒకచోట ఆగి ఫుట్‌పాత్ మీద సంచీ ఒళ్లో పెట్టుకొని కూర్చున్నాడు.

ఆ ఉదయం జరిగిన సంఘటన జ్ఞాపకం వచ్చినప్పుడల్లా దుఃఖం పొంగుకుంటూ వస్తోంది. వెక్కిళ్లు కూడా వస్తున్నాయి.

స్నేహితులు బలవంతం చేస్తే గతరాత్రి వాళ్లతో కూడా సినిమాకు వెళ్లాడు. ఆఖరి తరగతి టిక్కెట్టు పదణాలు. ఆ పదణాలు మాత్రం తనకెక్కడివి? మురళి, శ్రీనివాస్, కాంతం, రమణ-అంతా తలా ఒక రూపాయి తెచ్చుకున్నారు. వాళ్ల లెఖ్ఖలో కూల్‌డ్రింక్సు కూడా ఉన్నాయి. వాళ్లు సినిమా ప్రోగ్రామ్ వేసినప్పుడు తనుకూడా వాళ్లతో సరదాగా సంతోషంగా వెళ్లాలనిపించింది. కాని డబ్బు ఎట్లా అన్న ప్రశ్నవచ్చినప్పుడు, తనదగ్గర లేదని వెళ్లకపోతే ఏం బాగుంటుంది? తనకెంతో చిన్నతనంగా ఉంటుంది. స్కూలుఫీజు కోసం తప్ప తనకొక్క చిన్నపైసా అయినా ఎవరూ ఇవ్వరు. ఎట్లా? సినిమా చూడాలనిపిస్తోంది. మార్గమేమిటి?

"రాత్రి ఎక్కడికి వెళ్లావురా?" అన్నయ్య కేక సింహ గర్జనలా వినిపించింది.

రాజుకు కాళ్లు గజగజ వణికాయి.

"నా ముందుకు వచ్చి జవాబు చెప్పు" ఇంటిపెంకులెగిరి పోయేటట్టు కేక పెట్టాడు.

"నా స్నేహితులు బలవంతంచేసి సినిమాకు తీసుకు వెళారు." అన్నాడు రాజు.

"నీకు డబ్బెక్కడిదిరా?"

రాజు కళ్లునలుచుకుంటూ నిలబడిపోయాడు.

"చెప్పు? డబ్బెక్కడిది? చెప్పవేం?" రాజు చెంప ఛెళ్లు మన్నది.

రాజు అమ్మా అంటూ కేకపెట్టి చెంప రుద్దుకోవడం మొదలుపెట్టాడు.

"నిన్న ఫీజు కట్టావా?" గర్జించాడు అన్నయ్య.

"లేదు" బెదిరిపోతూ జవాబిచ్చాడు.

"ఫీజు కట్టమని డబ్బిస్తే సినిమాలకు తగలేస్తున్నావా? నీ తిండి గుడ్డా కాకుండా సినిమాలకు కూడా ఎక్కడినుంచి తేను" రేపటినుంచి చదువు మానేసి ఎవరి ఇంట్లోనయినా నౌకరుగా కుదురు" ఎడాపెడా చెంపలు వాయించి అన్నయ్య అవతలికి వెళ్ళి పోయాడు.

నాన్న వాకిటి అరుగుమీద కూర్చుని చూస్తున్నాడు. అమ్మ వంటింటి గుమ్మంలో నిలబడి కొంగుతో కళ్లు ఒత్తుకుంటోంది.

రాజుకు రోషం ఉవ్వెత్తున పైకి లేచింది.

వెధవ పదణాలకోసం అన్నయ్య అట్లా మాట్లాడతాడా?

రాజు లేత హృదయంలో అనేక ఆలోచనలు తామర తంపరలా చుట్టుకుపోవటం మొదలు పెట్టాయి.

అన్నయ్యకు సినిమాలు చూడాలని ఉండదూ? చిన్నప్పుడు అన్నయ్యను స్నేహితులు సినిమాకు రమ్మని పిలవలేదూ? అమ్మ అప్పుడప్పుడు చెబుతూ ఉంటుంది, అన్నయ్య మొట్టమొదట పుట్టిన బిడ్డ అని తాతయ్యా బామ్మా అందరూ బాగా గారాబం చేసేవారట. వెండి గిన్నెలో అన్నం కలుపుకుని అన్నయ్యను ఎత్తుకుని దొడ్డి అంతా ఎత్తుకు తిప్పుతూ బామ్మ అన్నం పెట్టేదట. అన్నయ్య ఏది కావాలంటే అది అప్పటికప్పుడు ఇచ్చేవాడట తాతయ్య.

ఒకరోజు రాజు తల్లిని అడిగాడు. "అమ్మా, అన్నయ్యకు చిన్నప్పుడు చేతులకు మురుగులూ, మొలకు బంగారుతాడు, మెడలో

---

ఐ. సరస్వతీదేవి

---

పులిగోళ్ళ గొలుసూ ఉండేవన్నావు కదా! మరినాకు లేవా?"

"పిచ్చినాయనా" అంటూ తల్లి అతడితలను గుండెకానించుకుంది. "మొట్టమొదట పుట్టాడని అందరూ గారాబం చేశారు. తాతా బామ్మా చేయించార్రా వాడికి" అంది.

"అయితే తరువాత పుట్టినవాళ్ళను గారాబం చెయ్యరా?" కళ్ళల్లో నీటిపొర తేలియాడింది రాజుకు.

"ఆ గారాబం అంతా వాడితోనే చెల్లు."

"అయితే అక్కయ్యలనయినా గారాబం చెయ్యలేదా?" రోషంతో అడిగాడు రాజు.

"ఆ రోజులు వేరురా. నాన్న బాగా సంపాదించేవారు. వాళ్ళకేది కావాలంటే అది కొనిచ్చేవారు".

"అడిగినప్పుడల్లా డబ్బుకూడా ఇస్తూ ఉండేవారా?" రాజు మనసులో అనేక ఆలోచనలు సుడిగుండాలయిపోతున్నాయి.

"ఆ రోజుల్లో డబ్బు చేతినిండా ఉండేది. చేతిలో డబ్బు ఉంటే పిల్లలడిగితే ఇవ్వరూ?" అన్నది అతడి తలవెంట్రుకలు నిమురుతూ.

"అయితే నాకేనన్నమాట మీరు ఇవ్వనిది? అంతేనా అమ్మా?" కన్నీళ్ళు తుడుచుకుంటూ అన్నాడు.

"నా దురదృష్టంరా ఇదంతా." ఆమెకు కన్నీళ్ళు వచ్చాయి.

"పోనీ అమ్మా! చిన్నప్పుడు అన్నయ్యకు పెట్టినట్టుగా నా క్కూడా నగలు పెట్టారా? అవన్నీ ఏమయ్యాయి? అవయినా నాకివ్వ రాదూ?'' అన్నాడు ఆశతో.

"పిచ్చితండ్రీ. నీవు పుట్టేటప్పటికీ నలుగురక్కలకు పెళ్ళిళ్లుచేస్తే నీవరకూ నగలు వచ్చాయిట్రా?'' అన్నది భూమిలోకి చూస్తూ.

"అయితే అమ్మా. నా కొక్కడికే నీవు నగలు పెట్టలేదు. చిన్నప్పుడయినా నేనడిగితే ఒక్క పైసా అయినా ఇవ్వలేదు. నన్నెవరూ గారాబం చెయ్యలేదు కదూ?'' రాజుకు దుఃఖం ముంచుకు వచ్చింది. బావురుమని ఏడ్చేశాడు.

"నాయనా రాజూ'' అంటూ అతడిని కౌగలించుకుని తన చేతకాని తనానికి కుమిలి కుమిలి ఏడ్చింది కాంతమ్మ.

రాజు మనసులో మథన ప్రారంభమయింది. ఇంతగా తనను కౌగలించుకుని ఏడుస్తున్న తల్లికూడా చెయ్యిచాపి అడిగినప్పుడయినా ఒక అణా ఇవ్వలేదు. డబ్బివ్వకపోయిన తరువాత అది ప్రేమ అవుతుందా? గారాబం అవుతుందా? నాయనా నాయనా అంటూ నాన్న నోటితో అనటమేకాని ఒక్కనాడయినా గారాబం చేశారా? ఛీఛీ. వీళ్లెవరికీ నేనంటే యిష్టంలేదు. వీళ్ళదగ్గర ఎందుకు ఉండాలి? రాజుకు యింటిసంగతులు తలుచుకున్నకొద్దీ అసహ్యం కలగటం మొదలుపెట్టింది.

రాజు పుట్‌పాత్ మీదినుంచి మెల్లగాలేచి ఆ సమీపంలో ఉన్న పంపుదగ్గరికెళ్ళి ముఖం కడుక్కొని కడుపునిండా నీళ్ళు తాగాడు. ఎంతో సత్తువ వచ్చినట్లనిపించింది. లేచి నాలుగు బజార్లు తిరిగి ఒక హోటలు ముందు ఆగాడు. వచ్చేవారినీ పోయే వారినీ చూస్తూ నిలబడ్డాడు. కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ అందరూ లోపలికి వెళ్ళుతున్నారు.

మెల్లగా కౌంటరు దగ్గరగా జరిగాడు రాజు. "ఏం కావాలి?'' అన్నాడు మేనేజరు.

పెదవులు విప్పి మాట్లాడలంటే కన్నీళ్లు వస్తున్నాయి రాజుకు. బలవంతంగా దుఃఖాన్ని అణుచుకొని, "మీతో మాట్లాడాలి" అన్నాడు.

"నాతోనా?'' ఆశ్చర్యంగా అతనిని పైనుంచికిందికి అదోక మాదిరిగ చూశాడు మేనేజరు. రాజును చూడగానే అతడిని పలక రించాలనీ, ఆ పసిబుగ్గలు ఒకసారి నిమరాలనీ మనసు ఉరుకులు పెట్టింది.

''నాకు మీ దగ్గర పని చెయ్యాలని ఉంది. అన్నం పెడ తారా?'' ఆపుకోలేక బిగ్గరగా ఏడ్చాడు.

మేనేజరు సహజంగా కఠినుడు. ఎవరిదగ్గర్నించీ పని తీసుకోనిది ఏమీ ఇవ్వడు. కాని రాజును చూడగానే అతడి మనస్సు అదొకవిధంగా మారటం మొదలు పెట్టింది. పైకి మాట కఠినంగా ఉన్నా మనసు మైనం-రవంత వేడికి కరిగిపోతోంది.

''కప్పులు పళ్లేలు కడుగుతావా? పగలగొడితే నీ వీపు చిట్లుతుంది జాగ్రత్త'' అన్నాడు గంభీరంగా.

"సరేనండి. జాగ్రత్తగా ఉంటానండీ" రాజు ఎర్రబడ్డ కళ్లతో మేనేజరు వంకే చూస్తున్నాడు.

"రేపు చూద్దాంలే" తన పనిలో మునిగిపోయాడు మేనేజరు.

రాజు యింకా అలాగే నిలబడ్డాడు తలవంచుకుని.

"చెప్పానుగా రేపు చూద్దామని?" కొంచెం కఠినంగా అన్నాడు మేనేజరు చీటీలు లెక్కచూసుకుంటూ.

"కాదండీ ఆకలి మండిపోతోంది. ఇప్పుడే ఏదన్నా పని చెప్పి నాకు తినటానికి ఇంత పెట్టండి" చేత్తో కళ్ళు రుద్దుకున్నాడు రాజు.

ఓహో అన్నట్టు చూసి తమ్ముడిని పిలిచి రాజును లోపలకు తీసుకువెళ్ళమన్నాడు. రాజు బల్లముందు కూర్చుని సందేహిస్తూ సందేహిస్తూ కడుపునిండా తిని నౌకర్లు పడుకునే వరండాలో పడు కున్నాడు. తిరిగితిరిగిఉన్న రాజుదేహం అలిసిపోయింది. ఏడ్చి ఏడ్చి ఉన్న రాజు కళ్ళు మూతలు పడ్డాయి.

* * * *

రాజు తల్లి కాంతమ్మ ఆదుర్దాతో ఇంట్లోకి వాకిట్లోకి తిరుగు తున్నది. ఆమెకు ఆరోజు అన్నం తినబుద్ధికాలేదు. పెద్దకొడుకు రాజును చెంపమీదకొట్టినప్పుడే ఆమె గుండెమీద సుత్తిదెబ్బలు పడి నట్లుగా బాధతో మెలికలు తిరిగిపోయింది. కళ్ళనుంచి పటపట కన్నీళ్ళు కారాయి. ఆమెకు హృదయము ఉన్నది. కాని నోరు లేదు. తన కడుపులో ఉన్న బాధను వ్యక్తం చెయ్యటానికి భయం, బాధ కొద్దీ కుమిలిపోతున్నది.

వెంకట్రామయ్య పైకి ఎంతగంభీరంగా కనబడ్డా పితృ హృదయం రాజుకోసం అలమటించిపోవటం మొదలు పెట్టింది. రాజును పెద్దకొడుకు దండిస్తున్నప్పుడు చూడలేక వాకిట్లోకి వెళ్లి ముఖం పక్కకు తిప్పుకున్నాడు. ఆయన నోరుతెరచి ఏదన్నా అంటే పెద్దకొడుకు సహించడు. "ఇంత మందిని భరిస్తున్నది చాలక పైగా మాటలుకూడానా?" అని అంటాడని భయం. నిజానికి అతడు వెళ్ళిపొమ్మంటే ఎక్కడికి వెళ్ళగలడు. తావేది? ఆడపిల్లలు వాళ్ళ కాపరాలు వాళ్లు చేసుకుంటున్నారు. కాని ఇంతమందిని భరించ లేరు. కష్టం సుఖం మనసార చెప్పుకుందామంటే కాంతమ్మ ముందే బెంబేలుపడిపోయింది. ఆయన తన బాధలు ఎవరితోనూ చెప్పుకో లేక కడుపులో ఉంచుకోలేక వాకిటి అరుగుమీద దిగాలుపడి కూర్చుని పోయాడు.

మధ్యాహ్నం పన్నెండు గంటలు దాటింది. రెండు - మూడు - నాలుగు గంటలు అవిరామంగా గడియారంముళ్లు తిరుగుతున్నాయి.

సాయంత్రమయింది.

రాజు జాడ లేదు.

ఏడుగ టలనేళ పెద్దకొడుకు వచ్చాడు.

"ఏం? ఇలా అరుగుమీద కూర్చున్నావు ఎన్నడు లేనిది?" అన్నాడు తండ్రిని చూస్తూ.

తండ్రి మాట్లాడకపోవటం చూసి "ఎవరికయినా పెడితే బాగానే ఉంటుంది. ఒక్కమాటంటే చెప్పు. పొద్దున రాజును బెదిరించినందుకే ఇంట్లో అమ్మా వాకిట్లో నీవు సత్యాగ్రహం చేస్తున్నారు. లోకం ఇట్లాగే ఉంటుంది" విసురుగా లోపలికి వెళ్లాడు.

ఆ రాత్రికీ—మరునాడూ కూడా రాజు జాడలేదు.

వెంకట్రామయ్య కాళ్లీడ్చుకుంటూ దినపత్రిక కార్యాలయానికి వెళ్లి ఒక ప్రకటన చేశాడు.

"నాయనా రాజా, కోప పచ్చి ఇంట్లోనుంచి వెళ్ళిపోయావా? నీవు వెళ్ళినప్పటినుంచి మాకు అన్నం నీళ్లులేవు. రాజా! నీవు మా కళ్ళ వెలుగువి. నిన్ను చూడకపోతే మా ప్రాణాలు నిలిచే టట్టు లేదు. ఇంటికి రా బాబూ. కన్నీళ్ళు కారుస్తూ వాకిట్లో నిలబడి నీ కోసం ఎదురు చూస్తున్నాం."

నిన్నుకన్న తల్లిదండ్రులు
వెంకట్రామయ్య,
కాంతమ్మ.

రాజు ఫొటోతోకూడా ప్రకటన మేనేజరు చూశాడు. ఫొటోలో బాగా చూసి రాజును పిలిచి "ఇలాంటిదేదో ఉందని అనుమానపడుతూనే ఉన్నా. వెళ్ళు, తల్లిదండ్రులకు చెప్ప కుండా వచ్చావా? పాపం, బాధపడుతున్నారు" అన్నాడు.

ప్రకటన చూసి పత్రికను మడతచేసి మేనేజరు చేతికి ఇచ్చే శాడు రాజు.

"చూసి కూడా అలా నిలబడి పోయావే? వెళ్ళు. చేసి నంతవరకు డబ్బిస్తాగా" అన్నాడు.

రాజు మాట్లాడకుండా నిలబడిపోయాడు.

"నీకిష్టం లేదా ఇంటికి వెళ్ళటం? పోన్లే. తరువాత ఆలో చిద్దాం. వెళ్ళి పనిచూసుకో"

రాజు మాట్లాడకుండా లోపలికివెళ్ళి కాఫీ టిఫిన్లు వచ్చిన వాళ్ళకు అందిస్తూ ఆలోచించుకుంటున్నాడు. ఇంటికి వెళ్ళాలని మనసులో ఉంది. వెళ్ళి తల్లి గుండెలో తలదాచుకోవాలని తప నగా ఉంది. కాని—అన్న యింటికి వెళ్ళాలంటే ఒక విధమయిన విరక్తి ఆ పని హృదయంలో చోటు చేసుకుని వెనక్కు లాగటం మొదలు పెట్టింది. ఇంటికి వెళ్ళటానికి బుద్ధి మొరాయించింది.

కాఫీ టిఫిన్ తెచ్చి బల్లమీదపెట్టి తలఎత్తి చూశాడు. మేనే జరు తనవంకే చూస్తున్నాడు.

"రాజూ. ఇట్రా" చేతో దగ్గరికి రమ్మని సైగచేశాడు.

ఎందుకు పిలిచారు అని అడిగినట్టుగా రాజు వెళ్ళి నిలబడ్డాడు.

"ఇంటికి వెళ్ళవూ? మీ నాన్నా అమ్మా దిగులుపడి ఉంటారు. వెళ్ళు. కావాలంటే మళ్ళీ రావచ్చు" అతడి కళ్ళ లోకి చూస్తూ అన్నాడు.

"వద్దు లెండి. నాకిదే బాగుంది" అక్కడే నిలబడ్డాడు.

"సరేలే. వెళ్ళి పనిచూసుకో. ఇంటికి వెళ్ళటం సంగతి బాగా ఆలోచించుకోమని చెప్పానుగా?" అన్నాడు.

"అది కాదండి. నాకు చదువుకోవాలని ఉందండి" తడ బడుతూ అన్నాడు రాజు.

"అయితే పని ఎలా చేస్తావు?" అర్థం కానట్టు చూశాడు.

"పగల తా పని చేస్తానండి. నైట్ స్కూల్లో చదువు కుంటాను. ఫీజు పుస్తకాలు......" నసిగాడు రాజు.

"అంతగా చదువుకోవాలనుకుంటే ఏర్పాటు చేస్తాలే. ఫీజు సంగతేగా—చూద్దాంలే". ఒక బీద విద్యార్థికి విద్యాదానం చేసినట్టవు తుందన్నట్టుగా తల ఆడించాడు మేనేజరు.

మరునాడు రాజు అరమైలు దూరంలోఉన్న నైట్ స్కూల్లో చేరటానికి వెళ్ళి చూసివచ్చాడు. అంతకుముందు చదువుకుంటున్న స్కూలు నుంచి టి. సి. తీసుకువెళ్ళాడు. కొత్త స్కూలు—కొత్త స్నేహితులు—కొత్త వాతావరణం. పాత సంగతులు మనసులో నుంచి తరిమి వేయాలని ప్రయత్నాలు చెయ్యటం మొదలు పెట్టాడు.

ప్రకటనకు జవాబు లేకపోవటంచేత రాజు తండ్రి మరొక ప్రకటన చేయించాడు పత్రికలో.

"నాయనా రాజూ. ఇంటికి రావూ? ఇంట్లో ఉండటం ఇష్టం లేక పోతే ఒక్కసారి వచ్చి కనబడి వెళ్లు. అమ్మ మంచం పట్టింది. కడసారిగా ఈ ముసలివాళ్లకు ఒక్కసారి కనుపించు. మమ్మల్ని శిక్షించకు బాబూ. ఒక్కసారి కంటికి కనుపించు"

నీ కోసం రాత్రి బగళ్లు
అలమటించే తల్లి దండ్రులు.

ప్రకటన చేశాడు గాని వెంకట్రామయ్యకు ఆశలేదు. రాజు అభి మానం కొద్దీ ఆత్మహత్య చేసుకున్నదేమో? తను తండ్రి అయిఉండీ ఏమీచెయ్యలేక పోయాడు. నలభయి రూపాయల పెన్షనుతో కడసారి వాడిని తీసుకుని భార్యతో వచ్చి పెద్దకొడుకు దగ్గర ఉంటున్నాడు. కూతుళ్ల పెళ్లిళ్లకు ఉన్న నాలుగెకరాలు అమ్మాడు. పెద్దకొడుకు జబ్బుపడితే ఊళ్లో ఉన్న చిన్నపెంకుటింటిని వెయ్యిరూపాయలకు తాకట్టు పెట్టి నాలుగేళ్లయింది. వడ్డీ అయినా చెల్లించలేదు. కొడుకును అడగటానికి నోరురాక మౌనం వహించాడు. రెండోకొడుకు మెట్రిక్ప్యాసు కావటంతో మిలిట్రీలో చేరిపోయాడు. అతడు పంపే పాతికరూపాయలు తనపెన్షను రాగానే కొడుకు తీసుకుంటాడు. తన చేతిలో పదిరూపాయలు ఉంచుకోవాలని ఎప్పుడూ అనుకోలేదు.

ఆయన అనుకోకముందే కొడుకు "నాన్నా అన్నిటికీ ధరలు మండి పోతున్నాయి. ఇంటి ఖర్చును తట్టుకోలేకుండా ఉన్నాను" అంటూ ఓమాట విసురుతాడు. పోనీ ఏ కూతురు దగ్గరికయినా వెళామా అనుకుంటే ముగ్గురిని ఏ కూతురు భరించగలుగుతుంది? ఏ అల్లుడు ఆమోదిస్తాడు?

ఆలోచించినకొద్దీ నీరసం వచ్చేస్తోంది. కాంతమ్మ ముఖం చూడలేకుండా ఉన్నాడు. వారం రోజులకే ఎంతో బరువు తీసి నట్లయిపోయాడు. వంటయింట్లో కొంగుపరచుకొని కన్నీళ్ళు కారుస్తున్న కాంతమ్మను చూస్తున్నకొద్దీ మతిపోతుంది.

రాజు రెండవ ప్రకటన చూసిన తరువాత కొద్దిగా చలిం చాడు. తల్లిదండ్రులను తలుచుకుని వెక్కి వెక్కి ఏడ్చాడు. మరు నాడు మేనేజరు రాజును పిలిచి నిన్ననే ఒక కార్డు మీనాన్నగారి ఎడ్రసుకురాశాను. మీనాన్నగారినీ అమ్మగారినీ, ఇక్కడికి వచ్చి చూడమని రేపు సాయంకాలము నాలుగు గంటలకు వస్తారు. కాఫీ టిఫిన్ పెట్టు ' అన్నాడు సాదరంగా.

ఆ మాట వినగానే రాజుకు కళ్ల నీళ్లు కారాయి. మేనేజరుకు చేతులెత్తి దణ్ణం పెట్టాలనిపించి ది. సార్, సార్ అంటూ కౌంటరు దగ్గర నిలబడాడు.

"కళ్లు తుడుచుకో వెళ్లు. నేనంతా గ్రహించాలే" అన్నట్టు కళ్లతో సైగ చేశాడు మేనేజరు.

రాజుకు ఆనాడు రాత్రి ఎంతకూ నిద్రపట్టలేదు. తండ్రి యింటికి రమ్మంటాడేమో? ఇంతవరకూ ఆయనకు ఎదురు చెప్పి ఎరగడు. తల్లి రాజా అంటూ ఏడుస్తూ పోదాం రమ్మంటే? తల్లి ఏడిస్తే తనకూ ఏడుపు వస్తుంది. ఆమె కన్నీళ్లు కారుస్తూ అడి గితే తను కాదనగలడా? ఇంత గొడవ జరిగిన తరువాత ఇంటికి వెళ్లితే అన్నకు ఎంత అలుసు? అసలు తను వెళ్ళగలడా?

తెల్లవారి నలుగురితోపాటు లేచిన రాజు యాంత్రికంగా పని చేస్తూ ఆలోచించి ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చాడు. బాధతో గిలగిల కొట్టుకొన్న ఆ లేత హృదయంలో ధైర్యం కలిగింది. తల్లిదండ్రులు వచ్చినా ఇంటికి రమ్మని అడిగినా తన నిర్ణయాన్ని ధైర్యంతో వెలిబుచ్చగలిగిన బలం వచ్చింది.

మరునాడు సాయంకాలం రాజూ అని మేనేజరు కేక పెట్ట గానే తడబడుతూ వచ్చాడు రాజు. హాల్లో బల్లముందు కూర్చుని ఉన్న తల్లిదండ్రులను చూడగానే తప్పుచేసినవాడిలా వెళ్లి ఎదురుగా నిలబడ్డాడు.

రాజూ అంటూ కాంతమ్మ అతడిని దగ్గరికి తీసుకొని కన్నీళు కార్చింది. గద్గదమైన కంఠస్వరాన్ని సవరించుకుంటూ అతడినే చూస్తున్నాడు వెంకట్రామయ్య.

ఆ మూడు హృదయాలు ఇన్నాళ్ల తపనను వెళ్ళబోసు కున్నాయి. ఆ మూడు జతల కళ్లూ కన్నీళ్లతో ఓదార్చుకున్నాయి.

"రాజా. ఇంటికిరావా నాయనా!" వెంకట్రామయ్య పైకి అనగలిగాడు.

"ఇక్కడ బాగుంది. నాన్నా. వారానికొకసారి వచ్చి చూసి వెళ్ళండి." తలవంచుకొని ఒక్కొక్కమాటే జారవిడిచాడు రాజు.

రాజు బుగ్గలు నిమిరి కన్నీరొత్తుకుంది తల్లి. అతడి తల నిమిరి ఒక నిట్టూర్పు విడిచాడు వెంకట్రామయ్య.

తల్లిదండ్రులు బలవంతంగా బయలుదేరి- తమభౌతిక కాయా లను ఈడుసూ వెనక్కు తిరిగి చూస్తూ-ముందుకు సాగిపోతుంటే రాజు కడుపులో ఆవేదన ఉవ్వెత్తున లేవటం మొదలు పెట్టింది. కన్నీళ్లు జలజలా రాలాయి.

నాన్న దగ్గర డబ్బున్న రోజుల్లో రాజభోగాల ననుభ వించారు, అక్కయ్యా అన్నయ్యా నాన్న ముసలి తనంలో దగ్గర కానీ డబ్బులేక అన్నయ్య పంచన చేరాడు. ప్రొద్దున్న లేచినప్పటి నుంచీ అన్నయ్య నాన్నకు నీతులు చెబుతాడు- డబ్బును గురించీ- పిల్లల క్రమశిక్షణను గురించీ. చిన్నప్పుడు తను చేసిన అల్లరి జ్ఞాపకం తెచ్చుకోడు. తన తప్పా తల్లిదండ్రులకు కడసారిగా పుట్టటం. అందుకేనా తనకీ దుర్గతి? రోషంతో అతడి ముఖం ఎర్రబడ్డది.

సంధ్య చీకట్లలో వెలుగుతున్న దీపాల కాంతిలో తల్లి దండ్రులు కనుమరుగయ్యేవరకూ వాకిట్లో నిలబడి చూసి బరువుగా నిట్టూర్చి వెనక్కు తిరిగాడు రాజు.

---

## సత్యాహింసలు

* సత్యాహింసలను వ్యష్టి సాధనకేగాక వివిధ వర్గాల, జాతుల, సంఘాల సమిష్టి సాధనకు కూడా వినియోగింప జేయవలసిన అవసరంవున్నది. అదే నేను కనే స్వప్నం. అందుకోసమే నేను జీవిస్తాను, మరణిస్తాను. దీనియందలి విశ్వాస బలంచేత రోజురోజుకూ నూతన సత్యాలు నేను కనుక్కోగలుగు తున్నాను. అహింస ఆత్మగుణం. కాబట్టి అందరూ అన్ని వ్యవహారాల్లోనూ దీనిని అనుష్ఠించవచ్చు.

—గాంధీజీ

# మనిషి!

# నీకు తెలుసా!

యస్. వెంకటరంగారెడ్డి
— "ప్రేమ"

మనిషీ ! నీకు తెలుసా !
చుట్టూ ముళ్లపొదలున్నాయని
విషసర్పాలు విచ్చలవిడిగా సంచరిస్తున్నాయని
సోమరితనం ముసుగులో
ఆడంబరాల కాలంలో

నిన్ను, నీవే అధికంగా ఊహించుకొని
అందరిని నమ్మి
స్వేచ్ఛను అమ్ముకొని
'వంచన'యే మిగిలిందని
కన్నీరు కురిపిస్తే
లోకం క్షమించదు.

'నకిలీ' యుగంలో
'కల్తీ' లోకంలో
నువ్వు మాత్రం అసలైన సిసలైన నిజానివి
నడిపిస్తున్న సందేశాల అంతరంగపు ధ్వనివి.

వెలుగుకన్నా చీకటి ప్రియమైనది నేడు
మంచికన్నా మోసం పాలు ఎక్కువచూడు
చీకటి పిలుపు వినిపిస్తుంది ఎప్పుడూ
వెలుగు దరహాసాలనే స్వీకరించాలి నువ్వు
నీలోని 'మెరుపు'ను చూసి
నిన్ను చేరుతారు ఎందరో !
మాయమాటలతో వశపరచుకోవాలనుకుంటారు ఎందుకో !

చుట్టూ 'ముళ్లు' లా
కాంతితో మెరిసే 'రోజా'లా
స్థిర చిత్తంతో నువ్వు కలసిమెలసి ఉండాలి
వ్యక్తిత్వానికి రంగులు దిద్దుకుంటూ పోవాలి.

మనిషీ !
నువ్వు ఆవరించిన 'నిశి'ని తరిమే 'శశి'వి
నిత్య నూతన చైతన్య గీతాల ప్రతినిధివి
ముళ్ల పొదలను, మల్లె తోటలా మార్చేశక్తివి
హాలాహలంలోనే అమృతాన్ని సృష్టించే దీప్తివి.

నీశక్తి నవ్వులపాలుకారాదు
నీయుక్తి నిదుర పోరాదు
నువ్వువెలగాలి
నలుగురిని వెలిగించాలి
నీలో కాంతి, నీలోన క్రాంతి
కావాలి ప్రగతికి ఆకృతి.

మేలుకొని, మేలుపాట పాడాలి జాతి
మమతల ఉయ్యాలలో, ఊగాలి జగతి

మనిషీ, నీకు తెలుసు !
నువ్వు అనిర్వచనీయమైన శక్తివని
అపురూపమైన యుక్తివని.




## తుంగభద్ర తీరాన

## 16

కాపయ్య, వేమారెడ్డి ప్రతాపరుద్ర నగరానికి వెళ్ళడానికి ఉద్యుక్తులయ్యారు. కాని అన్నమదేవుడంగీకరించలేదు. మరి రెండు దినాలుండి వెళ్ళమని వారి నభ్యర్థించాడు. కాపయ్య వెళ్ళడమంటే అతనికి చాలా కష్టంగా వుంది. అన్నమదేవుని వీడడమంటే కాపయ్యకు గూడ కష్టంగానే వుంది. కాని ఏమి చేయగలడు ?

ప్రతాపరుద్ర నగరంలో తన కోసం అన్నయమంత్రి మొదలైనవారు కాచుకొని వుంటారు. అనపోతనాయకుడు ఆదుర్దాతో వుంటాడు. కలిగిన జయాన్ని గూర్చి తెలియజేయమని ఆ నగరానికి వార్తాహరుల్ని ముందుగానే పంపివున్నప్పటికీ ఇక అచ్చట ఆగడం అంత మంచిది కాదనుకొన్నాడు కాపయ్యనాయకుడు. కాని అన్నమదేవు డంగీకరించలేదు.

తాను ఆనెగొందికి వచ్చినప్పటినుండి తన యెడల యెంతో శ్రద్ధ కనబరుస్తున్నాడన్నమదేవుడు. సాధ్యమయినంతవరకు తన వద్దనే వుండడానికి ప్రయత్నిస్తున్నాడతడు. తనమీద ఎందుకతనికంత శ్రద్ధ ? కాపయ్యకంతగా అర్థంకాలేదు

అన్నమదేవుని అభ్యర్థనను కాదనలేక మరి ఒక దినం ఆనెగొందిలో వుండడానికంగీకరించాడు కాపయ్యనాయకుడు.

ఇక ఒకే ఒక దినం తమ అతిథిగా వుంటాడు కాపయ్య. తరువాత తన నగరానికి వెడుతాడు. మరలా కలుసుకోవడమెన్నడో. అన్నమదేవుని మనస్సు వ్యగ్రమయింది. తాను కాపయ్య నాయకుణ్ణి విడిచి వుండగలడా ? అది సాధ్యమేనా ? తన్ను తానే ప్రశ్నించుకొన్నాడతడు.

ఆ రాత్రి చాలా కాలం అన్నమదేవుడు కాపయ్యనాయకునితోను, వేమారెడ్డితోను మాట్లాడుతూనే వుండిపోయాడు, కాని అతనికేమాత్రం తృప్తికలగలేదు. పడుకొన్నప్పుడు గూడ అతని హృదయంలో ఏదో ఒక అసంతృప్తి మెదలుతూనేవుంది.

మరునాటి మధ్యాహ్నం అన్నమదేవుడు కాపయ్యనాయకుని విడిచి వెళ్లాడు. అప్పుడు కాపయ్య కూర్చొని ఏదో ఆలోచిస్తున్నాడు. అన్నమదేవుడు వస్తూనే నవ్వుతూ రమ్మని ఆహ్వానించాడు.

అన్నమదేవుడు కూర్చుంటూ "ఈ దినం తుంగభద్రా తీరానికి వెళదామా?" అని అడిగాడు.

"నీకిష్టమయితే వెళ్ళవద్దాము" అన్నాడు కాపయ్య నాయకుడు

"అయితే ఇచ్చటే ఉండండి త్వరగా వస్తాను'' అని అన్నమదేవుడు వెళ్లి కొంతసేపట్లో తిరిగి వచ్చాడు. ఆలోగా భటులు రెండు అశ్వాలను తీసుకొని వచ్చారు. ఇద్దరూ వాటి నధిరోహించి తామలా వెడుతున్నామని సోమదేవునకు, వేమారెడ్డికి చెప్పమని తుంగభద్రవైపుగా వెళ్లారు.

వెడుతున్నప్పుడు వారంతగా మాట్లాడలేదు. తుంగభద్రానదీ తీరానికి వస్తూనే "ఇది ఎంత సొగసుగా వుంది" అన్నాడు కాపయ్య నాయకుడు.

"మీ కంటేనా?" అన్నాడు అన్నమదేవుడు వెంటనే నాలుక కరచుకొన్నాడు.

ఆ మాటలు విని కాపయ్య నాయకుడన్నమదేవుని వైపు చూచాడు. అతను కొంటెగా నవ్వాడు.

తుంగభద్ర ఆనాడంతగా ప్రవహించడంలేదు. నదిలో కొద్దిగానే నీరున్నది. కాని నది స్వచ్ఛంగా వున్నది. అశ్వాలను దిగి

వాటిని అక్కడున్న వృక్షాలకు కట్టివేసి వారిద్దరూ వెళ్లి ఆ నీటిని త్రాగారు. ఆ నీరెంతో రుచిగావున్నది.

"గోదావరి నీటికంటె ఈ నీరెంతో రుచిగా వున్నది." అన్నాడు కాపయ్య నాయకుడు.

"అవును ఇచ్చటి నీరేగాక మనుషులు గూడ చాలామంచిగా వుంటారు." అని నవ్వాడు అన్నమదేవుడు.

కాపయ్య గూడ నవ్వాడు.

ఇద్దరూ వెళ్లి ఒక వృక్షం క్రిందనున్న రాతిబండమీద కూర్చున్నారు. ఎండకాస్తున్నప్పటికీ గాలులు వీస్తున్నందువల్ల అంత వేడిగా లేదు.

"ఋష్యమూకం ఇచ్చటి కెంతదూరముంటుంది?" ప్రశ్నించాడు కాపయ్య.

"ఇచ్చటికి చాల దగ్గరగానే వుంటుంది"

"ఆపర్వతం మీదికేగావాలి సీతమ్మ తన నగల్ని జారవిడిచింది" అడిగాడు కాపయ్య

"అవును అచ్చటే జారవిడిచింది. అప్పుడచట హనుమంతుడు, సుగ్రీవుడు తదితర వానర నాయకులున్నారు గావాలి".

"ఈ ప్రాంతం చాల పవిత్రమైనది.

"మీ హృదయంలాగే" అంటూ నవ్వాడు అన్నమదేవుడు కాపయ్య అతనివైపు చూచాడు. అన్నమదేవుడు అతని వైపు. చూస్తున్నాడు. ఆచూపులలో చూపులు భరించలేక పోయాడు కాపయ్య అంతపదునుగా వున్నాయవి.

"పోని ఒక్కటడుగుతాను చెబుతారా?"

"ఎందుకు చెప్పను?" కాపయ్య పెదవుల్లో నవ్వులు విచ్చుకొన్నాయి.

"మీకు వివాహమయిందా?

"లేదు"

"ఆంధ్ర భూమండలాధ్యక్షులయి గూడ వివాహం చేసుకోలేదా?"

"లేదు"

"పోనీ ఎవరైనా మిమ్మల్ని కోరుకొంటే గూడ చేసుకోరా"

"చేసుకోను"

అన్నమదేవుని మనస్సు కొంత దెబ్బతిన్నది. అతని ముఖం కొంతనల్లబడింది. కాని కాపయ్య ఆ మార్పును గమనించ లేదు.

"ఎందుకు? ప్రశ్నించా డన్నమదేవుడు"

ఓరుగల్లు నాక్రమించేవరకు వరాహధ్వజాన్ని ఆ కోటపై మరలా స్థాపించేవరకు నేను వివాహం గావించుకోదలచలేదు.

ఒకవేళ మీరా కోటను వశంగావించుకోలేకపోతే ?

"పరిణయమే చేసుకోను." దృఢంగా అన్నాడు కాపయ్య నాయకుడు.

"నేనలా శపథం గావించి వున్నాను" అతని ముఖం గంభీరమయింది. అప్పుడది కొంత భయంకరంగా గూడ వుంది,

అన్నమదేవుణ్ణి ఎన్నోమార్లు చూచి వున్నాడు అతడు చాల అందగాడు. ఎప్పుడూ నవ్వుతూ వుంటాడు. చూడటానికెంతో ఇంపు గొలుపు తుంటాడు. కలుపుగోలుతనంగా తీయగా మాట్లాడు తుంటాడు. కాని యుద్ధం చేయవలసి వచ్చినప్పుడు చేస్తున్నప్పుడు తీవ్రంగా, చాలా భయంకరంగా వుంటాడు. అప్పుడతని మాటలు భయాన్ని గొలుపుతుంటాయి. అతని ఆజ్ఞలు సుగ్రీవాజ్ఞల్లాగా నుంటాయి. ఆ సమయాలలో అతడేనా కాపయ్య నాయకుడు అన్న సందేహం కలుగు తుంటాయి.

ఓరుగల్లును విముక్తం గావించాలని అతడెన్నడూ ఉబలాట పడుతూవుంటాడు. ఆ నగరం విముక్తం కావాలంటే, సుల్తానుబలహీన పడాలంటే అతనికి వ్యతిరేకంగా ఉన్న శత్రులు బలపడాలి. అందుకనే అతడు సోమ దేవరాజును బలపరచాడు. ద్వార సముద్ర బళ్ళాలుడ్ని రెచ్చగొట్టి సుల్తానుకు వ్యతిరేకంగా తిరుగు బాటు గావించాడు.

శృంగేరి పీఠాధిపతి గూడ ఈ పోరాటంలో తమకెంతో సాయపడ్డాడు. హరిహర బుక్కరాయల్లను తనవశం గావించుకొని సుల్తాను సేనల్ని దెబ్బగొట్టించాడు. తాను ఆంధ్ర భూమాత అధ్యక్షుడైన నాటికంటే యీనాడు ఆంధ్రావని చాలా శక్తివంతంగా వుంది. ఇక ఓరుగల్లును పట్టుకోవడం చాలా సులభం. దానికింక ఏర్పాటు చేసుకోవాలి. అనుకుంటూవున్నాడతడు.

" ఏమి ఆలోచిస్తున్నారు ?" ప్రశ్నించాడన్నమ దేవుడు.

" ఏమీ లేదు. మీకు వివాహ మయిందా ?

" లేదు. "

" ఎందువల్ల ? "

" మాయన్నయ్యకుకూడా కాలేదు?"

"వారికెందుకు కాలేదు"

" మీలాగే వారు గూడప్రతిన పట్టుకొని కూర్చున్నారు,"

" ఓహో. అలాగా." అంటూ నవ్వాడు కాపయ్య. అన్నమదేవుడు గూడ నవ్వాడు.

ఆ తరువాత వారు అశ్వాలనెక్కి తుంగభద్రా తీరంలోనే ప్రయాణం గావించారు.

సాధారణంగా సాయం సమయాలలో వ్యాహ్యాళి వెడుతూ వుంటారందరూ. కాని అన్నమ దేవుడు, కాపయ్య నాయకుడు మాత్రం ఆ ఎండలోనే వెడుతున్నారు. కాని వారికది ఎండ అని అనిపించలేదు.

తుంగభద్రా తీరంలో రకరకాల వృక్షాలున్నాయి. చిన్న చిన్న గుట్టలున్నాయి. ఎటు చూచినా అందంగానే వుంది. చూడడానికానందంగానే వుంది. అంతకంటే వారిమాటలు చాల తీయగా వున్నాయి. అందువల్ల వారికేమీ బడలిక కలుగలేదు.

కాలం గడుస్తున్నది. గడియలు జరిగిన కొద్దీ కాలమప్పుడే అయిపోతున్నదే అని అన్నమదేవుడు ఆదుర్దా పడసాగాడు.

రేపే కాపయ్య ప్రయాణం. మరలా అతణ్ణి చూడడమెన్నడో. అతనితో సంభాషించడమెన్నడో. అతని మనస్సు కొంత కలవరపడింది.

చాల దూరం పోయిన తరువాత వారు అశ్వాలను దిగి వాటిని వృక్షాలకు బంధించారు. అచటనున్న చిన్న తిప్పనెక్కి కూర్చున్నారు. అప్పటికి సాయం సమయమయింది. మందమారుతం వీస్తున్నది. ఆ తిప్ప పక్కలో నున్న చెట్లలో ఎచ్చటి నుండో పూలవాసనల్ని తీసుకొని వస్తున్నది ఆవాతావరణం చాల ప్రకోపకారకంగా వున్నది. కాపయ్య అన్నమదేవుల మనసులు ఆకాశంలో తేలి పోతున్నట్లున్నవి.

తానొక స్త్రీనని చెప్పివేదామా అని పించింది అన్నమదేవునికి. కాని అతని మనస్సంగీకరించలేదు. ఎందుకోఅతనిమనస్సు వెనుదీసింది.

" మీరు వెడుతూనే నన్ను మరచిపోతారనుకొంటాను." అన్నమదేవుని కళ్ళు చెమ్మగిల్లాయి.

" ఎందుకు మరచిపోతాను ?" కాపయ్య అతని వైపు తిరిగి చూచాడు. అతని కళ్ళలోని చెమ్మను గుర్తించాడు.

" మీరింత స్నేహంగా వుంటారని నేననుకోలేదు. మీ మిత్రత్వాన్ని నేనెన్నడూ మరచిపోలేను." అన్నాడు కాపయ్య-అతని హృదయం కదిలిపోయింది.

" మిమ్మల్ని విడిచి వుండాలంటే నాకెంతో కష్టంగావున్నది."కాని-అవకాశముంటే మీతోనే వుండి పోవాలని ఉంది.

అన్నమ దేవుణ్ణి చూచి కాపయ్యతియ్యగా నవ్వాడు." నాకూ అలాగే వుంది, గాని ఏమి చేదాము. మనకు కొన్ని బాధ్యతలున్నవి గదా ?" అన్నాడు.

అమాటలన్నమ దేవునికెంతో ఆనందాన్ని కలిగించాయి. "ముందు జన్మలో మనం అన్నదమ్ములమో, బావమరుదులమో తెలియదు. మన హృదయాలు చాల గట్టిగా పెనవేసుకొని ఉన్నాయి." అన్నాడు కాపయ్య.

"అంతకంటే దగ్గరివారమైవుంటాము." అన్నాడు అన్నమదేవుడు.

కాపయ్య ఆ మాటల అర్థాన్ని గ్రహించలేదు గ్రహించడం కష్టంగూడ.

"తుంగభద్రా తీరంలాగే గోదావరి తీరంగూడ చాలచక్కగా వుంటుంది" కాపయ్య అన్నాడు

"నేనచటికి వచ్చినప్పుడు వ్యవధిలేదు. కాని అచటి దృశ్యాలు మాత్రం చాల చక్కగా వున్నవి. ఇంతకంటె రమణీయంగా వున్నవి "

"ఒకసారి రారాదూ"

"రావాలనేవుంది. కాని ఇప్పుడు రాలేను"

"ఎందువల్ల ?"

"హరిహర బుక్కరాయలకు పారిపాలనంతటినీ అప్పగించాలి. నూతన నగర నిర్మాణం గావించాలి. చాల పనులు ఉన్నవి" నిట్టూర్చాడు అన్నమదేవుడు.

"మరెప్పుడు వస్తారు?" నవ్వుతూ ప్రశ్నించాడు కాపయ్య నాయకుడు.

"ఓరుగల్లు మీదికి వెళ్లేటప్పుడు. అప్పుడు నేను మీకండగా వుండి పోరాడుతాను. మీకు విజయాన్ని చేకూరుస్తాను. మీరు వివాహం గావించుకొనే అవకాశాన్ని కల్పిస్తాను." నవ్వాడు అన్నమ దేవుడు.

కాపయ్య గూడా నవ్వుతూ, "మీరు గట్టివారే." అన్నాడు.

సంధ్యపోయి మసక చీకటులు అలముకొంటున్నా వారింకా మాట్లాడుతూనే వున్నారు. ఆ మాటల్లో ఏదో అనిర్వచనీయానందాన్ని వారనుభవిస్తున్నారు.

అంతలో గుర్రాలు సకిలించాయి. ఆ సకిలింపును విన్న తరువాత గాని సమయం మీరిందని వారు గుర్తించలేదు. అప్పుడు వారు ఆ గుట్టను దిగివచ్చి అశ్వారూఢులై తిన్నగా ఆనెగొందికి వెళ్లారు.

## విద్యానగర స్థాపన

## 17

హరిహరరాయలు, బుక్కరాయలు ఆనెగొంది పాలనను స్వీకరించినప్పటికీ సోమదేవరాజును, అన్నమదేవుణ్ణి చాల ప్రేమగా చూడసాగారు.

వారే నిజమైన రాజులన్నట్లుగా భావిస్తూ ప్రతివిషయములోను వారి సలహా తీసుకొనసాగారు.

సోమదేవరాజు, అన్నమదేవుడు యుద్ధ విశారదులేగాని, హెచ్చు పరిపాలనానుభవం కలిగినవారుగారు. హరిహరుడుగాని, బుక్కరాయలుగాని అలాగాదు. వారు యోధులేగాక పరిపాలనా దక్షులుగూడ. ప్రతాపరుద్ర చక్రవర్తి కాలంలో కాకతీయ సామ్రాజ్యంలోను, ఆతరువాత కంపలి రాజ్యంలోను ప్రధానమైన పరిపాలనా బాధ్యతల్ని వహించి పనిచేసినవారు. అందువల్ల, కృష్ణ తుంగభద్ర అంతర్వేదిని పాలించడం వారికంత కష్టంగా లేకపోయింది. వారు మొట్టమొదట ముస్లిములు పెంచిన శిస్తుల్ని తగ్గించారు. తమరాజ్యం మొత్తంమీద ఒకేవన్ను విధానాన్ని అమలుజరిపారు శిస్తులు వసూలు చేయడానికి చక్కని యంత్రాంగాన్ని నెలకొల్పారు.

యుద్ధాలలో పాడయిన కోటలను మరమ్మత్తుగావించి, వాటిని బలపరచి వాటిలో అచ్చటికవసరమైన సైన్యాన్ని వుంచారు. సైనికులకు శిక్షణ నివ్వడానికి శిక్షణ కేంద్రాలను స్థాపించారు.

హరిహర బుక్కరాయల్ల రాజ్యం వచ్చిన తరువాత ఆ రాజ్య ప్రజలు ఇక భయంలేదనుకొన్నారు. స్థిరమైన పరిస్థితు లేర్పడినా యనుకొన్నారు.

రాయద్వయం ఆనెగొందిని మరికొంత ప్రాంతాన్ని సోమదేవరాజు, అన్నమదేవులక్రింద వుంచారు. వారిని తమ సలహాదారులుగా, సైన్యాధిపతులుగా వుంచుకొన్నారు. రాజ్యంలో పరిస్థితులు కొంత స్తిమిత పడుతూనే నగర నిర్మాణం గావిద్దామను కున్నారు.

ఒకనాడు సాయంత్రం భోగనాథులతో విద్యారణ్య యతీంద్రుడు వస్తున్నాడని హరిహరరాయనికి వార్త వచ్చింది. అందరూ ఎదురేగి యతీంద్రుని తీసుకొనివచ్చారు. యోగీంద్రుడు వస్తూనే, నగర నిర్మాణానికి స్థలాన్ని చూచి వద్దాము రమ్మన్నాడు. అందరూ దాని కంగీకరించి విద్యారణ్యయతీంద్రునితో గూడ వెళ్లారు.

యతీంద్రుడు, హరిహరరాయలు, సోమదేవరాజు తక్కిన వారు పదిదినాలు ఋష్యమూక పర్వత ప్రాంతమంతా తిరిగారు. ప్రతిచోటును జాగ్రత్తగా పరిశీలించారు. ఎచ్చట నగర నిర్మాణం జరగాలో నిర్ణయించారు.

అందరూ ఆనెగొండికి తిరిగి వచ్చిన తరువాత ఏ నాడు నగర నిర్మాణానికి పునాదివేయాలో నిర్ణయించడానికి పూనుకొన్నారు. సాయణుడు, భోగనాథుడు ఆవిషయంలో యతీంద్రునికి సాయపడ్డారు. ఆ నగరం ప్రపంచంలో ఎచ్చట లేనంత గొప్పదిగా వుండేటట్లు, అది భోగభాగ్యాలతో తులతూగేటట్లు, కొన్ని శతాబ్దాలపాటు ఆ నగర పరిపాలకులకు విజయాలు ఒనగూడేటట్లు ఉండాలని, ఆలాగా వుండ డానికి వీలయిన లగ్నాన్ని చూడాలని యతీంద్రుడు ప్రయత్నించాడు. తుదకా లగ్నం కుదిరింది.

ఆ లగ్నం నాడు వెన్నెల రాత్రి. వేకువనే చుక్క మొలుస్తుంది. చుక్క మొలిచే సమయానికి పునాదివేయాలి. దానికి కావలసిన ఏర్పాట్లన్నీ చేయబడినవి.

ఆ నాడు హరిహరరాయలు బుక్కరాయలు సోమదేవ అన్నమదేవులు ఉపవాసమున్నారు. దేవుణ్ణిపూజించారు. పునాది వేయవలసిన స్థలాన్ని చేరుకున్నారు. నగర నిర్మాణానికి పునాది వేయనున్నారని విని వేల ప్రజలు గూడ అచ్చటికి వచ్చారు. సైన్యంతో కొంతభాగం అచ్చటికి రప్పించబడింది. యతీంద్రుడే స్వయ గా పునాదిరాయిని వేయించడానికి పూనుకొన్నాడు. చుక్క మొలిచే సమయాన్ని చూచి ఒక చువ్వను ప్రేల్చమన్నాడు. ఆ లోగా అతడు రాగిరేకుమీద ఒక చక్రాన్ని వ్రాసి అందులో వుంచాడు. దానితోపాటు నవరత్నాలను, నవధాన్యాలను, వజ్రవైఢూర్య నల గోమేధికాలను అందులో వేశాడు. హరిహరరాయలను సిద్ధంగా వుండమన్నాడు. అందరినీ నిశ్శబ్దంగా ప్రార్థన జేయమన్నాడు. అతడుగూడ నిమీలిత నేత్రుడై ప్రార్థన గావింపసాగాడు.

అంతలో చువ్వ ఆకాశంలోకి దూసుకొని పోయింది. వెంటనే హరిహరరాయుణ్ణి పునాదిలోకి రాయిని దించమన్నాడు యతీంద్రుడు. అతడాయోగీంద్రుడు చెప్పినట్లు చేశాడు.

యతీంద్రుడాకాశం వైపుచూచాడు. శుక్రుడు అప్పుడే మొలుస్తున్నాడు. తప్పని సరిగా ఆ నగర చాల గొప్పదౌతుందని ఆ యోగీంద్రుడు ప్రకటించాడు.

అందరూ "జై ఆంధ్ర ! జై యతీంద్ర !" అని జయ జయ ధ్వానాలు గావించారు.

నగర నిర్మాణానికి ప్రజలందరూ తోడ్పడవలసినదని ఆ రాజ్యాన్ని సుస్థిర పరచడానికి, దానిని పరిరక్షించడానికి సైన్యం సిద్ధంగా వుండాలని, అవసరమైతే ఎన్నిత్యాగాలకైనా వెనుదీయరాదని యతీంద్రుడుద్బోధించాడు. అతని బోధను వింటున్నపుడందరికీ రోమాంచం గలిగింది, అందరి హృదయాలు ఆవేశంతో నిండు కొన్నవి.

నిర్మింపబడనున్న నగరం యతీంద్రుని జ్ఞాపకార్థ గా విద్యానగరమని పిలవబడుతుందని హరిహరరాయలు ప్రకటించాడు.

ఆ ప్రకటనను విని యతీంద్రుడు నవ్వాడు. విద్యానగర మన డానికంటె విజయనగర మనడం మంచిది అన్నాడు యతీంద్రుడు.

" విద్యానగరానికి జై ! విజయనగరానికి జై " అన్నారందరూ. పునాది వేయబడిన మరునాటి నుంచి నగర నిర్మాణం చురుకుగా జరగ సాగింది. ఒక వైపు కోటగోడలు, మరొక వైపు రాచనగరు, కార్యాలయాలు, సైనికశాలలు, విపణివీధులు నిర్మాణం కాజొచ్చినవి. భారత దేశంలో అ తపెద్ద ఎత్తున అలాటి నిర్మాణం అంతకుముందు జరగనే లేదేమో. ప్రజల తోడ్పాటుంటే ఏపనైనా సాధించబడ వచ్చునని విద్యానగరం ఋజువుగావించింది.

ఒకనాడు హరిహర బుక్కరాయల్లు, సోమదేవ అన్నమ దేవులు శృంగేరికి వెళ్లారు. అచ్చటవారు రాజకీయ విషయాలను గూర్చి యతీంద్రునితో చాలసేపు చర్చించారు. ఆ తరువాత తమ కొక ప్రతిభావంతుడైన మంత్రి కావాలని కోరాడు హరిహరరాయడు.

యతీంద్రుడాలోచించాడు. అతని దృష్టికి మొదట యెవ్వరూ తోచలేదు. ఆ తరువాత ఒక యువకుడు జ్ఞప్తికి వచ్చాడు. అతడు గూడ విద్యారణ్యుడే. అతని త డ్రి కొండి కాంతి చాల గొప్పవాడు. ప్రజ్ఞావంతుడు. సకల శాస్త్ర సంపన్నుడు. బహుభాషా ప్రవీణుడు అతని కుమారుడయినవిద్యారణ్యుడు యువకుడయినా తండ్రికంటె ప్రజ్ఞాశాలి. చిన్నతనంలోనే అన్ని శాస్త్రాలను అభ్యసించాడు. పురాణేతిహాసాలను పఠించాడు. చాలా తెలివిగలవాడు. మంచి సాహసంగలవాడు. ఎవరితోనయిన చాకచక్యంగా వ్యవహరించ గలిగినవాడు. ఆవులిస్తే ప్రేవులు లెక్కబెట్టగలిగినవాడు. అందు వల్ల అతడే అభివృద్ధి జెందనున్న ఆ రాజ్యాన్ని ముందుకు తీసు కొని పోగలవాడు.

"కాంతి విద్యారణ్యుడనే యువకుడున్నాడు. మీకు ప్రధానిగా వుండగల అర్హతలన్నీ అతనికున్నవి'' అన్నాడు యతీంద్రుడు.

యతీంద్రునివద్ద ఆ యువకుని వివరాలన్నీ కనుగొన్నాడు హరిహరరాయలు. ఆనెగొందికి వెడుతూనే కాంతిని విద్యారణ్యుని ఇద్దరిని తీసుకొని రమ్మని ప్రధాన అధికారులను పంపాడు.

హరిహరరాయలు ఆహ్వానించాడని వింటూనే కాంతి చాల ఆనందించాడు. కుమారుని తీసుకొని ఆనెగొందికి వచ్చాడు.

కాంతి విద్యారణ్యులు ఆనెగొందికి వచ్చినప్పుడు వారికి సోమదేవరాజు స్వాగతమిచ్చాడు. వారిని హరిహరరాయలువద్దకు తీసుకొని వెళ్ళాడు. అచ్చట బుక్కరాయలు, అన్నమదేవుడు గూడ వున్నారు.

కాంతి లోనికి వస్తూనే వారందరూ లేచి నమస్కరించారు వారినాశీర్వదించాడు. విద్యారణ్యుడు వారికి ప్రతినమస్కారం గావించాడు.

అందరూ కూర్చున్న తరువాత

''మీ ప్రయాణం క్షేమంగా జరిగిందా ?''

ప్రశ్నించాడు హరిహరరాయలు.

''దేవుని దయవల్ల చక్కగానే జరిగింది.''

''ఇతడేనా మీ కుమారుడు ?''

''అవును. ఇతడే విద్యారణ్యుడు.''

విద్యారణ్యుడు చిరునవ్వు నవ్వాడు.

కౌండికంటే విద్యారణ్యుడు తేజస్సుతో వెలుగొందుతున్నాడు. వెడల్పయిన అతని లలాటమతని ప్రజ్ఞను తెలుపుతున్నది విశాలములయిన అతని కళ్ళు అతని చురుకుదనాన్ని వ్యక్తం గావిస్తున్నవి చిన్నదయిన అతని గడ్డం అతని దృఢత్వాన్ని తెలియజేస్తున్నది. అతన్ని చూస్తుంటే యువకుణ్ణి చూచినట్లుగాలేదు అనుభవజ్ఞుడయిన ఏ పెద్దనో చూచినట్లుంది.

ఒక యువకుణ్ణి మంత్రిగా తీసుకొమ్మని యతీంద్రుడు సలహానిచ్చినప్పుడు హరిహరరాయలుకుగాని, [illegible]రులకుగాని అంతగా నచ్చలేదు. ఎంతో అనుభవమున్న పెద్దలనే సాధారణంగా మంత్రులుగా తీసుకొంటారు. కాని యతీంద్రుడు యువకుణ్ణి తీసుకోమంటాడేమని వారు కొంత కలవరపడారు. కాని అంతను ఆలోచించకుండా అలా చెప్పి వుంటాడా ? అని మరలా తమ్ముతాము సమాధానపరచుకొన్నారు. ఇప్పుడతన్ని చూస్తుంటే నిజంగా యతీంద్రుడు సరిఅయిన వానినే మంత్రిగా సూచించాడని వారికి తోచింది. విద్యారణ్యుడయిన తనకు బదులు మరొక విద్యారణ్యుని తమ కప్పగించాడని అనిపించింది.

''యతీంద్రుడు మీ కుమారుణ్ణి మంత్రిగా తీసుకొమ్మన్నారు మమ్మల్ని.'' అంటూ కౌండి వైపు చూచాడు హరిహరరాయలు.

''ఏ యతీంద్రుడు?''

''మాధవ విద్యారణ్యయతీంద్రుడు.''

''ఓహో. శంకరాచార్యులా. వారికి మామీద ఎంతో దయ వున్నది. కాని మావాడు యువకుడుగదా?''

''కావచ్చు. కాని యోగీంద్రుని మనస్సున్నట్లున్నది. అందువల్ల మేము మీ కుమారుణ్ణే మంత్రిగా స్వీకరించదలచుకొన్నాము ''

కౌండి చిరునవ్వునవ్వుతూ, 'మావాడు ధన్యుడు'' అన్నాడు. కుమారునివైపు చూచి నీకిష్టమేనా ?'' అని ప్రశ్నించాడు.

''యతీంద్రుని ఆజ్ఞను ఒక భాగ్యంగా స్వీకరించవలసిందే. కాని నేనాపనికి అర్హుణ్ణో కానోనని నాకు సందేహంగా వుంది.', అన్నాడు విద్యారణ్యుడు.

''గొప్పవారెవరూ తమ అర్హతల్ని చాటుకోరు.'' అన్నాడు సోమదేవుడు.

''మీకిష్టమైతే నాకిష్టమే. కాని .........''

''ఎందుకు సందేహిస్తారు? చెప్పండి?'' అడిగాడు హరిహరరాయలు.

''ఏమీలేదు, పరిపాలనా వ్యవహారాలలో నాకు స్వాతంత్ర్యముంటుందని భావించవచ్చునా ?''

''తప్పనిసరిగా వుంటుంది. అందరం కలిసి ఆలోచించే గదా ఒకనిర్ణయానికి వస్తాము ''

''అవును. అలాగయితే మీయిష్టాన్ని కాదనను.'' అన్నాడు విద్యారణ్యుడు.

ఈ వినూత్న రాజ్యాన్ని సేవించడానికి నా కుమారుణ్ణి నేను హృదయపూర్వకంగా అప్పగించుకొంటున్నాను '' అన్నాడు కౌండి.

''యతీంద్రుని ఆశలకు రూపురేఖలు దిద్దడానికి శక్తివంచన లేకుండా ప్రయత్నిస్తాను.'' అంటూ తలవాల్చాడు కాంతి విద్యారణ్యుడు.

(సశేషం)

# నగరంలో వార్తా చిత్రాలు



గవర్నరు సలహాదారు శ్రీ హెచ్. సి. సరీన్, ఐ. సి. ఎస్. జూన్ 18న సచివాలయంలోని కమిటీ హాలులో తోళ్ళ సలహా మండలి ఆరవ సమావేశంలో ప్రసంగిస్తున్న దృశ్యం.



సౌదీ అరేబియా రాయబారిగా నియమితులైన శ్రీ జహీర్ అహమ్మద్ గౌరవార్థం రిట్జ్ హోటల్‌లో జూన్ 8న జరిగిన అభినందనసభలో ప్రసంగిస్తున్న శ్రీ జహీర్ అహమ్మద్. ఈ సభకు ప్రధాన కార్యదర్శి శ్రీ ఎన్. భగవాన్‌దాస్ అధ్యక్షత వహించారు.

# నగరంలో వార్తా చిత్రాలు



రాష్ట్ర గవర్నరు జూన్ 6 వ తేదీన బాలానగర్‌లో పరికరాల నమూనాల కేంద్ర సంస్థ నూతన భవనాలకు ప్రారంభోత్సవం చేస్తున్న చిత్రం



జూన్ 7 వ తేదీన ఉస్మానియా విశ్వవిద్యాలయానికి చెందిన పబ్లిక్ అడ్మినిస్ట్రేషన్ భారతీయ సంస్థ రెండవ వార్షిక సమావేశంలో గవర్నరు సలహాదారు శ్రీ హెచ్. సి. సరీన్ ప్రారంభోపన్యాసం చేస్తున్న దృశ్యం.

**కవిత:**

# ముప్పై ఏళ్ళైనా నిండకముందే

—ఐ. యస్. రాఘవ

ముప్పై ఏళ్ళైనా నిండక ముందే ! మూరీ
ఎందుకలా ముది వగ్గువవుతున్నావు ?
ఎందుకలా ముడుచుక పోతున్నావు ?
పిత్రార్జితం కృష్ణార్పణ మయిందని
సంబళించాలని-ఎందుకొచ్చిన సంబడమని
చీదరించుకుంటున్నావట ! మాచెల్లిని-మందారవల్లిని.
మొన్నటికి మొన్న జీవితమా ! ఇది వసంతం అనేవాడివే !
ముసిపాల పాల వెల్లిలో తేలియాడే వాడివే !
'ఇప్పుడిహ' చీదరించుకుంటే మాత్రం మారుతుందా !
చిట్టి తండ్రీ నీ జాతకం ?
తప్పుతుందా ! ఈ పితలాటకం !
అంటు మామిడి మొక్కలాంటి మాచెల్లెలి ఆరోగ్యం బెడిసికొట్టిందా!
కథ మళ్ళీ మొదటి కొచ్చిందా !
నీకిప్పటి కప్పుడే ఐదుగురనుకుంటాను.
పురాకృత ఖర్మమని-ఎందుకు ముంచుకొచ్చే ప్రళయాన్నలా దాట
వేస్తావు ?
నామాటల్నిలా కొట్టి వేస్తావు ?
మాటలా ! కావివి, అనుభవం పరచిన పూల బాటలు
విజ్ఞానం నేర్పిన సయ్యాటలు
కుటుంబ నియంత్రణం-భ్రూణహత్య-ఒకటేనని
పాత పాటాన్నే ఇంకా వల్లిస్తున్నారా ! మీ అమ్మా-నాన్నా
ప్రేమించకందా-పెళ్ళాడకందా-కుటుంబ నియంత్రణం ?
కాకపోతే ముందూ-వెనకా చూచుకోమందది.
మరునికి ప్రతీకలైన రత్నాలింటికి రెండో-మూడోచాలంది
ఇంతికిదే సింగార మంది !
పురిటి నొప్పులు పడే పుడమికిదే కొంగు బంగార మంది.
ఇది తప్పా !!
'క్షణభంగుర' మెకాదు జీవితం
'అపురూప వర' మంది-
ఇది దోషమా !

ఏడాదికి ఒక మాటేగా వస్తుంది వసంతం ?
ఎందుకు వర్తించదీ సూత్రం జీవితానికి మాత్రం ?-
అని ఆలోచించ మంది-
ఇది అవివేకమా !
గుర్తుంచుకో నేస్తం-వసంతంవయసులో వస్తుంది
పన్నీటిలా వలపుల్ని చిల్కరిస్తుంది. చూపుల్ని విసురుతుంది.
వసంతం ముసుగులో 'తగుదునమ్మా' అని
శిశిరం మాత్రం మాటిమాటికి తలుపు తట్టుంది -
సోయగంతో బుకాయిస్తుంది-బుజ్జగిస్తుంది.
నేస్తం ! ఆ మాయలాడికి లొంగకు
ఆ మాటకారిని చూచి ఉప్పొంగకు
నీ బతుకప్పుడు విరితోట
మరిచావా ! అక్కడే ఆరంభమౌతుంది నీ కన్నీటి పాట -
ఎందుకింకా పుత్రకామేష్టి అని - పున్నామ నరకమని - మమ్మల్ని
ఝుళిపిస్తావు ?
'పాపపుణ్యాల' పేరుచెప్పి జనతని బెదరిస్తావు
'పాపం - పుణ్యం' ఏది పాపం ?
పిల్లల్ని మాడ్చడం పాపం గాదా ?
బతుకుని రచ్చకీడ్చడం పాపంగాదా !
నిమ్మళంగా ఆలోచించు - నీ శంకరుడికెందరు పిల్లలు ?
నీ 'రామయ' తండ్రికెందరు కొడుకులు ?
నీకా నిగ్రహం లేదా !
అలాగని ఆలోచనల్ని పెంచుకున్నావా ?-
ఇల్లాలి ఆవేదనల్ని పంచుకున్నావా ? -
బాధ్యతల్ని ఎన్నాళ్ళిలా నెట్టివేస్తావు ? -
బతుకుని సాలెపుర్వులా బలిచేస్తావు ? -
ఈ రోగానికుందట ఒకే ఒక మందు
ఉదాసీనతలో కాలం వృథాయించకముందే
ముచ్చట్లూ - మురిపాలూ - నిన్నింకింత రొంపిలోకీడ్వకముందే -
తమాయించుకొనిచూడుమా 'భిషగ్వరుని'

నీ ఆవేదనల 'హాలాహలాన్ని' తన గళంలో నిభాయించుకునే
గంగా ధరుని -
కోర్కెలు గుత్తాలు ! కాని, పెకళించు వాటికళ్ళేలు
కన్నీటి కెరటాల్లోని - కలువరేని కళల్ని
చుక్కనీరైనాలేనిచోట - చలివేంద్రల్ని
సంతరించి పెట్టుంది మా నియంత్రణ కేంద్రం
'డస్సిన బతుకుల' చలివేంద్రం
దప్పిగొన్నవారిరాజ్యం
కాదు - హితవు సలిలం -
అంటుందది.
ఉన్నాయా కేంద్రంలో-శస్త్రాస్త్రాలు-నిరోధులు-ట్యూబెక్టమీ-
వ్యాసెక్టమీలు-ఉన్నారక్కడే చప్పన్నారు దేశాల్ని చుట్టివచ్చిన నారాయణ స్వరూపులు.
రోగతిమిరాల్నిమట్టు పెట్టే జ్ఞాన జ్యోతులేనా ! వున్నదక్కడ !!
లేదు ! ఆనంద జీవనానికి రూపకల్పనచేసే మహా శిల్పులూ
వున్నారక్కడ !
తెరిగి వాతపెట్టే అశ్వినులున్నారు-మనస్వినులున్నారు.
అంతేనా వున్నది ?-
ఉన్నారక్కడే అనుభవజ్ఞులు-త్రిక లజ్ఞులు-
అతిరథులు-మహారథులు-మనల పలకరిస్తున్నారు,-
ఎందుకింకా "స్పెక్యులేషన్ ప్లీజ్ కమిన్" అని-
త్రినేత్రుడు మళ్ళీ అవతరించాడట
త్రికోణుడై : అంగ రంగవైభవంతో-
విజృంభిస్తున్న అనంగుని మట్టు పెట్ట డానికని-
చిరు చీకట్లని చీలుస్తున్న దీపంలా-
దశకంఠుని దునిమిన రామబాణంలా-
ఆ 'ఎఱ్ఱత్రికోణం' దుసుము తున్నది
ఆ 'అగ్నికణం' బుగ్గిచేస్తున్నది-సుమశరుని సోయగాన్ని
మానవ ప్రగతి, నాగరికతల కిది దర్పణం
మా కొద్దు ఈ ఎఱ్ఱ త్రికోణం-
ఈ 'ప్రాజా పత్యం'-అని
హూంకరించిన నాడు-
నీ బతుకవుతుంది-కన్నీటి పాట !
నిట్టూర్పుల 'తోట'



# ప్రొబేషనుపద్ధతి - నూతన సంస్కరణ

అలీ అక్బర్ అహమద్

నేరస్థుని వక్రమార్గమునుండి తప్పించుటకు, ఆదినుండి వివిధ ప్రభుత్వములు వివిధమైన పద్ధతుల నవలంబించినవి. అందులో ముఖ్యముగా శిక్ష, జైలు నివాసము, బాధలు, జుల్మానాలు మొదలగునవి. కాని ఇటీవల నాగరికతాభివృద్ధివల్లనేమి, ప్రజాస్వామ్య ప్రభుత్వదృక్పథంవల్లనేమి నేరస్థుల సమస్యను ఒక నూతన పంథాలో సంస్కరించవలెనని కొత్త దృక్పథము ఏర్పడినది. ఈ నూతన దృక్పథము వలన ఒక విషయము నిర్ధారణమయ్యెను. శిక్ష కేవలము నిందితుని శిక్షించుటకేనని అతనిని సక్రమమార్గములో పెట్టుటకుగాని వికాసవంతుని చేయుటకుగాని, ముఖ్యముగా అతనిలో మానసిక పరివర్తన తెచ్చుటకు తోడ్పడుటలేదని కారాగారము, శిక్ష, కేవలము తీవ్రమైన నేరములు చేసిన వారికేగాని లేక ముదిరిన నేరగాండ్రకేగాని, అల్పనేరస్థులకు, బాలనేరస్థులకు వర్తించకూడదని, మామూలు నేరస్థులకు, ప్రథమనేరస్థులకు శిక్ష విధించేబదులు విడుదల గావించి అతనిలో పశ్చాత్తాపము, పరివర్తన తెచ్చేపద్ధతి ఒకటి వుంటే బాగుండునని కూడ రూఢి అయ్యెను. నేరస్థునిలో యీ మానసిక పరివర్తన తెచ్చుటకు జైలు సంస్కరణలో ముఖ్యమైనది ప్రొబేషన్ పద్ధతి. ఇది మొట్టమొదట బాలనేరస్థుల గురించి ప్రవేశపెట్టబడినది. కాని రానురాను యువనేరస్థులకు యిప్పుడు వయసు పరిమితి లేకుండా ప్రతి నేరస్థునకు వర్తించునట్లు కొత్త చట్టరీత్యా అమలులోకి తేబడెను.

ప్రొబేషన్ పద్ధతి ప్రకారము న్యాయాధికారి దృక్పథములో కూడ ఒక మార్పుండవలెను. అసలు న్యాయస్థానంలో ముఖ్య అంశము నేరము రుజువయ్యెనా లేదాయని. ఇక శిక్ష కూడ దానిని బట్టే యుండును. ప్రొబేషన్ పద్ధతి ప్రకారము ముఖ్యమైనది నేరస్థుని గురించి అన్వేషణ. న్యాయాధికారి కేసు పరిష్కరించే ముందు ముద్దాయి గురించి ఒక రిపోర్టు యిమ్మని ప్రొబేషన్ ఆఫీసరును కోరును. న్యాయాధికారి ఆజ్ఞ మీద ప్రొబేషన్ ఆఫీసరు నేరస్థుని గురించి పరిశోధన చేసి సవిస్తరముగ ఒక వివరణ పత్రము కోర్టుకు సమర్పించును. ఈ పత్రములో నేరస్థుని వివిధ విషయములు అనగా బాల్యము, ఉనికి, వాతావరణము, చదువు, కుటుంబపరిస్థితి, ఆర్థికపరిస్థితి, తల్లిదండ్రుల నడవడి, ఇరుగు పొరుగు, అతడు నేరముచేయుటకు కారణములు, మొదలగు అనేక విషయములు కోర్టువారికి తెలియపర్చును. ఇంతేగాక నిందితుడు తానుచేసిన నేరానికి పశ్చాత్తాపపడి తిరిగి ఎన్నడూ నేరము చేయడని గట్టినమ్మకమున్నచో ప్రొబేషన్ ఆఫీసరు కోర్టు వారిని ఆ నేరస్థుని విడుదల చేయవచ్చునని కూడా తన రిపోర్టులో సలహా నిచ్చును. న్యాయాధికారి ప్రొబేషన్ ఆఫీసరు రిపోర్టును బాగా అవగాహన చేసుకొని నేరస్థుడు నిజంగా పశ్చాత్తాపము పడ్డాడని అతనిని సంస్కరణాలయమునకు పంపుటకు బదులు వదలి పెట్టితే బాగుపడే అవకాశములున్నవని గట్టి నమ్మకము కుదిరితే వెంటనే ఆ నేరస్థుని ఒక నియమిత కాలమువరకు సత్ప్రవర్తన కలిగి ఉండాలనే షరతు మీద విడుదల చేయును. ఈ నియమితకాలము నేరసునకు పరీక్షాకాలమువంటిది. ఈ గడువులో ఏ అవాంతరము లేకుండా సత్ప్రివర్తనగా మెలగడమే ప్రొబేషన్ పద్ధతి. ఇంతేగాక వట్టిగా వదలిపెట్టే బదులు ప్రొబేషన్ ఆఫీసరుయొక్క పర్యవేక్షణ క్రింద

పెట్టితే బాగుండునని తోచినచో కోర్టు ఆ నియమిత కాలమువరకు నేరస్థుని ప్రొబేషన్ ఆఫీసరుయొక్క పర్యవేక్షణలో వుంచును.

పర్యవేక్షణలో పెట్టుటకు కోర్టుయొక్క ముఖ్యలక్ష్యములు నేరస్థుడు నిజంగా అపరాధమును అర్థము చేసుకొని మళ్లీ తిరిగి నేరము చేయకుండా వుండునని, అతడు నిజంగా పశ్చాత్తాపము పడ్డాడని, శిక్ష విధించేబదులు అతనిని ప్రొబేషన్ ఆఫీసరు అజమాయిషీలో వుంచే అతని విద్య, సంపాదన, తల్లిదండ్రులకు సహాయము మొదలగునవి ప్రొబేషన్ ఆఫీసరు ద్వారా జరుగుననియు.

పై లక్ష్యముల పరికారము కోర్టు నియమించే గడువులో (ప్రొబేషన్ కాలములో) నేరస్థుని సక్రమ మార్గములో తీసుకొని రావడము ప్రొబేషన్ ఆఫీసరుయొక్క ముఖ్య విధుల్లో ఒకటి— ముందే కోర్టుకు ఒక రిపోర్టు పంపునుగాబట్టి తన అజమాయిషీలో పెట్టబడిన ప్రతి ప్రొబేషనర్ యొక్క మంచి చెడ్డలు ప్రొబేషన్ ఆఫీసరుకు బాగా తెలిసియుండును. ఈ ప్రొబేషనర్లలో రకరకాల మనస్తత్వము కలవారుందురు. కావున వారిని సక్రమ మార్గములో పెట్టుటకు కొన్ని ముఖ్య విషయములందు శ్రద్ధ తీసుకొనును. ముఖ్యముగా యిరుగుపొరుగు అతని స్నేహితులు, తెలివితేటలు, చదువుయందు శ్రద్ధ కలదా లేక పనిచేయుటయందా, ఆటలంటే ఆసక్తి కలదా, కళలయందు అభిరుచి కలదా, ఒకవేళ వున్నవాటిని అమలులో పెట్టే అవకాశము కలదా, తల్లిదండ్రుల ప్రేమ యున్నదా లేక అతనికి ప్రేమ కొరత కలదా లేక సంపాదనంటే ఇష్టమున్నదా మొదలగు అనేక విషయముల నాలోచించి అతనికి యే విధముగా సలహా ఇచ్చిన అతను బాగుపడునో ఆ విధముగా మెలగును. తరుచు ప్రొబేషనర్లను కలసి అతడే విధముగా ఉంటున్నాడో పరిశీలించును. అతడు పనిచేయు స్థలమునకు కూడా వెళ్లి పని శ్రద్ధగ చేయుచున్నాడో లేదో ఆలోచించును. అవసరమైనచో అతని వృత్తి కూడా మార్పించును. లేదా కొత్త వృత్తి సంపాదించుటకు సహాయపడును. కొందరి విషయములో తల్లిదండ్రులు బంధువులనుకూడ కలసి ప్రొబేషనర్ల యొక్క కష్టసుఖముల నాలోచించును. మరికొన్ని కేసులలో తల్లిదండ్రుల నిర్లక్ష్యమైనచో నిందితుని కంటే అతని తల్లిదండ్రులను సంస్కరించే అవసరముండును. దీని మూలముగ నేరస్థునికి జీవితములో తనను సానుభూతితో చూచే ఒకవ్యక్తిగలడని ఆశ జనించును. చట్టరీత్యా యీ విధముగ పర్యవేక్షణ క్రింద పెట్టబడిన వ్యక్తులకు అవసరమైనచో ఆర్థిక సహాయము కూడ యిచ్చే అవకాశము యిటీవల కల్పించ బడినది.

ప్రొబేషన్ పద్ధతిలో ఒక ముఖ్య అంశము నేరస్థుని నేరగానిగా పరిగణించకపోవడము. అతనికి దొంగయని యేమాత్రము మచ్చ ఉండదు. మరియు సమాజంలో మామూలు పౌరునికున్న అన్ని హక్కులుండును. ఈ సదుపాయములు చట్టములోనే విధించబడినవి. ప్రొబేషన్ ఆఫీసరు తన అజమాయిషీలో ఉన్న ప్రతి ప్రొబేషనర్ గురించి ప్రతినెల అతని ప్రవర్తన, అతనిలో అభివృద్ధి గురించి కోర్టుకు నియమించిన గడువు ఆఖరయ్యేవరకు రిపోర్టులు పంపించుతూ వుండును. అతని నడక సరిగా లేకపోయినచో వెంటనే కోర్టుకు తెలియపర్చును. ప్రొబేషన్ అంటే కేవలము వదిలివేయటమని చాలా మదిలో అపోహ కలదు. అటులకాదు. నియమిత కాలములో తిరిగి యేదైన తప్పులుచేసిన యెడల మొదట యేశిక్ష యివ్వవలసియుండునో అది యివ్వబడును. అంటే శిక్ష తాత్కాలికముగ ఆపి నేరస్థునకు బాగుపడే అవకాశము యివ్వటమన్నమాట. ఇటీవల జైలు శాఖలో ఖైదీల గురించి కొత్త సంస్కరణలు ప్రవేశపెట్టబడినవి. వాటివలన ప్రొబేషన్ ఆఫీసర్ల విధులు చాలా పెరిగినవి. కేవలము కోర్టునుండి విడుదలైన వ్యక్తులకేగాక విముక్త ఖైదీలు, సంస్కరణాలయము నుండి వచ్చే బాలుర (బాలికలు)ను కూడ పర్యవేక్షణ చేయవలసి వస్తుంది. ఇతే గాక పెరోలు, ఫర్లోగడువుకు ముందు విడువబడే ఖైదీలు, లైసెన్సు మీద విడువబడే బాల బాలికల గురించి కూడ శ్రద్ధ తీసుకొనవలసి వస్తుంది. ఆపై విడుదలైన యెడల తిరిగి వారిని పర్యవేక్షణ చేయాలి. ఇట్టి పరిస్థితులలో ప్రొబేషన్ ఆఫీసరు యొక్క విధులు అతిముఖ్యమైనవి. మరియు కష్టతరమైనవని చెప్పవచ్చు. ఒకప్పుడు ఖైదీసహాయక సంఘాల ద్వారా విముక్తి ఖైదీలను చూచుటకు నియమితులైన ప్రొబేషన్ ఆఫీసర్లు ఇప్పుడు చట్ట రీత్యా నియమింప బడుచున్నారు. విద్య, విజ్ఞానము, వికాసం, సంస్కృతి, సానుభూతి, మానసిక సాంఘికశాస్త్రముల తర్ఫీదుగల వారే యీ ఉద్యోగమునకు న్యాయము చేకూర్చగలరు.

మన దేశములో నేరస్థుల అందులో బాల నేరస్థుల, సంఖ్య రోజురోజు పెరుగుతున్నది. దీనికి కారణము పేదరికము, చదువు లేనితనము, నిరుద్యోగము, ముఖ్యంగా సమాజంలో జరుగుతున్న అనేక మార్పులు మొదలైనవి. ఇట్టి పరిస్థితులలో నేరస్థులందరిని జైళ్లకు, సర్టిఫైడ్ స్కూళ్ళకు నిజంగా పంపితే వీరిపోషణ గురించి ప్రభుత్వమునకు యెంతవ్యయమగునో చెప్పలేము. ఇటీవల సేకరించిన లెక్కల ప్రకారము మన దేశములో జైళ్ల నడుపుటకు సాలీనా 2,500 లక్షలగుచున్నవని అంచనా. కాని ప్రొబేషన్ పద్ధతి ప్రకారము శిక్షితుల పోషణఖర్చు మిగుల్చుటయేగాక అతనిని సమాజములో ఒక వ్యక్తిగా చేయుట సాధ్యపడును. సమాజములో పడిపోయిన మానవుని తిరిగి ఒక వ్యక్తిగా చేయడము ఒక మహోత్తరమైన కార్యము. ఇటువంటి కార్యమునకు పాటుపడే ప్రతి ప్రొబేషన్ ఆఫీసరుకు మానసిక సాంఘిక శాస్త్రములందు శిక్షణ అవసరము (ఈ విధముగా శిక్షణయిచ్చే కేంద్రాలు మన దేశములో చాలతక్కువ). వారి ప్రమాణమునకు తగిన సౌకర్యము లివ్వాలి. మన దేశములో ఇటువంటి ముఖ్యమైన సంస్కరణకు యింకా సరియైన ప్రాధాన్యత లేదు. చాలమందికి ప్రొబేషన్ పద్ధతి అంటే యేమిటో తెలియదు. అసలు ప్రొబేషన్‌కు ప్రొహిబిషన్‌కు తేడా కూడ తెలియదు. నిజంగా నేరస్థుల సమస్య సానుభూతితో పరిష్కరించాలంటే ప్రొబేషన్ పద్ధతి బాగ అమలులోకి రావాలి. బాలనేరస్థులకు రిమాండు హోంలు, జువెనైల్ కోర్టులు వేరే ఉండాలి. తగినన్ని ప్రొబేషన్ హాస్టల్సు కూడ నెలకొల్పాలి. దానికి న్యాయస్థానములలో పోలీసు శాఖలో జైళ్ల శాఖలో ముఖ్యముగ ప్రజలలో ఒక వికాసము రావాలి. అది వచ్చినప్పుడే దేశములో నేరనిరోధికమునకు ప్రొబేషన్ పద్ధతికి జయము కలుగును. 



గవర్నరు సలహాదారు శ్రీ హెచ్. సి. సరీన్ మే నెలలో విశాఖ పట్నంలో నెహ్రూనగర్‌కు శంకుస్థాపన చేశారు.

## యామాయ కుంటలో యువజన శిబిరం

ఆదిలాబాదు జిల్లా పోలీసు సూపరింటెండెంటు, శ్రీ కె. సదాశివరావు మే 24న యామాయ కుంటలో యువజన శిబిరానికి ప్రారంభోత్సవం చేశారు. ఈ సందర్భంగా ఆయన ప్రసంగిస్తూ యువకులు ఉత్సాహంతో పాల్గొని యీ కార్యక్రమాన్ని విజయవంతం చేయాలని ఉద్బోధించారు.

సమావేశానికి అధ్యక్షత వహించిన ఆర్.డి.ఓ. శ్రీ పి. రాధాకృష్ణనాయుడు ప్రసంగిస్తూ ప్రజలను అర్థం చేసుకుని వారికొరకు కృషి చేయాలని యువకులను కోరారు.

అంతకుముందు శిబిరం నిర్వాహకులు శ్రీరామానాయుడు, ముఖ్య అతిథికి స్వాగతం చెప్పారు.

## ఉత్తమ గ్రామ పంచాయతీ

కడప జిల్లాలో రాజంపేట గ్రామపంచాయతీని రాష్ట్రంలో రెండవ ఉత్తమ గ్రామ పంచాయతీగా ఏంపిక చేయబడినట్లు కలక్టరు తెల్పారు. ఇటువంటి ఫలితాలను సాధించినందుకు గ్రామపంచాయతీ సర్పంచ్‌ను కలక్టరు అభినందిస్తూ మచిలీపట్నంలో ప్రత్యేకంగా జరిగే ఉత్సవంలో బహుమతికి చెందిన రూ. 500/—లను ప్రదానం చేయడం జరుగుతుందని అన్నారు.

## ప్రకాశం పంతులు హైస్కూలు భవనానికి శ్రీ సరీన్ శంకుస్థాపన

గవర్నరు సలహాదారు శ్రీ హెచ్. సి. సరీన్, తిరుపతిలో జూన్ 11న రూ. 2.75 లక్షల ఖర్చయ్యే శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులు పురపాలక సంఘం ఉన్నత పాఠశాల భవనానికి శంకుస్థాపన చేస్తూ, ప్రకాశం పంతులుగారు ఒక్క ఆంధ్రమాత పుత్రులు మాత్రమే గాదు, యావద్భారత దేశానికి చెందిన భారతమాత వీర కుమారులు అని అభివర్ణించారు. ప్రకాశం పంతులుగారి పేరుతో నిర్మించనున్న భవనాలకు శంకుస్థాపన చేయడం తనకెంతో గర్వకారణమన్నారు. ప్రకాశం పంతులుగారి శతజయంతి ఉత్సవ సమయంలో మంచి భవనాలు, పరికరాలు, సిబ్బంది, తదితర సౌకర్యాలను కల్పించి, విద్యాస్థాయిని పెంచడానికి ప్రభుత్వం చాలా ఆసక్తితో ఉన్నట్లు ఆయన తెలియజేశారు. తిరుపతిని అభివృద్ధి చేయడంలో దేవస్థానం అధికారులు యింకా ఎక్కువ శ్రద్ధ వహించాలని పేర్కొన్నారు. తిరుచానూరులో పద్మావతీదేవి అమ్మవారిని శ్రీ సరీన్ దర్శించారు.



అనంతరం, మోపెడ్స్ ఇండియా సైకిల్ ఫ్యాక్టరీకి సంబంధించిన ఒక అనుబంధ సహాయక యూనిటు 'ఆంధ్రా ఇంజనీరింగ్ వర్క్స్' కు శ్రీ శరీన్ ప్రారంభోత్సవం చేశారు.

## నెల్లూరులో షెడ్యూలు కులాల వారికి కాలనీ

పంచాయతీరాజ్ శాఖ కార్యదర్శి శ్రీ పి. ఎల్. శివరామ్ జూన్ 7 న ఆదర్శనగర్ హౌసింగ్ కాలనీకి ప్రారంభోత్సవం చేశారు. ఈ కాలనీలో 20 యిళ్ళు వున్నాయి. ఒక్కొక్క ఇంటి నిర్మాణానికి 18 వేల రూపాయలు ఖర్చయ్యింది. షెడ్యూలు కులాలు, షెడ్యూలు తెగల రాష్ట్ర సమాఖ్య ద్వారా జీవిత భీమా సంస్థ అందజేసిన ఋణ సహాయంతో నెల్లూరుజిల్లా షెడ్యూలు కులాలు షెడ్యూలుతెగలు సహకార గృహనిర్మాణ సఘం ఈ యిళ్ళను నిర్మించింది. ఈ పథకం క్రింద 1,700 యిళ్ళను నిర్మించేందుకై 1972-73 లో నెల్లూరుజిల్లాకు రూ.32.58 లక్షలు మంజూరయ్యాయి. జీవితభీమా సంస్థ యిచ్చిన ఋణాన్ని, ఆ యిళ్ళు పొందినవారు 20 ఏళ్ళలో తేలిక వాయిదాలపద్ధతిన తిరిగి చెల్లించవలసి వుంటుంది.

## కొండూరులో హరిజన, గిరిజన కాలనీలకు ప్రారంభోత్సవం

కడపజిల్లా కలెక్టరు శ్రీ వి. చంద్రమౌళి ఇటీవల రాజంపేట సమితిలోని కొండూరులో లాల్‌బహదూరు శాస్త్రి హరిజన కాలనీకి, చంద్రమౌళి గిరిజన కాలనీకి ప్రారంభోత్సవం చేశారు. ఆ సందర్భంలో ఆయన మాట్లాడుతూ బలహీన వర్గాలవారి సంక్షేమానికి అమలు పరచబడుతున్న వివిధ ఆర్థికాభివృద్ధి పథకాలను గురించి పేర్కొన్నారు. చిన్నరైతుల అభివృద్ధి ఏజన్సీద్వారా ఆర్థికసహాయం పొందడానికి రాజంపేటలోని రైతుల రిఫైనాన్స్ కోపరేటివ్ సొసైటీలో సభ్యులుగా నమోదు కావలసినదిగా చిన్నరైతులకు, వ్యవసాయ కార్మికులకు ఆయన సలహాయిచ్చారు.

## పశువైద్యశాలకు కేంద్రమంత్రి ప్రారంభోత్సవం

కేంద్ర పార్లమెంటరీ వ్యవహారాల శాఖమంత్రి శ్రీ కె. రఘురామయ్య, జూన్ 16న తాడికొండలో రు. 45,000ల ఖర్చుతో నిర్మించబడిన పశు వైద్యశాలకు ప్రారంభోత్సవం చేశారు. ఈ సందర్భంగా ఆయన ప్రసంగిస్తూ తాడికొండ—మంగళగిరి మధ్య రోడ్డు నిర్మాణానికి రు. 30 లక్షలు మంజూరు చేశారనీ, త్వరలోనే నిర్మాణం పని చేబట్టబడుతుందనీ అన్నారు. దీనివల్ల 15 గ్రామాలకు చెందిన ప్రజలకు లాభం కలుగుతుంది.

పశువైద్యశాఖ డైరెక్టరు డా. ఏ. ఆర్. షిరాజీ ప్రసంగిస్తూ ఐదవ ప్రణాళికలో యీ చికిత్సాలయాన్ని రెగులర్ ఆసుపత్రిగా మారుస్తారని అన్నారు. రాష్ట్రంలో శ్వేతవిప్లవం సాధించడానికి కోళ్ల పెంపకం పాడిక్షేత్రం పనులను విరివిగా చేపట్టాలని ప్రజలకు ఆయన విజ్ఞప్తి చేశారు. అంతకుముందు ఆయన శ్రీ వై. లింగయ్య చిత్రపటాన్ని ఆవిష్కరించారు. ఆసుపత్రి నిర్మాణం నిమిత్తం శ్రీ లింగయ్య రు. 45,000 విరాళంగా యిచ్చారు. గుంటూరు జిల్లాలో 60 పశువైద్యశాలలు నిర్వహించ బడుతున్నాయనీ, అవి 25,000 పశువుల అవసరాలను తీరుస్తున్నాయనీ డైరెక్టరు అన్నారు. ఐదవ ప్రణాళికలో సిబ్బందిని ఎక్కువచేసి తద్వారా ఉన్న సిబ్బంది పనిభారాన్ని తగ్గించడం జరుగుతుందని వెల్లడించారు.

సమావేశానికి అధ్యక్షత వహించిన శాసనసభ్యులు శ్రీ జి. వి. రత్నయ్య ప్రసంగిస్తూ యీ చికిత్సాలయాన్ని రెగ్యులర్ ఆసుపత్రిగా మార్చాలని ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశారు.

## పెదమద్దూరు లిఫ్ట్ ఇరిగేషన్‌కు శంఖుస్థాపన

కేంద్ర పార్లమెంటరీ వ్యవహారాల మంత్రి శ్రీ కె. రఘురామయ్య జూన్ 16న పెదమద్దూరు సమీపంలో లిఫ్ట్ ఇరిగేషన్ పథకానికి శంఖుస్థాపన చేశారు. ఈ సందర్భంగా ఆయన ప్రసంగిస్తూ యుద్ధ ప్రాతిపదికపై యిప్పుడు పథకాలను అమలు జరుపుతున్న దృష్ట్యా ఏవీ యిప్పుడు కేవలం పథకాలుగానే ఉండిపోవని అన్నారు.

ఉత్సవానికి అధ్యక్షత వహించిన శాసన సభ్యులు శ్రీ జి. వి. రత్నయ్య ప్రసంగిస్తూ ఈ పథకంద్వారా పెదమద్దూరు, అమరావతి, వైకుంఠపురంలలో 1100 ఎకరాలకు నీటిపారుదల సౌకర్యం లభిస్తుందని అన్నారు.

## చందుపట్లలో ఖరీఫ్‌పంట ప్రదర్శక క్షేత్రం

నల్లగొండ జిల్లా, భువనగిరి సబ్ కలక్టరు శ్రీ ఎ. ఎస్. తివారీ, యిటీవల నల్లగొండ జిల్లా చందుపట్ల గ్రామంలో 30 మంది మధ్యతరహా రైతులకు ఒక్కొక్కరికి రు. 150/-ల విలువచేసే అధిక దిగుబడి వరి, జొన్న, ఆముదం విత్తనాలను-ఎరువులను పంపిణీ చేశారు. వాటిద్వారా నల్లగొండలోని సన్నకారు రైతుల అభివృద్ధి సంస్థ ఆధ్వర్యంలో 20 వరి, 5 జొన్న, 5 ఆముదం పంటల ప్రదర్శక క్షేత్రాలను నిర్వహిస్తున్నారు.

## సంగారెడ్డిలో అధిక దిగుబడి వంగడాలు వాడకం

మెదకు జిల్లాలో 20,000 హెక్టార్లలో అధిక దిగుబడి వరి, 8,000 హెక్టార్లలో సంకరజాతి జొన్న వేయడానికి విస్తృతమైన ఏర్పాట్లు చేయడం జరిగిందని మెదకు జిల్లా కలక్టరు శ్రీ ఎస్. పేమయ్య యిటీవల అన్నారు. పెద్ద ఎత్తున సంకరజాతి వంగడాలను వాడడానికి వీలుగా కృష్ణా, గుంటూరు, గోదావరి, చిత్తూరు జిల్లాలనుండి 489 మెట్రిక్ టన్నుల జొన్న తెప్పించటం జరిగిందని ఆయన తెలియజేశారు.



జూన్ 10 వ తేదీన తిరుపతిలో ప్రకాశం పంతులు మునిసిపల్ హైస్కూలు భవనానికి గవర్నరు సలహాదారు శ్రీ హెచ్ సి సరీన్ శంఖుస్థాపన చేశారు

ప్రతి పంచాయతీ సమితికి స్వల్పకాలిక ఋణంగా ఒక లక్ష రూపాయల చొప్పున మొత్తం రు 10 లక్షలు పంపిణీ చేయడానికి ఏర్పాట్లు జరుగుతున్నాయని, దానితోడు వాణిజ్య బ్యాంకులు సహకార బ్యాంకులుకూడా స్వల్పకాలం ఋణాలు మంజూరు చేస్తున్నాయనీ కలక్టరు అన్నారు

## జిల్లిలో సహకార వ్యవసాయ సంఘానికి శ్రీ సరీన్ ప్రారంభోత్సవం

ఆంధ్రప్రదేశ్ గవర్నరు సలహాదారు శ్రీ హెచ్ సి సరీన్ జూన్ 19 వ వరంగల్లుజిల్లా జిల్లిలో సహకార వ్యవసాయ సంఘానికి ప్రారంభోత్సవం చేస్తూ పేదప్రజల జీవనపరిస్థితులను మెరుగుపర్చడానికి కేంద్ర, రాష్ట్రప్రభుత్వాలు ఆత్రంతతో ఉన్నాయని అన్నారు గ్రామస్థులకు, ముఖ్యంగా బలహీనవర్గాల ప్రజలకు సహాయపడడానికి ప్రభుత్వం తమకు సాధ్యమైనదంతాచేస్తున్నదని ఆయన అన్నారు సన్నకారు మధ్యతరహా రైతులకు విత్తనాలు, ఎరువులు, క్రిమిసంహారక మందులు సరఫరా చేయడానికి రాష్ట్రప్రభుత్వం రు 10 కోట్లు కేటాయించిందని ఆయన తెలియజేశారు

ఆ తరువాత శ్రీ సరీన్, రు 70,000 లతో కొనుగోలు చేసిన 12 విద్యుచ్ఛక్తి మోటార్లు, 8 ఆయిల్ యింజనులను సభ్యులకు పంపిణీచేశారు ఖరీఫ్‌కాలంలో 675 ఎకరాలలో అధికదిగుబడి వంగడాలనుఉపయోగించే కార్యక్రమం చేపట్టాలని ప్రతిపాదించారు

జిల్లా కలెక్టరు శ్రీ మాధవరావు ప్రసంగిస్తూ, జిల్లాలో యిటువంటి 11 సహకార వ్యవసాయ సంఘాలు పనిచేస్తున్నాయని అన్నారు

## రెండు హరిజన కాలనీలకు శ్రీ సరీన్ ప్రారంభోత్సవం

శ్రీ సరీన్ జూన్ 19న వరంగల్లుజిల్లా జిల్లిలో రెండు హరిజన గృహాల కాలనీలకు ప్రారంభోత్సవం చేశారు ఒక కాలనీలో 44 గృహాలు, మరొక కాలనీలో 44 గృహాలు ఉన్నాయి రు 1,62,000ల ఖర్చుతో వాటి నిర్మాణాన్ని చేపట్టారు ఆ తర్వాత శ్రీ సరీన్ హన్మకొండలో సర్క్యూట్ భవనానికి ప్రారంభోత్సవం చేశారు రు 265,000ల ఖర్చుతో యీ భవనం నిర్మించారు

## గిరిజన కార్పొరేషన్ గిడ్డంగికి శ్రీ సరీన్ ప్రారంభోత్సవం

గవర్నరు సలహాదారు శ్రీ హెచ్. సి. సరీన్, జూన్ 19న వరంగల్లుజిల్లా నరసంపేట తాలూకాలోని కొత్తగూడెంలో గిరిజన కార్పొరేషన్ గిడ్డంగికి ప్రారంభోత్సవం చేస్తూ గిరిజన జీవన ప్రమాణాల పెంపుదలకు అమలు జరుపుతున్న వివిధ సంక్షేమ పథకాలద్వారా ప్రయోజనం పొందాలని గిరిజనులకు ఉద్బోధించారు.

## కరీంనగర్‌లో చిన్న పారిశ్రామిక వేత్తల, రైతుల, వృత్తి పనివారల అభివృద్ధి సంస్థ

గవర్నరు సలహాదారు శ్రీ హెచ్. సి. సరీన్, కరీంనగర్‌లో కరీంనగర్ చిన్న పారిశ్రామికవేత్తల, రైతుల, వృత్తి పనివారల అభివృద్ధి సంస్థకు ప్రారంభోత్సవం చేస్తూ కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు, హరిజన, వెనుకబడిన, యితర బలహీనవర్గాల ప్రజల పునరుద్ధరణకు కృతనిశ్చయంతో కృషిచేస్తున్నాయని అన్నారు. అభివృద్ధి ఫలితాలు బడుగు వర్గాల ప్రజలకు చేరనిదే దేశం సౌభాగ్యవంతం కాలేదని పేర్కొన్నారు.

బీద ప్రజలకు అది పర్వదినం. బలహీన వర్గాలకు ఆర్థిక సహాయం కార్యక్రమం క్రింద హరిజనులు, రిక్షావారు, ఆటోరిక్షా డ్రైవర్లు, రైతులు, క్షురకర్మ కారులు అక్కడ చెక్కులను, ఋణాల మంజూరీ పత్రాలను శ్రీ సరీన్‌నుండి పొందడానికి బారులుగా నిల్చుని ఉన్నారు. కరీంనగరంలో 14 టాక్సీలు, 40 సైకిల్ రిక్షాలు, 20 మందికి క్షురకర్మ పరికరాల కొనుగోలుకుడబ్బు పంపిణీ చేయడంజరిగింది. పాడి పరిశ్రమ పథకాల క్రింద 62 మంది హరిజనులకు మంజూరీ పత్రాలు, హరిజన రైతులకు 50 మినీకిట్స్ యివ్వడంజరిగింది.

ఆ తర్వాత శ్రీ సరీన్ కరీంగర్ మునిసిపల్ వాటర్ వర్క్సులో ఎలివేటర్ రిజర్వాయరు, బూస్టర్ పంపులకు ప్రారంభోత్సవం చేశారు. పట్టణంలో మంచినీటి సరఫరా చేయడానికి రు 8లక్షల ఖర్చుతో కూడిన పథకాన్ని అమలు జరుపుతున్నారని మునిసిపాలిటీ అధ్యక్షులు అన్నారు.

## విద్యుచ్ఛక్తి పరికరాల ఫ్యాక్టరీకి ప్రారంభోత్సవం

గవర్నరు సలహాదారు శ్రీ హెచ్. సి. సరీన్, జూన్ 20 న వరంగల్లు జిల్లా ధర్మవరంలో విద్యుచ్ఛక్తి పరికరాల ఫ్యాక్టరీకి ప్రారంభోత్సవం చేశారు. ఈ సందర్భంగా ఆయన ప్రసంగిస్తూ దేశం అభివృద్ధి చెందాలంటే దేశంలోని నలు మూలలకూ పరిశ్రమలను విస్తరింప జేయాలని అన్నారు. దేశంలోని యితర పరిశ్రమలతో పోటీని తట్టుకోవడానికి వీలుగా నాణ్యమైన సరకులను ఉత్పత్తి చేయాలని సలహా యిచ్చారు.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర లఘుపరిశ్రమల అభివృద్ధి కార్పొరేషన్, మరో పారిశ్రామిక వేత్త సంయుక్త అధ్వర్యంలో రు. 11 లక్షల పెట్టుబడితో యీ యూనిటు ప్రారంభించబడింది. ఇక్కడ ఉత్పత్తి అయిన పరికరాలన్నిటినీ యితర దేశాలకు ఎగుమతి చేయడం ప్రత్యేకమైన అంశంగా పేర్కొనవచ్చు.

ఆ తర్వాత శ్రీ సరీన్, వరంగల్లు సమీపంలో గోపాలపురంగ్రామంలో ఓరుగల్లు గ్యాస్‌ఫ్యాక్టరీకి ప్రారంభోత్సవం చేశారు

## ప్రొద్దుటూరులో 17 పడకల ట్యూబెర్క్యులోసిస్ వార్డు

కడప జిల్లా కలెక్టరు శ్రీ వి. చంద్రమౌళి, జూన్ 13 న ప్రొద్దుటూరు ప్రభుత్వ ఆసుపత్రిలో రూ 1.02 లక్షల ఖర్చుతో నిర్మించబడిన 17 పడకల ట్యూబెర్క్యులోసిస్ వార్డుకు ప్రారంభోత్సవం చేస్తూ, ధనవంతులు విరివిగా విరాళాలు ఇచ్చి ప్రజలకు మరింత ప్రయోజనకరంగా ఉపకరించడానికి వీలుగా ఆసుపత్రిని అభివృద్ధి పర్చడంలో తోడ్పడాలని వారికి విజ్ఞప్తి చేశారు ఉత్సవానికి అధ్యక్షత వహించిన జిల్లా రెవిన్యూ అధికారి కెప్టెన్ టి. జె. సాలమన్ ప్రసంగిస్తూ కుటుంబ నియంత్రణ కార్యక్రమాలకు ప్రజలు సహాయ పడాలని కోరారు.

శాసన సభ్యులు శ్రీ కొప్పరపు సుబ్బారావు ప్రసంగిస్తూ ఆసుపత్రిలో పిల్లల చికిత్సా విభాగం నిర్మించడానికి శ్రీ వెంకటేశ్వర మెడికల్ స్టోర్ భాగస్థుడు శ్రీభూపాళం సుబ్బారాయుడు రు 10,000/- లు విరాళంగా యివ్వడానికి సిద్ధంగా ఉన్నారని అన్నారు.

## అనంతవరప్పాడులో ఎలిమెంటరీ పాఠశాల

కేంద్ర పార్లమెంటరీ వ్యవహారాల శాఖ మంత్రి శ్రీ కె. రఘురామయ్య, జూన్ 19 న గుంటూరు జిల్లా అనంతవరప్పాడులో ఎలిమెంటరీ పాఠశాలభవనానికి ప్రారంభోత్సవం చేశారు. ఈ సందర్భంగా ఆయన ప్రసంగిస్తూ గుంటూరు తాలూకాలో త్వరలోనే క్లస్టర్ పథకం మంజూరు చేయబడుతుందని అన్నారు. కోటి రూపాయలతో నిర్మించబడిన జాతీయరహదారి రోడ్డుపై త్వరలోనే రాకపోకలకు అనుమతించడం జరుగుతుందని ఆయన అన్నారు. బీద ప్రజల, పీడిత ప్రజల సముద్ధరణకు ప్రధాన మంత్రి దశల వారీకార్యక్రమం అమలు జరపాలని ప్రయత్నిస్తున్నారని మంత్రి అన్నారు.

గుంటూరుమునిసిపల్ అధ్యక్షులు శ్రీసి. హెచ్. హనుమయ్య ఈఉత్సవానికి అధ్యక్షత వహించారు. పాఠశాల భవననిర్మాణానికి శ్రీ వి. నరసింహారావు ఒక ఎకరం భూమి, రూ 25000/లు విరాళంగా యిచ్చారు. గ్రామస్థులు రూ 30,000/లు యిచ్చారు. రూ. 70,000/ల ఖర్చుతో యీ భవనం నిర్మించబడింది.

## దేవర కొండ ప్రాంతంలో ఋణాల పంపిణీ

మహబూబునగర్ జిల్లా దేవరకొండ తాలూకా ఉసీహాలా రు ఆ పత్యాలకక్కావీ క్రింద 460 మంది చిన్నరైతులకు, రు 1,95,000/లు పంపిణీ చేశారనీ, దానితో 500 సేద్యపు బావులు లోతుచేయడం 50 సేద్యం — మంచినీటి బావులు త్రవ్వడం పనులను చేపట్టారనీ దేవరకొండ పంచాయతీ సమితి అధ్యక్షులు శ్రీ పల్లా పర్వత రెడ్డి తెలియజేశారు.

రైతులకు విత్తనాలు, క్రిమి సంహారకమందులు ఎరువులు సరఫరా చేయడానికి వీలుగా స్వల్పకాలిక ఋణం క్రింద రూ.1,90,000/లను, ఆముదాల ఉత్పత్తిచేసే రైతులకు ఎరువులు, ఆముదాల విత్తనాలు పంపిణీ చేయడానికి వీలుగా రు 1,54,000/-లను వ్యవసాయశాఖ కేటాయించిందని ఆయన అన్నారు. కరువునివారణ పనుల కార్యక్రమం క్రింద రోడ్లు నిర్మించడానికి రు 2,70,000/లు మంజూరైనట్లు కూడా ఆయన తెల్పారు.

## విప్పరాల లిఫ్ట్ ఇరిగేషన్‌కు త్వరలోనే మంజూరీ

కేంద్ర పార్లమెంటరీ వ్యవహారాలశాఖ మంత్రి శ్రీ కె. రఘురామయ్య జూన్ 20 న వేల్పూరులో ప్రసంగిస్తూ రు. 7 లక్షల ఖర్చుతో కూడిన విప్పరాల లిఫ్ట్ ఇరిగేషన్ పథకానికి త్వరలోనే మంజూరీలభిస్తుందని వెల్లడించారు. నాగార్జునసాగర్ ప్రాజెక్టును గూర్చి ప్రస్తావిస్తూ కాలువల ఆఖరులో ఉన్న ప్రజలు నీరు కావాలని అడుగుతున్నారనీ, ఎగువప్రాంతంలో ఉన వారు తమ భూములనుకూడా చేర్చుకోవాలని కోరుతున్నారని అన్నారు. గవర్నరు సలహాదారు శ్రీ హెచ్. సి. సరీన్ వచ్చే నెలలో యీ ప్రాంతంలో పర్యటించినప్పుడు యీ సమస్యలన్నిటిని పరిష్కరిస్తారనే ఆశాభావాన్ని ఆయన వెల్లడించారు. సోషలిస్టు వర్గాలన్నీ నూతన సోషలిస్టు పద్ధతిని ప్రవేశపెట్టడంలో ప్రధానమంత్రి శ్రీమతి గాంధీని పూర్తిగా బలపర్చాలని ఆయన విజ్ఞప్తి చేశారు.

## ఆర్థికవ్యత్యాసాలను తొలగించడానికి భూసంస్కరణలు

కేంద్ర పార్లమెంటరీ వ్యవహారాల మంత్రి శ్రీ కె. రఘురామయ్య జూన్ 21 న గుంటూరు జిల్లా పెదపాలెంలో జరిగిన బహిరంగ సభలో ప్రసంగిస్తూ బంగ్లాదేశ్, ధరల పెరుగుదల, భూసంస్క-



మే 29వ తేదీన విశాఖ జిల్లా పాయకరావుపేటలో హరిజన కాలనీకి గవర్నరు సలహాదారు శ్రీ హెచ్. సి. సరీన్ ప్రారంభోత్సవం చేశారు.

రణాలను గూర్చి విపులంగా వివరించారు. ధనిక, పేదప్రజల మధ్య గల ఆర్థిక వ్యత్యాసాలను తొలగించడానికి దేశమంతటా, భూపరిమితులు, ఆస్తుల పరిమితులను ప్రవేశపెడ్తారని ఆయన అన్నారు.

## ఒమ్మి గ్రామానికి విద్యుచ్ఛక్తి సరఫరా

విద్యుచ్ఛక్తి శాఖా చీఫ్ ఇంజనీరు శ్రీ ఎ. ఎల్. మోహన్‌రావు, యిటీవల శ్రీకాకుళం జిల్లా రాజాం సమితిలోని ఒమ్మి గ్రామంలో విద్యుచ్ఛక్తి సరఫరాకు ప్రారంభోత్సవం చేస్తూ, పాలకొండ, బొబ్బిలి తాలూకాలలో క్లస్టర్ పథకం క్రింద విద్యుచ్ఛక్తి సరఫరా చేస్తున్న గ్రామాలలో యింతవరకు యిది 29 వ గ్రామమని అన్నారు. ఈ గ్రామంలో విద్యుచ్ఛక్తి సరఫరాకు రు. 30,000 లు ఖర్చుఅయింది.

## హరిజనకాలనీ రక్షిత మంచినీటి సరఫరా పథకాలకు ప్రారంభోత్సవం

గవర్నరు సలహాదారు శ్రీ హెచ్. సి. సరీన్, నిజామాబాదు జిల్లా, సిరిసిల్ల పంచాయతీ సమితిలోని గంభీరరావుపేటలో జూన్ 22 న సంజీవయ్యనగర్ హరిజన కాలనీకి ప్రారంభోత్సవం చేశారు. రు. 1.35 లక్షల ఖర్చుతో 75 యిండ్లతో యీ కాలనీని నిర్మించారు. అదే గ్రామంలో రు. 6.7 లక్షల ఖర్చుతో అమలు జరిపిన రక్షిత మంచినీటి పథకానికి కూడా ఆయన ప్రారంభోత్సవం చేశారు.

శ్రీ సరీన్, 12 మంది రైతులకు అధికదిగుబడి వంగడాలు గల మినికిట్‌లను పంపిణీ చేశారు. పాడిపరిశ్రమ అభివృద్ధికి రు. 3,520 ల చొప్పున నాలుగు మంజూరీ పత్రాలను కూడా అందజేశారు.

## మల్లారంలో 33 కి. వా. సబ్ స్టేషన్

కరీంనగర్ జిల్లాలోని సిరిసిల్ల గ్రామానికి దగ్గరలో 33 కిలోవాట్ల సబ్‌స్టేషన్‌కు గవర్నరు సలహాదారు శ్రీ హెచ్. సి. సరీన్ శంకుస్థాపన చేస్తూ, ప్రజల అభ్యుదయానికై ప్రభుత్వం మంజూరు చేసే పథకాలను పూర్తిగా వినియోగించుకోవలసినదిగా ప్రజలకు విజ్ఞప్తి చేశారు. ఈ సబ్‌స్టేషనుకు సుమారుగా రూ. 7.62 లక్షలు ఖర్చవుతుంది. ఇది 30 గ్రామాలకు విద్యుచ్ఛక్తిని సరఫరా చేయగలుగుతుంది. కొత్త ఢిల్లీలోని గ్రామీణ విద్యుదీకరణ సంస్థ సిరిసిల్ల తాలూకాకు మంజూరు చేసిన రెండు సబ్‌స్టేషన్లలోనూ యిది ఒకటి.

రానున్న రెండేళ్ళలోనూ సిరిసిల్ల తాలూకాలోని 173 గ్రామాలకు విద్యుచ్ఛక్తి సౌకర్యం కల్పించబడుతుందని, ఇంత ఎక్కువ సంఖ్యలో విద్యుచ్ఛక్తి పొందుతున్న గ్రామాలు గల తాలూకా ఒక్క సిరిసిల్ల యేనని శ్రీ సరీన్ చెప్పారు. ఈ పథకం క్రింద 8,600 బావులకు వ్యవసాయపు పనులకు ఉపయోగించడానికి విద్యుచ్ఛక్తి లభిస్తుందనీ, 10,000 ఇళ్ళకు విద్యుచ్ఛక్తి సౌకర్యం అందుతుందని కూడా ఆయన తెలియజేశారు.

సిరిసిల్ల విద్యుచ్ఛక్తి సహకార సంఘం క్రింద యింతవరకు 130 గ్రామాలకు విద్యుచ్ఛక్తి సౌకర్యం కల్పించబడిందని జిల్లా కలెక్టరు శ్రీ వి. కె. శ్రీనివాసన్ తెలియజేశారు. బలహీనవర్గాల వారి సంక్షేమానికై అమలు పరచబడుతున్న వివిధ పథకాలను గురించి కూడా ఆయన వివరించారు.

## మోటూరు పంచాయతీ సమితి సభ్యుల సమావేశంలో శ్రీ వి. కె. రావు ప్రసంగం

గవర్నరు సలహాదారు, శ్రీ వి. కె. రావు, జూన్ 24 న కృష్ణాజిల్లా, మోటూరు పంచాయతీ సమితి సభ్యుల సమావేశంలో ప్రసంగిస్తూ అధిక దిగుబడి వరి వంగడాలను వినియోగించడంలో సమితి సభ్యులు కనబరుస్తున్న ఆసక్తికి తాను ముగ్ధుడనైనానని అన్నారు. రైతులకు సకాలంలో ఎరువులు అందజేయడానికి ప్రభుత్వం శాయశక్తులా కృషిచేస్తుందని ఆయన హామీ యిచ్చారు.

ఈ సందర్భంగా పంచాయతీ రాజ్ శాఖ కార్యదర్శి, శ్రీ పి. ఎల్. శివరామ్ ప్రసంగిస్తూ విద్యా విషయక పన్ను విషయంలో కృష్ణాజిల్లావారు విచిత్రమైన సమస్యను ఎదుర్కొంటున్నారని అన్నారు. సంబంధిత అధికారులతో చర్చించి త్వరలోనే యీ సమస్య పరిష్కరించడానికి కృషిచేస్తానని ఆయన హామీ యిచ్చారు.

1962 లో రాష్ట్ర స్థాయిలో ఉత్తమ పంచాయతీ సమితిగా మోటూరు పంచాయతీ సమితి ఎన్నుకోబడింది. అదే సమితిలోని గుడ్లవల్లేరు జాతీయ స్థాయి బహుమతిని సాధించింది.

## మల్లేపల్లిలో కొత్త బస్సు రూటుకు ప్రారంభోత్సవం

ఆర్. టి. సి. జనరల్ మేనేజరు శ్రీ అజిత్ సింగ్, యిటీవల సంగారెడ్డి తాలూకాలోని మల్లేపల్లిలో కొత్త బస్సురూటుకు ప్రారంభోత్సవం చేశారు. ఈ సందర్భంగా ఆయన ప్రసంగిస్తూ పెద్ద పట్టణాలకేగాక గ్రామాలకు సహితం బస్సులను నడపడానికి ఆర్. టి. సి. కృషిచేస్తున్నదని, అన్నారు. కరువు నివారణ పథకం క్రింద ముఖ్యమైన అన్ని గ్రామాలను కలుపుతూ రోడ్లు నిర్మింపజేసినందుకు కలక్టరు శ్రీ వేములను ఆయన అభినందించారు. బస్సుషెడ్‌ను మార్చడానికి నిర్ణయించారనీ, సంగారెడ్డిలో త్వరలోనే బస్సుడిపో ఏర్పాటు చేయబడుతుందనీ ఆయన అన్నారు. రు.60 కోట్ల ఖర్చుతో రూపొందించిన బృహత్తర పథకాన్ని ఐదవ పంచవర్ష ప్రణాళిక కాలంలో అమలు జరుపుతారని ఆయన పేర్కొన్నారు.

## రెండు హరిజన కుటుంబాలకు రెండు ఎడ్ల జతల పంపిణీ

అనంతపురం జిల్లా కల్యాణ దుర్గం పంచాయతీ సమితి అధ్యక్షులు, శ్రీ డి. ఎస్. చౌదరి, జూన్ 20 తేదీన కల్యాణ దుర్గంలో హరిజనులకు సాంఘిక సంక్షేమ సహాయం క్రింద గంగవరం గ్రామానికి చెందిన రెండు హరిజన కుటుంబాలకు రు. 1000/- లు విలువ చేసే రెండు ఎడ్ల జతలను పంపిణీచేశారు.

బి డి ఒ శ్రీ ఎం. సుబ్బారాయుడు యీ సందర్భంగా ప్రసంగిస్తూ హరిజనులకు అందజేసిన సహాయంతో అధిక ఆహార ఉత్పత్తికి కృషిచేయాలని అన్నారు

## పాలకొల్లులోని పశు వైద్యశాలలో అదనపు సౌకర్యాలు

పశ్చిమ గోదావరి జిల్లా పాలకొల్లులోని పశువైద్యశాలలో లయన్సు క్లబ్ వారు రు 38,000/- ల ఖరుతో కల్పించిన అదనపు సౌకర్యాలకు జిల్లా కలక్టరు శ్రీ ఎస్ ఆర్. గోవిందరాజన్ జూన్ 19 న ప్రారంభోత్సవంచేస్తూ ఏలూరులో పశు సంక్షేమ కార్యక్రమం క్రింద ఒక ఎక్స్‌రే యూనిటు, చికిత్సా లేబొరెటరీలను త్వరలోనే ప్రారంభిస్తారని తెలియజేశారు. జిల్లాలోని డెల్టా ప్రాంతంలో మరో రెండు పాలశీతల కేంద్రాలను ప్రారంభించడానికి కృషి చేస్తున్నారని ఆయన అన్నారు.

## దెందులూరులో వనమహోత్సవం

పశ్చిమ గోదావరి జిల్లా కలక్టరు శ్రీ గోవిందరాజన్, జూన్ 30న దెందులూరులో వనమహోత్సవానికి ప్రారంభోత్సవం చేస్తూ చెట్లు రక్షణకు మాత్రమేగాక ఉత్పత్తికి కూడా ఉపకరిస్తాయని అన్నారు. పశ్చిమ గోదావరి జిల్లాలో 30,000 కొబ్బరి మొక్కలు నాట బడ్డాయని ఆయన తెలియజేశారు. గ్రామాలలోని ఉమ్మడి భూములలోను, రోడ్లు, చెరువు కట్టలపైన చెట్లు పెంచడానికి అపారమైన అవకాశాలు ఉన్నాయని ఆయన అన్నారు.

## గుంటూరు జిల్లాలో 73 హాస్టళ్ళు

సాంఘిక సంక్షేమశాఖ డైరెక్టరు శ్రీ కె. చంద్రయ్య జూన్ 30 న గుంటూరులో పత్రికా ప్రతినిధులతో మాట్లాడుతూ గుంటూరు జిల్లాలో ప్రభుత్వ హాస్టళ్ళను నిర్వహించడానికి ఏర్పాట్లు పూర్తి అయినాయని అన్నారు. 47 బాలుర హాస్టళ్ళు, 28 బాలికల హాస్టళ్ళు మొత్తం 73 హాస్టళ్లు ఏర్పాటు చేస్తాము, వాటిలో 1,655 మందికి ప్రవేశం కల్పిస్తాము. ఈ హాస్టళ్ళను క్రమ పద్ధతిలో నిర్వహించడానికి వీలుగా, బి ఎ , బి ఇడి విద్యార్హతలు గలిగి, ఉత్తమ సర్వీసుగల 28 వార్డెన్స్, 101 వంటవాళ్లు, 141 వాచ్‌మెన్‌లను నియమించడం జరిగింది. షెడ్యూలు తెగలు, షెడ్యూలు కులాలు, హరిజనులు, ఆర్థికంగా వెనుకబడిన తరగతులకు చెందిన అర్హులైన బాలబాలికలను ఎంపిక చేయడంలో ప్రత్యేక శ్రద్ధ తీసుకుంటున్నారు.

గుంటూరు పట్టణం సెలక్టు చేసిన కొన్ని హాస్టళ్ళను డైరెక్టరు తనిఖీచేసి, వాటి నిర్వహణపట్ల సంతృప్తివ్యక్తం చేశారు.

## అగ్ని బాధితులకు రొక్కం సహాయం

విశాఖ పట్నం జిల్లాలోని వివిధ గ్రామాలలో అగ్ని ప్రమాదానికి గురియైన వారికి జిల్లా కలక్టరు యిటీవల రు. 19,750/-లు మంజూరు చేశారు. నరసీపట్నం తాలూకాలోని కొంక పాలెం గ్రామానికి చెందిన 128 కుటుంబాలకు రు. 10,450/- లు లభించాయి. నరసీపట్నం, చోడవరం, ఎలమంచిలి, ఎస్. కోట, ఎలమంచి తాలూకాలోని 225 కుటుంబాలకు యీ సహాయం లభించింది.

## హరిజన కాలనీకి ప్రారంభోత్సవం

నల్లగొండ జిల్లా కలక్టరు, శ్రీ ఎల్. బుల్లయ్య, జూలై 3న భోనగిరి పంచాయితీ సమితిలోని పాక్యాపూర్ గ్రామంలో అంబేడ్కర్ హరిజన కాలనీకి ప్రారంభోత్సవం చేశారు. రు. 33,000/- ల ఖర్చుతో నిర్మించబడిన యీ కాలనీలో 33 యిండ్లు ఉన్నాయి. ఈ యిండ్లను హరిజనులకు ఉచితంగా యిచ్చారు.

## షెడ్యూలు కులాలవారికి పాడి పశువుల పంపిణీ

అనంతపురం జిల్లాలోని పశ్చిమ, తూర్పు కదిరి బ్లాకులలో సాంఘిక సంక్షేమం పథకం క్రింద అల్పాదాయం గల షెడ్యూలు కులాలవారికి 6 మేలిజాతి పాడి పశువులను పంపిణీ చేశారు.

## హరిజన దినోత్సవం

జూన్ 30వ తేదీన నెల్లూరు జిల్లా కావలి సమితి కొండబిట్రగుంట గ్రామంలో హరిజన దినోత్సవం జరిగింది. పది కుటుంబాలున్న హరిజన వాడలో పరిశుభ్రమైన ఇండ్ల గృహిణులను పుష్టికరమైన శిశువులను, సమితి స్త్రీ శిశు సంక్షేమ శాఖాధికార్లు శ్రీమతులు కృపాదానం, సుశీల ఎన్నికచేశారు. బహుమతులు, పప్పు బెల్లాలు పంచిపెట్టారు.

గ్రామంలోని కోనేరు నుండి మంచినీటిని గ్రామస్తులు, హరిజనులు కలిసి తెచ్చుకోవడం విశేషం.

## పాలూరు గ్రామంలో హరిజన దినోత్సవం

పశ్చిమ గోదావరిజిల్లా పెనుమంట్ర సమితి ఆధ్వర్యమున పాలూరు గ్రామంలో జూన్ 30వ తేదీన హరిజన దినోత్సవము జరుపబడినది.

ఈ ఉదయం శ్రమదాన్ కార్యక్రమముతో ప్రారంభమైన ఈ ఉత్సవములో గ్రామ సర్పంచ్ శ్రీమతి అల్లూరి సుబ్బలక్ష్మి సమితి సిబ్బంది, పల్లె ప్రజలు అమితోత్సాహముగా పాల్గొన్నారు.

PRINTED BY THE DIRECTOR OF PRINTING, GOVT. OF ANDHRA PRADESH, AT THE GOVT. CENTRAL PRESS HYDERABAD
PUBLISHED BY THE DIRECTOR OF INFORMATION, PUBLIC RELATIONS & TOURISM ANDHRA PRADESH, HYDERABAD.

